శ్రీరామ

**భాగవత సాధన**

# వామన విజయము

## ప్రార్థన

*8-1-క.

**శ్రీ**మన్నామ! పయోద

**శ్యా**మ! ధరాభృల్లలామ! **జ**గదభిరామా!

రా**మా**జనకామ! మహో

**ద్ధా**మ! గుణస్తోమధామ! **ద**శరథరామా!

టీక:- శ్రీమన్నామ = శ్రీరామ {శ్రీమన్నాముడు - శ్రీమత్ (మంగళవంతమైన) నామ (పేరు గలవాడు), రాముడు}; పయోదశ్యామ = శ్రీరామ {పయోద శ్యాముడు - పయోద (మేఘము వంటి) శ్యామ (నల్లనివాడు), రాముడు}; ధరాభృల్లలామ = శ్రీరామ {ధరాభృ ల్లలాముడు - ధరాభృత్ (రాజులలో) లలాముడు (శ్రేష్ఠమైనవాడు), రాముడు}; జగదభిరామ = శ్రీరామ {జగ దభిరాముడు - జగత్ (లోకములకు) అభి (మిక్కిలి) రాముడు (అందమైనవాడు), రాముడు}; రామాజనకామ = శ్రీరామ {రామాజన కాముడు - రామా (రమించునట్టి వారైన, స్త్రీ జన (జనులకు) కాముడు (మన్మథుని వంటివాడు, కోరబడు వాడు), రాముడు}; మహోద్ధామ = శ్రీరామ {మహోద్ధాముడు - మహా (గొప్ప) ఉద్ధాముడు (ఉద్ధరించెడివాడు), రాముడు}; గుణస్తోమధామ = శ్రీరామ {గుణస్తోమ ధాముడు - గుణస్తోమ (సుగుణములకు) ధాముడు (నెలవైనవాడు), రాముడు}; దశరథరామా = శ్రీరామ {దశరథ రాముడు - దశరథుని యొక్క కుమారుడైన రాముడు (ఆనందింప జేయువాడు), రాముడు}.

భావము:- మంగళకర మైన పేరు కలవాడా! మేఘం వంటి కాంతివంత మైన దేహం కలవాడా! రాజులలో బహు గొప్పవాడా! అఖిల లోకాలలో అందమైన వాడా! స్త్రీలకు మన్మథుని వంటి వాడా! బహు గంభీరమైన వాడా! సుగుణాలనే సంపదలకు నిలయమైన వాడా! దశరథకుమారు డైన శ్రీరామచంద్రా! అవధరించు!

## వామనుడు గర్భస్తు డగుట

8-489-క.



**ఏలింతు దివము సురలను<br>బాలింతు మహేంద్రయువతి భాగ్యశ్రీలం<br>దూలింతు దానవుల ని<br>ర్మూలింతు రిపుప్రియాంగముల భూషణముల్. "**

టీక:- ఏలింతున్ = పరిపాలింపజేసెదను; దివమున్ = స్వర్గమును; సురలనున్ = దేవతలను; పాలింతున్ = కాపాడెదను; మహేంద్ర = ఇంద్రుని {మహేంద్రుడు - మహా (గొప్ప) ఇంద్రుడు, దేవేంద్రుడు}; యువతిన్ = భార్యయొక్క; భాగ్య = సౌభాగ్యము; శ్రీలన్ = సంపదలను; తూలింతున్ = చలింపజేసెదను; దానవులన్ = రాక్షసులను; నిర్మూలింతున్ = నాశముచేసెదను; రిపు = శత్రువుల; ప్రియ = భార్యల; అంగముల = దేహమునందలి; భూషణముల్ = అలంకారములు.

భావము:- దేవతలు స్వర్గాన్ని పాలించేటట్లు చేస్తాను. శచీదేవి సౌభాగ్యాలను కాపాడతాను. రాక్షసులను అధికారం నుంచి తొలగించి, వారి ఇల్లాళ్ళ అలంకరాలను పోగొడతాను."

8-490-వ.

**అని యిట్లు భక్తజనపరతంత్రుండగు పురాణపురుషుం డానతిచ్చి తిరోహితుడయ్యెె; నయ్యదితియుఁ గృతకృత్య యై సంతోషంబునఁ దన మనోవల్లభుండగు కశ్యపు నాశ్రయించి సేవించుచుండె; నంత నొక్క దివసంబున.**

టీక:- అని = అని; ఇట్లు = ఈ విధముగ; భక్త = భక్తులైన; జన = వారికి; పరతంత్రుడు = లొంగిపోవువాడు; అగు = అయినట్టి; పురాణపురుషుండు = హరి; ఆనతిచ్చి = చెప్పి; తిరోహితుండు = మాయమైనవాడు; అయ్యెన్ = అయ్యెను; ఆ = ఆ; అదితియున్ = అదితి; కృతకృత్య = కృతార్థురాలు; ఐ =అయ్యి; సంతోషంబునన్=సంతోషముతో; తన=తన యొక్క; మనోవల్లభుండు = భర్త; అగు = అయిన; కశ్యపున్ = కశ్యపుని; ఆశ్రయించి = చేరి; సేవించు చుండెన్ = కొలుచుచుండెను; అంతన్ = అంతట; ఒక్క = ఒక; దివసంబున = దినము.

భావము:- ఆ విధంగా భక్తజన విధేయుడైన విష్ణుమూర్తి సెలవిచ్చి మాయమయ్యాడు. కృతార్థురాలైన అదితి సంతోషంతో తన ప్రాణవల్లభుడైన కశ్యపప్రజాపతిని చేరి సేవించసాగింది. అటు పిమ్మట ఒకనాడు, . . .

8-491-ఆ.

## ఘన సమాధినుండి కశ్యపుఁ డచ్యుతు
## నంశ మాత్మనొలయ నదితి యందుఁ
## దనదు వీర్య మధికతరము సేర్చెను గాలి
## శిఖిని దారువందుఁజేర్చినట్లు.

టీక:- ఘన = గొప్ప; సమాధిన్ = యోగసమాధి; నుండి = నుండి; కశ్యపుడు = కశ్యపుడు; అచ్యుతున్ = హరి యొక్క; అంశన్ = అంశను; ఆత్మన్ = తనయందు; ఒలయన్ = ప్రవేశించగా; అదితి = అదితి; అందున్ = లో; తనదు = తనయొక్క; వీర్యమున్= రేతస్సును; అధికతరమున్ = మిక్కిలి అధికమైనదిగా {అధికము - అధికతరము - అధికతమము}; చేర్చెన్ = చేర్చెను; గాలి = వాయువు; శిఖిని = అగ్నిని; దారువు = కొయ్య; అందున్ = లో; చేర్చిన = చేర్చిన; అట్లు = విధముగ.

భావము:- తపస్సులోనున్న కశ్యపునిలో విష్ణువుతేజస్సు ప్రవేశించింది. వాయువు కొయ్యలో అగ్నినిచేర్చినవిధంగా అదితి యందు కశ్యపుడు తన అసాధారణమైన వీర్యాన్ని చేర్చాడు.

8-492-వ.

## ఇట్లు కశ్యప చిరతర తపస్సంభృత వీర్యప్రతిష్ఠిత గర్భయై సురల తల్లి యుల్లంబున నుల్లసిల్లుచు నుండె; నంత.

టీక:- ఇట్లు = ఈ విధముగ; కశ్యప = కశ్యపుని యొక్క; చిరతర = చాలా ఎక్కువ కాలము {చిరము - చిరతరము - చిరతమము}; తపస్ = చేసినతపస్సుచే; సంభృత = చక్కగాధరించిన; వీర్య = రేతస్సు; ప్రతిష్ఠిత = ఉంచబడిన; గర్భ = గర్భాశయము కలామె; ఐ = అయ్యి; సురలతల్లి = అదితి {సురలతల్లి - దేవతల మాత, అదితి}; ఉల్లంబునన్ = మనసునందు; ఉల్లసించుచున్ = సంతోషించుచు; ఉండెను = ఉండెను; అంత = అప్పుడు.

భావము:- రాజా పరీక్షిత్తూ! ఈ విధంగా కశ్యపుడు చాలాకాలంగా మహతపో విశేషంతో సంపాదించిన వీర్యంవల్ల అదితి గర్భాన్ని ధరించింది. ఆమె మనసు చాలా ఉల్లాసాన్ని పొందింది.

8-493-క.

**చలచలనై పిదపిదనై**
**గలలంబై కరుడు గట్టి గళనాళముతోఁ**
**దలయేర్పడి గర్భంబై**
**నెలమసలం జీరచిక్కె నెలఁతకు నధిపా!**

టీక:- చలచలను = కదిలెడిద్రవమువలె; ఐ = అయ్యి; పిదపిదన్ = మెత్తమెత్తగా; ఐ = అయ్యి; కలలంబు = గర్భపిండము; ఐ = అయ్యి; కరడుగట్టి = గట్టిబడి; గళనాళము = గొంతు; తోన్ = తోబాటు; తల = శిరస్సు; ఏర్పడి = ఏర్పడి; గర్భంబు = పిండముగా; ఐ = అయ్యి; నెలమసలన్ = నెలతప్పగా; చీరజిక్కె = కడుపు వచ్చినది {చీరజిక్కు - చీర చాలలేదు, కడుపు వచ్చెను}; నెలత = యువతి; కున్ = కు; అధిపా = రాజా.

భావము:- ఒక నెల గడిచింది. అదితి కడుపులో క్రమక్రమంగా ద్రవరూపమూ మెత్తని రూపమూ గడ్డకట్టి పిండరూపము ఏర్పడింది. నెల తప్పింది గొంతుతోపాటు తల ఏర్పడి గర్భం నిలిచింది.

8-494-క.

**నెలతకుఁ జూలై నెల రె**
**న్నెలలై మఱి మూఁడు నాల్గు నెలలై వరుసన్**
**నెలలంతకంత కెక్కఁగ**
**నెలలును డగ్గఱియె నసుర నిర్మూలతకున్.**

టీక:- నెలత = సతి; కున్ = కి; చూలు = కడుపు; ఐ = వచ్చి; నెల = ఒకటవనెల (1); రెన్నెలలు = రెండునెలలు (2); ఐ = అయ్యి; మఱి = ఇంకా; మూడు = మూడు (3); నాల్గు = నాలుగు (4); నెలలు = నెలలు; ఐ = నిండి; వరుసన్ = క్రమముగా; నెలలు = నెలలు; అంతకంతకున్ = అంతకంతకు; ఎక్కగా = నిండుతుండగా; నెలలు = సమయము; డగ్గఱియెన్ = దగ్గరపడినది; అసుర = రాక్షస; నిర్మూలత = సంహారమున; కున్ = కు.

భావము:- అదితి చూలాలైన తరువాత వరుసగా ఒకటి రెండు మూడు నాలుగు నెలలు గడిచాయి. క్రమంగా నెలలు పెరిగినాయి. దానితోపాటు రాక్షసులు నాశనం కావడానికి నెలలు సమీపించాయి.

8-495-క.

**మహితతర మేఘమాలా**
**పిహితాయుత చండభాను బింబప్రభతో**
**విహితాంగంబులఁ గశ్యపు**
**గృహిణీగర్భమున శిశువుఁ గ్రీడించె నృపా!**

టీక:- మహితతర = మిక్కిలిగొప్పదైన; మేఘ = మబ్బుల; మాలా = గుంపులచే; పిహిత = కప్పివేయబడిన; అయుత = పదివేల; చండభాను = సూర్య; బింబ = బింబముల; ప్రభ = ప్రకాశము; తోన్ = తో; విహిత = చక్కటి; అంగంబులన్ = అవయవములతో; కశ్యపు = కశ్యపుని; గృహిణీ = ఇల్లాలు యొక్క; గర్భమునన్ = కడుపులో; శిశువు = శిశువు; క్రీడించెన్ = కదలాడసాగెను; నృపా = రాజా {నృపుడు - నరులను పాలించువాడు, రాజు}.

భావము:- పరీక్షిన్మహారాజా! అదితి గర్భంలో అవయవాలతోకూడిన ఆ అద్భుత శిశువు గొప్ప మేఘాలు కప్పిన సూర్యబింబాల వెలుగుతో కదలాడసాగాడు.

8-496-క.

**తనకడుపున నొక యిరువునఁ**
**వనరుహగర్భాండభాండ వనధిచయంబుల్**
**గొనకొని జగములు నిడుకొని**
**తనుగతిఁ గడు నడఁగి మడిఁగి తనరెన్ బెడఁగై.**

టీక:- తన = తన యొక్క; కడుపునన్ = గర్భమునందు; ఒక = ఒక; ఇరువున = పక్కన; వనరుహగర్భాండభాండ = బ్రహ్మాండముల {వనరుహగర్భాండభాండము - వనరుహగర్భ (బ్రహ్మ) అండముల భాండములు (గుంపులు), బ్రహ్మాండభాండములు}; వనధి = సముద్రముల {వనధి -వనము(నీటి)కి నిధి, సముద్రము}; చయంబుల్= సమూహములు; కొనకొని = కూడుకొనిన; జగములున్ = భువనములను; ఇడుకొని =

ఉంచుకొని; తను = సన్ననిఅర్భకుని; గతిన్ = వలె; అడగి = అణిగి; మడిగి = మణిగి; తనరెన్ = చక్కగ నుండెను; బెడగు = అందగించినవాడు; ఐ = అయ్యి.

భావము:- అదితి గర్భంలోని చిన్నారి శిశువు భూగోళాలనూ ఖగోళాలను సముద్రాలను సమస్తలోకాలనూ తన కడుపులో ఇమిడించికొని సన్నసైన చిన్ని రూపంతో అందంగా అణగిమణిగి ఉన్నాడు.

8-497-వ.

**అంత న క్కాంతాతిలకంబు క్రమక్రమంబున.**

టీక:- అంతన్ = ఆ సమయమున; ఆ = ఆ; కాంతా = స్త్రీలలో; తిలకంబు = శ్రేష్ఠురాలు; క్రమక్రమంబున్ = క్రమముగా.

భావము:- అదితి క్రమక్రమంగా నిండుచూలాలు అయింది. . .

8-498-మ.

**నిలిపెన్ ఱెప్పల బృందిమన్, విశదిమన్ నేత్రంబులం, జూచుకం**
**బులనాకాళిమ, మేఖలం ద్రఢిమ, నెమ్మోమారఁగాఁ బాండిమన్**
**బలిమిం జన్నుల, శ్రోణిపాళిగరిమన్, మధ్యంబునన్ బృంహిమ**
**న్లలితాత్మన్ లఘిమన్, మహామహిమ మేనన్ గర్భదుర్వారమై.**

టీక:- నిలిపెన్ = స్థిరపరచెను; ఱెప్పల = కనురెప్పల; బృందిమన్ = మనోజ్ఞతను; విశదిమన్ = పెద్దవిగా ఉండుటయందు; నేత్రంబులన్ = కన్నులను; చూచుకంబులన్ = చనుమొనలను; ఆ = ఆ ; కాళిమన్ = నల్లదనమును; మేఖలన్ = ఒడ్డాణము; ద్రఢిమన్ = బిగువుకావడమును; నెఱ = నిండు; మోము = ముఖము; ఆరగాన్ = ఒప్పుగా; పాండిమన్ = తెల్లదనమును; బలిమిన్ = బలిష్ఠము; చన్నులన్ = స్తనములందు; శ్రోణి = పిరుదుల; పాళి = ప్రదేశము; గరిమన్ = గొప్పదనమును; మధ్యంబునన్ = నడుమునందు; బృంహిమ = లావగుట; లలిత = మనోజ్ఞమైన; ఆత్మన్ = మనసునందు; లఘిమన్ = తేలికపడుట; మహా = మిక్కిలి; మహిమ = మహత్వము; మేనన్ = దేహమునందు; గర్భ = గర్భము; దుర్వారము = ఆపలేనిది; ఐ = అయ్యి.

భావము:- ఆమె రెప్పలు అందంగా ఒప్పాయి: కన్నులు నిర్మలమయ్యాయి: స్తనాగ్రాలు నల్లపడ్డాయి: ఒడ్డాణం బిగుపైంది; ముఖం తెల్లబడింది: పిరుదులు బరువెక్కాయి: నడుము విస్తరించింది: మనస్సు తేలికపడింది. దేహం మహత్వాన్ని పొందింది. గర్భం అతిశయించింది.

8-499-క.

పెట్టుదురు నుదుట భూతిని
బొట్టిడుదురు మేఁన బట్టుఁ బుట్టపుదోయిం
బెట్టుదురు వేల్పు లమ్మకుఁ
గట్టుదురు సురక్ష పడఁతిగర్భంబునకున్.

టీక:- పెట్టుదురు = పెట్టెదరు; నుదుటన్ = నుదుటిమీద; భూతిని = విభూతిని; బొట్టిడు దురు = బొట్టుగా పెట్టెదరు; మేనన్ = ఒంటిమీదకి; పట్టు=పట్టు; పుట్టపు=బట్టల; దోయిన్ = జత (2)ని; పెట్టుదురు = పెట్టెదరు; వేల్పులమ్మ = అదితి; కున్ = కి; కట్టుదురు = కట్టెదరు; సురక్ష = రక్షాతోరమును; పడతి = సతి యొక్క; గర్భంబున్ = గర్భమున; కున్ = కు.

భావము:- పెద్దముత్తైదువలు ఆదిత్యులకు తల్లి అయిన అదితికి నుదుట విభూతి పెట్టారు. తిలకం దిద్దారు పట్టుబట్టలు కట్టారు. ఆమె గర్భానికి రక్ష కట్టారు.

8-500-వ.

ఇవ్విధంబున.

టీక:- ఈ = ఈ; విధంబునన్ = విధముగ.

భావము:- ఈ విధంగా హరి గర్భస్థుడు అయి. . .

8-501-తే.

విశ్వగర్భుఁడు దన గర్భ వివరమందుఁ
బూటపూటకుఁ బూర్ణుఁడై పొటకరింప
వ్రేఁక జూలాలితనమున వేల్పుఁ బెద్ద
పొలఁతి కంతట నీళ్ళాడు ప్రొద్దులయ్యె.

టీక:- విశ్వగర్భుడు = నారాయణుడు {విశ్వగర్భుడు - విశ్వము గర్భమున కలవాడు, విష్ణువు}; తన = తన యొక్క; గర్భవివరము = గర్భాశయము; అందున్ = లో; పూటపూట = రోజురోజు; కున్ = కి; పూర్ణుడు = నిండుతున్నవాడు; ఐ = అయ్యి; పొటకరింపన్ = వర్ధిల్లుచుండగా; వ్రేకన్ = భారమైన; చూలాలితనమునన్ =

నిండుచూలాలిగ; వేల్పుపెద్దపొలతి = అదితి; కిన్ = కి; అంతట = అప్పుడు; నీళ్ళాడు = ప్రసవించెడి, పురిటి; ప్రొద్దులు = సమయము, దినములు; అయ్యె = అయినది.

భావము:- అదితి గర్భంలో విశ్వగర్భుడైన భగవంతుడు పూర్ణుడు అవుతూ పూటపూటకూ పెరగసాగాడు. గర్భం బరువెక్కసాగింది. దేవతల కన్నతల్లి అదితి నీళ్ళాడే సమయం ఆసన్నమయింది.

## గర్భస్థ వామనుని స్తుతించుట

8-502-వ.

**తదనంతరంబునం జతురాననుం డరుగుదెంచి యదితి గర్భ పరిభ్రమ విభ్రముం డగు నప్పరమేశ్వరు నుద్దేశించి యిట్లని స్తుతియించె.**

టీక:- తదనంతరంబునన్ = ఆ తరువాత; చతురాననుండు = బ్రహ్మదేవుడు {చతురాననుడు - చతుః (నాలుగు) ఆననుడు (ముఖములవాడు), బ్రహ్మ}; అరుగుదెంచి = వచ్చి; అదితి = అదితి; గర్భ = గర్భమునందు; పరిభ్రమ = తిరుగుచు; విభ్రముండు = విలాసముగ నున్నవాడు; అగు = అయిన; ఆ = ఆ; పరమేశ్వరున్ = భగవంతుని; ఉద్దేశించి = ఉద్దేశించి; ఇట్లు = ఈ విధముగ; అని = అని; స్తుతియించె = కీర్తించెను.

భావము:- ఆ సమయంలో బ్రహ్మదేవుడు వచ్చి, అదితి గర్భంలో అందంగా కలియ తిరుగుతూ కదలాడుతున్న భగవంతుని ఉద్దేశించి ఈవిధంగా స్తోత్రం చేసాడు.

8-503-సీ.

***"త్రిభువన జయరూఢ! దేవ! త్రివిక్రమ!-**
**పృథులాత్మ! శిపివిష్ట! పృశ్నిగర్భ!;**
**ప్రీత! త్రినాభ! త్రిపృష్ఠ! జగంబుల-**
**కాద్యంత మధ్యంబు లరయ నీవ;**

జంగమ స్థావర జననాది హేతువు-
నీవ; కాలంబపై నిఖిల మాత్మ
లోపల ధరియింతు లోని జంతుల నెల్ల-
స్రోతంబులోఁ గొను చొప్పు దోఁప;

8-503.1-తే.

బ్రహ్మలకు నెల్ల సంభవ భవన మీవ;
దివమునకుఁ బాసి దుర్దశ దిక్కులేక
శోకవార్ధి మునింగిన సురలకెల్లఁ
దేల నాధార మగుచున్న తెప్ప నీవ.

టీక:- త్రిభువనజయరూఢ = విష్ణువు {త్రిభువనజయరూఢుడు - త్రిభువన (ముల్లోకము లను) జయ (జయించుట) రూఢుడు (నిశ్చయముగాగలవాడు), విష్ణువు}; దేవ = విష్ణువు {దేవ - భగవంతుడు, విష్ణువు}; త్రివిక్రమ = విష్ణువు {త్రివిక్రమ - ముల్లోకములను ఆక్రమిం చినవాడు, విష్ణువు}; పృథులాత్మ = విష్ణువు {పృథులాత్ముడు - పృథుల (మహా) ఆత్ముడు, విష్ణువు}; శిపివిష్ట = విష్ణువు {శిపివిష్టః - వ్యు. శిపి + విశ + క్త – కృ.ప్ర., వెలుగై వ్యాపించువాడు, కిరణముల స్వరూపమున అంతటనువ్యాపించియున్నవాడు, యజ్ఞపశువు నందు వ్యాపించి యున్నవాడు, విష్ణువు (తెవికె), సూర్యకిరణ ప్రతాపము తానైనవాడు, విష్ణుసహస్రనామాలు శ్రీశంకరభాష్యం 273వ నామం}; పృశ్నిగర్భ = విష్ణువు {పృశ్నిగర్భ - పృశ్ని (కిరణములకు) గర్భ (జన్మస్థానమైనవాడు) (మిక్కిలిగ ప్రకాశించువాడు), పృశ్ని (అదితి పూర్వజన్మ నామము) గర్భముననున్న వాడు, విష్ణువు}; ప్రీత = విష్ణువు {ప్రీత - సర్వులకు ప్రీతి యైనవాడు, విష్ణువు}; త్రినాభ = విష్ణువు {త్రినాభ - మూడు (లోకములు) నాభి యందు కలవాడు, విష్ణువు}; త్రిపృష్ఠ = విష్ణువు {త్రిపృష్ట - త్రి (మూడు -అడుగులు) పృష్ట (అడుగబడినవి కలవాడ), వామనుడు, విష్ణువు}; జగంబుల = లోకములకు; ఆది = మొదలు; అంత = చివర; మధ్యంబులు = మధ్య భాగములు; అరయన్=తరచిచూసిన; నీవ = నీవే; జంగమ = చర; స్థావర = అచరము లకు; జనన = పుట్టుకలకు; ఆది=ముఖ్య; హేతువు = కారణభూతుడవు; నీవ = నీవే; కాలంబవు = కాలస్వరూపుడవు; ఐ = అయ్యి; నిఖిల = సమస్తమైన; ఆత్మన్ = జీవ

కోటిని; లోపలన్ = నీ యందే; ధరియింతు = ధరించెదవు; లోని = లోపలయున్న; జంతులన్ = ప్రాణులను; ఎల్లన్ = అన్నిటిని; స్రోతంబు = ప్రవాహము; లోన్ = లోనికి; కొను = తీసుకొనెడి; చొప్పు = విధముగ; తోపన్ = అనిపించునట్లు.

బ్రహ్మల = సృష్టికర్తల; కున్ = కు; ఎల్లన్ = అందరకు; సంభవ = పుట్టుకలకు; భవనము = స్థానము; ఈవ = నీవే; దివమున్ = స్వర్గమునకు; పాసి = దూరమై; దుర్దశన్ = కష్టము లలో; దిక్కు = శరణమిచ్చువారు; లేక = లేకపోవుటచేత; శోక = శోకము యనెడి; వార్ధిన్ = సముద్రమున; మునింగిన = మునిగిపోయిన; సురల = దేవతల; కున్ = కు; ఎల్లన్ = అందరకు; తేలన్ = బయటపడుటకు; ఆధారము = ఆధార భూతము; అగుచున్న = అగుచున్న; తెప్ప = నావ; నీవ = నీవే.

భావము:- "అదితి గర్భంలో వర్ధిల్లుతున్న ఓ స్వామీ! నీవు ముల్లోకాలనూ జయింపగల వాడవు: దేవాధిదేవుడవు: ముల్లోకములనూ ఆక్రమించు వాడవు: మహాత్ముడవు: కిరణముల రూపమున సర్వస్వమునందు వ్యాపించి ఉండువాడవు: కిరణములకు మూలము అయిన వాడవు: పృశ్ని అను నామాంతరం గల అదితి గర్భంలో పుట్టిన వాడవు: సర్వులకు ఇష్టుడవైన విష్ణువు నీవు: సమస్త భువనాలనూ సంతోషంగా నీ కడుపులో దాచుకుంటావు: ఈలోకాలకు మొదలూ నడుమ తుదా నీవే: చరాచర ప్రపంచం పుట్టడానికి కారణం నీవే: కాలమై సమస్తమూ నీ లోపలే ధరిస్తావు: ప్రవాహం ప్రాణికోటిని ధరించినట్లు సమస్త జీవులనూ నీలోనే నిలుపు కొంటావు: సృష్టికర్తలకు సృష్టికర్తవు నీవు: స్వర్గ లోకాన్ని పోగొట్టుకొని దేవతలు కష్టసముద్రంలో మునిగారు. వారిని కాపాడి గట్టు చేర్చే తెప్పవు నీవు.

8-504-క.

## విచ్చేయు మదితి గర్భము
## చెచ్చెర వెలువడి మహాత్మ! చిరకాలంబున్
## విచ్చలవిడి లే కమరులు
## ముచ్చటపడి యున్నవారు ముద మందింపన్. "

టీక:- విచ్చేయుము = రమ్ము; అదితి = అదితియొక్క; గర్భమున్ = కడుపులోనుండి; చెచ్చెరన్ = శీఘ్రమే; వెలువడి = బయటకు వచ్చి; మహాత్మా = గొప్పవాడ; చిరకాలంబున్ = చాలాకాలమునుండి; విచ్చలవిడిన్ = స్వేచ్ఛ; లేక = లేకపోవుటచేత; అమరులు = దేవతలు; ముచ్చటపడి = కోరుతు; ఉన్నవారు = ఉన్నారు; ముదము = సంతోషమును; అందింపన్ = సమకూర్చుటానికై.

భావము:- మహానుభావా! చాలాకాలంగా దేవతలు స్వేచ్ఛకోసం ఆరాటపడుతున్నారు. వారికి సంతోషాన్ని సమకూర్చడానికై తొందరగా అదితి గర్భం నుండి వెలువడి వేంచేయవయ్యా."

8-505-వ.

## అని యిట్లు కమలసంభవుండు వినుతిచేయు నయ్యవసరంబున.

టీక:- అని = అని; ఇట్లు = ఈ విధముగ; కమలసంభవుండు = బ్రహ్మదేవుడు {కమలసంభవుడు - కమలమునందు సంభవుడు (పుట్టినవాడు), బ్రహ్మ}; వినుతి = స్తోత్రములు; చేయన్ = చేయగా; ఆ = ఆ; అవసరంబునన్ = సమయమునందు.

భావము:- కమలంలో పుట్టిన బ్రహ్మదేవుడు ఈ విధంగా స్తుతిస్తూ ఉన్న ఆ సమయములో. . .

## వామను డవతరించుట

8-506-మ.

## రవిమధ్యాహ్నమునం జరింప గ్రహతారాచంద్రభద్రస్థితిన్
## శ్రవణద్వాదశినాఁడు శ్రోణ నభిజిత్సంజ్ఞాత లగ్నంబునన్
## భువనాధీశుఁడు పుట్టె వామనగతిం బుణ్యవ్రతోపేతకున్
## దివిజాధీశ్వరు మాతకుం బరమపాతివ్రత్య విఖ్యాతకున్.



టీక:- రవి=సూర్యుడు; మధ్యాహ్నము= మధ్యాహ్నము, సూర్యుడు ఆకాశము నట్ట నడుమ ఉండు సమయము; అందున్ = లో; చరింపన్ = తిరుగుచుండగ; గ్రహ = గ్రహ ములు; తార = నక్షత్రములు; చంద్ర = చంద్రుడు; భద్ర = ఉచ్చ; స్థితిన్ = దశలోనుండగ; శ్రవణద్వాదశి = శ్రవణ నక్షత్రంతో కూడిన భాద్రపద శుద్ధ ద్వాదశి (పారమార్థిక పదకోశం, పొత్తూరి వేంకటేశ్వరరావు); నాడు = దినమున; శ్రోణ = శ్రవణ నక్షత్ర యుక్తమైన; అభిజిత్ = అభిజిత్తు {అభిజిత్తు - మిట్టమధ్యాహ్నము 24 నిమిష

ముల ముందునుండి 24 నిమిషములవరకు గల కాలము, దినమునందు 8వ ముహూర్తము, అభిజిత్ లగ్నము లేదా ముహూర్తము}; సంజ్ఞాత = అనెడి పేరుగల; లగ్నంబునన్ = లగ్నమునందు; భువనాధీశుడు = విష్ణువు {భువనాధీశుడు - భువన (జగత్తునకు) అధీశుడు (ప్రభువు), విష్ణువు}; పుట్టెన్ = జన్మించెను; వామన = పొట్టివాని; గతిన్ = వలె; పుణ్య = పుణ్యవంతమైన; వ్రత = వ్రత నిష్ఠలు; ఉపేత = కలిగి యున్నామె; కున్ = కు; దివిజాధీశ్వరుమాత =అదితి {దివిజాధీశ్వరు మాత - దివిజాధీశ్వరుని (ఇంద్రుని) మాత, అదితి}; పరమ = అత్యుత్తమమైన; పాతివ్రత్య = పతివ్రతగా; విఖ్యాత = ప్రసిద్ధిపొందినామె; కున్ = కు.

భావము:- అలా బ్రహ్మదేవుడు స్తోత్రం చేసిన పిమ్మట, నిర్మలమైన నియమంతో గొప్ప పతివ్రతగా పేరు పొందిన దేవేంద్రుని తల్లి అయిన అదితి గర్భం నుండి వామన రూపంతో సకల లోకాధీశుడు అయిన మహావిష్ణువు జన్మించాడు. అది శ్రవణద్వాదశి అనగా శ్రవణ నక్షత్రంతో కూడిన భాద్రపద శుద్ధ ద్వాదశి తిథి; అభిజిత్తు అనబడే లగ్నం; పట్టపగలు సూర్యుడు ఆకాశం నట్టనడుమ ప్రకాశిస్తున్నాడు; గ్రహాలూ నక్షత్రాలూ చంద్రుడూ ఉచ్ఛదశలో ఉన్నాయి. అట్టి శుభకర సమయంలో వామనుడు అవతరించాడు.

8-507-వ.

## మఱియునద్దేవుండు శంఖచక్రగదాకమలకలిత చతుర్భుజుం డునుఁ బిశంగవర్ణవస్త్రుండును. మకరకుండల మండిత గండ భాగుండును, శ్రీవత్సవక్షుండును, నళినచక్షుండును, నిరంతర శ్రీవిరాజిత రోలంబ కదంబాలంబిత వనమాలికా పరిష్కృతుం డును, మణికనకాంచిత కాంచీవలయాంగద కిరీటహార నూపు రాలంకృతుండునుఁ, గమనీయ కంఠ కౌస్తుభాభరణుండును, నిఖిలజన మనోహరణుండునునై యవతరించిన సమయంబున.

టీక:- మఱియున్ = ఇంకను; శంఖ = శంఖము; చక్ర = చక్రము; గదా = గద; కమల = పద్మము; కలిత = ధరించిన; చతుః = నాలుగు (4); భుజుండునున్ = చేతులు గలవాడు; పిశంగ = కపిల; వర్ణ = రంగుగల; వస్త్రుండును = బట్టలుధరించినవాడు; మకరకుండల=మకరకుండలములచే {మకరకుండలములు - కర్ణాభరణ విశేషములు}; మండిత = మెరిసెడి; గండభాగుండును = చెక్కిళ్ళు గలవాడు; శ్రీవత్స = శ్రీవత్సము యనెడి మచ్చ; వక్షుండును = వక్షస్థలమున కలవాడు; నళిన = పద్మముల వంటి;

చక్షుండును = కన్నులు కలవాడు; నిరంతర = ఎల్లప్పుడును; శ్రీ = సౌభాగ్యముతో; విరాజిత = విరాజిల్లెడి; రోలంబ = తుమ్మెదల; కదంబ = సమూహములుతో కూడిన; ఆలంబిత = ధరింపబడిన; వనమాలికా = వనమాలచే {వనమాల - పువ్వులు ఆకులు కలిపికట్టిన దండ}; పరిష్కృతుం డును = అలంకరింపబడినవాడు; మణి = రత్నములు; కనక = బంగారము; అంచిత = పొదగబడిన; కాంచీ = మొలనూలు; వలయ = కడియాలు; అంగద = బాహుపురులు; కిరీట = కిరీటము; హార = హారములు; నూపురా = కాలిఅందెలుచే; అలంకృతుండును = అలంక రింపబడినవాడు; కమనీయ = అంద మైన; కంఠ = మెడలో; కౌస్తుభ = కౌస్తుభమణి; ఆభరణుండును = ఆభరణముగా గల వాడు; నిఖిల = సమస్తమైన; జన = వారి; మనస్ = మనసులను; హరణుండును = ఆకర్షించువాడు; ఐ = అయ్యి; అవతరించిన = పుట్టిన; సమయంబున = సమయము నందు.

<u>భావము</u>:- వామనుడు జన్మించినప్పుడు అతనికి నాలుగు చేతులు ఆ చేతులలో శంఖమూ, చక్రమూ, గదా, పద్మమూ; కపిల రంగు వస్త్రమూ, మకరకుండలాలతో మెరిసే చెక్కిళ్ళు; రొమ్ముపై శ్రీవత్సమూ; కమలాల వంటి కన్నులు కలిగి ఉన్నాడు. తుమ్మెదలు మూగిన అందమైన వనమాల (వైజయంతి మాల) మెడలో వేళ్ళాడుతున్నది. రత్నాలు కూర్చిన బంగారు వడ్డాణం బాహుపురులూ, కిరీటమూ, హారాలూ, కాలిఅందెలూ, కాంతులు వెదజల్లుతున్నాయి. కమనీయమైన మెడలో కౌస్తుభమణి మెరుస్తున్నది. అతని రూపం అఖిల జనుల మనస్సులను అకర్షిస్తున్నది.

8-508-శా.

**<u>చిం</u>తం**బాసిరి యక్ష తార్క్ష్య సుమనస్సిద్ధోరగాధీశ్వరుల్
**<u>సం</u>తో**షించిరి సాధ్య చారణ మునీశబ్రహ్మ విద్యాధరుల్
**<u>గాం</u>తిం**జెందిరి భానుచంద్రములు; రంగద్గీత వాద్యంబులన్
**<u>గం</u>తుల్** వైచిరి మింటఁ గింపురుషులున్ గంధర్వులుం గిన్నరుల్.

<u>టీక</u>:- చింతన్ = శోకములను; పాసిరి = విడిచితిరి; యక్ష = యక్షులు; తార్క్ష్య = గరుడులు; సుమన = దేవతలు; సిద్ధ = సిద్ధులు; ఉరగ = నాగులు; అధీశ్వరులు = ప్రభువులు; సంతోషించిరి = సంతోషించిరి; సాధ్య = సాధ్యులు; చారణ = చారణులు; మునీశ = మునీశ్వరులు; బ్రహ్మ = ఋత్విజులు; విద్యాధరుల్ = విద్యాధరులు; కాంతిన్ = వికాశమును; చెందిరి = పొందిరి; భాను = సూర్యుడు; చంద్రములు = చంద్రుడు; రంగత్ = ఆనందపు; గీత = గీతములతోను; వాద్యంబులన్ = వాద్యములతోను; గంతుల్

= నాట్యములు; పైచిరి = చేసిరి; మింటన్ = ఆకాశమునందు; కింపురుషులున్ = కింపురుషులు; గంధర్వులున్ = గంధర్వులు; కిన్నరుల్ = కిన్నరలు.

భావము:- వామనుడు పుట్టటంతో యక్షులూ, గరుడులూ, దేవతలూ, సిద్ధులూ, నాగులూ తమ చింతలు అన్నీ విడిచిపెట్టారు. సాధ్యులూ, చారణులూ, ఋషులూ, ఋత్విజులూ, విద్యాధరులూ సంతోషించారు. సూర్య చంద్రులు మిక్కిలి ప్రకాశవంతులు అయ్యి కాంతులు విరజిమ్మారు. గంధర్వులూ, కిన్నరులూ, కింపురుషులూ వాద్యాలు మ్రోగిస్తూ ఆటపాటలతో ఆకాశంలో నాట్యాలు చేశారు.

8-509-క.

**దిక్కులకావిరి వాసెను**

**నెక్కువ నిర్మలత నొందె నేఁడు పయోధుల్**

**నిక్కమెయి నిలిచె ధరణియుఁ**

**జుక్కల త్రోవయును విప్రసుర సేవ్యములై.**

టీక:- దిక్కుల = దిక్కులందలి; కావిరి = నలుపు, మాపు; పాసెను = పోయెను; ఎక్కువ = చాలా; నిర్మలతన్ = నిర్మలముగ నుండుటను; ఒందె = పొందినవి; ఏడు = ఏడు; పయోధుల్ = సముద్రములు; నిక్కమెయి = ధృడమా; నిలిచె = అలరారెను; ధరణియున్ = భూమండలము; చుక్కలత్రోవయును = ఆకాశము {చుక్కలత్రోవ - చుక్కలు (నక్షత్రములు) త్రోవ (తిరుగు స్థలము), ఆకాశము}; విప్ర = బ్రాహ్మణులు; సుర = దేవతలు చేత; సేవ్యములు = కొలువబడినవి; ఐ = అయ్యి.

భావము:- వామనుడు అవతరించడంతో, బ్రాహ్మణులతో దేవతలతో సేవింపడుతూ, సకల దిక్కులు అందలి కావిరిరంగు కరగిపోయింది; సప్తసముద్రాలు నిర్మలం అయ్యాయి; భూమి, ఆకాశం ధృడంగా అలరారెను.

8-510-క.

**ముంపుఁగొని విరుల వానల**

**జొంపంబులుఁ గురియు సురలు, సుమనోమధువుల్**

**తుంపర లెగయఁ బరాగపు**

**రొంపుల భూభాగమతి నిరూషిత మయ్యెన్.**

టీక:- ముంపుగొని = గుంపులుగూడి; విరుల = పూల; వానలన్ = వానలను; జొంపం బులన్ = పొదరిండ్లు; కురియు = వర్షించెను; సురలు = దేవతలు; సుమనస్ = పూల;

మధువుల్ = మకరందము; తుంపరలు = బిందువులు; ఎగయన్ = ఎగురు తుండగ; పరాగపు = పుప్పొటి; రొంపులన్ = గుట్టలతో, బురదలతో; భూభాగము = భూమండలము; అతి = మిక్కిలి; నిరూపితము = నిండిపోయినది; అయ్యెన్ = అయినది.

భావము:- వామనుడు జన్మించడంతో, పొదరిండ్లు విశేషంగా పూలజల్లులు విరజల్లాయి. దేవతలు కురిపించిన పూలవానల మకరంద బిందువులు అంతటా వ్యాపించాయి. పుప్పొడుల కుప్పలతో భూభాగం నిండిపోయింది.

8-511-వ.

**తదనంతరంబ.**

టీక:- తత్ = ఆ; అనంతరంబ = తరువాత.

భావము:- అలా వామనుడు అవతరించిన పిమ్మట. . .

8-512-ఆ.

**"ఈ మహానుభావుఁ డెట్లింత కాలంబు**
**నుదర మందు నిలిచి యుండె"ననుచు**
**నదితి వెఱఁగుపడియె నానంద జయశబ్ద**
**ములను గశ్యపుండు మొగి నుతించె.**

టీక:- ఈ = ఈ యొక్క; మహానుభావుడు = గొప్పవాడు; ఎట్లు = ఎలా; ఇంత = ఇన్ని; కాలంబు = రోజులు; ఉదరము = గర్భము; అందున్ = లో; నిలిచి = స్థిరముగ; ఉండెన్ = ఉన్నాడు; అనుచున్ = అనుచు; అదితి = అదితి; వెఱగు = ఆశ్చర్య; పడియెన్ = పోయెను; ఆనంద = సంతోషపు; ఆనంద = ఆనందపు; జయశబ్దములనున్ = జయజయధ్వానము లను; కశ్యపుండు = కశ్యపుడు; మొగిన్ = పూని; నుతించెన్ = స్తుతించెను.

భావము:- “ఇంతటి మహానుభావుడు ఇంతకాలమూ నా కడుపులో ఎలా ఉన్నాడా” అని వామనుడిని చూసి అదితి ఆశ్చర్యపడింది. ఆనందంతో కూడిన జయజయ శబ్దాలతో కశ్యపుడు స్వామిని పూని సంస్తుతించాడు.

8-513-వ.

అంత నవ్విభుండు సాయుధసాలంకారంబగు తన దివ్యరూపంబు నుజ్జగించి రూపాంతరం బంగీకరించి కపటవటు చందంబున నుపనయనవయస్కుండైన వామన బాలకుండై తల్లి ముంగటఁ గుమార సముచితాలాపంబు లాడుఁచు గ్రీడించు సమయంబున నదితియుం దనయ విలోకన పరిణామ పారవశ్యంబున.

టీక:- అంతన్ = అంతట; ఆ = ఆ; విభుండు = భగవంతుడు; సాయుధ = ఆయుధ ములుగల; సాలంకారంబు = అలంకారములుగలది; అగు = అయిన; తన = తన యొక్క; దివ్య = దివ్యమైన; రూపంబున్ = స్వరూపమును; ఉజ్జగించి = ఉపసంహరించి; రూప = స్వరూపమునందు; అంతరంబున్ = మార్పును; అంగీకరించి = స్వీకరించి; కపట = మాయా; వటు = బ్రహ్మచారి; చందంబునన్ = వలె; ఉపనయన = వడుగు చేయదగిన; వయస్కుండు = వయసు గలవానిగ; ఐన = అయినట్టి; వామన = పొట్టి; బాలకుండు = చిన్నబాలుడు; ఐ = అయ్యి; తల్లి = అమ్మకు; ముంగటన్ = ఎదురుగ; కుమార = పుత్రునికి; సముచిత = తగిన; ఆలాపంబులు = పలుకులు; ఆడుచున్ = పలుకుచు; క్రీడించు = విహరించెడి; సమయంబునన్ = సమయమునందు; అదితి యున్ = అదితి; తనయ = పుత్రుని; విలోకన = చూచుటవలన; పరిణామ = కలిగిన; పారవశ్యంబునన్ = మైమరపుతో.

భావము:- అటుపిమ్మట వామనుడు ఆయుధాలూ అలంకారాలు కలిగిన తన దివ్య రూపాన్ని వదిలిపెట్టి, కపట బ్రహ్మచారిగా మారురూపాన్ని పొందాడు. పొట్టి బాలుడుగా, వడుగు చేయదగిన వయస్సు కలవాడుగా అయ్యాడు. ఆ కొడుకుని చూచి అదితి ఆనందంతో మైమరచి, పారవశ్యమున. . .

8-514-క.

"నన్నుఁ గన్న తండ్రి! నా పాలి దైవమ!<br>
నా తపఃఫలంబ! నా కుమార!<br>
నాదు చిన్ని వడుగ! నా కులదీపిక!<br>
రాఁగదయ్య; భాగ్య రాశి వగుచు.

టీక:- నన్నున్ = నన్ను; కన్నతండ్రి = కన్నతండ్రి; నా = నా; పాలి = పాలిటి; దైవమా = దేవుడా; నా = నా యొక్క; తపః = తపస్సుయొక్క; ఫలంబ = ఫలితముగ కలిగిన వాడ; నా = నా యొక్క; కుమార = పుత్రుడ; నాదు = నా యొక్క; చిన్ని = చిన్న; వడుగ = బాలుడ; నా = నా యొక్క; కుల = వంశమును; దీపిక = ప్రకాశింపజేయువాడ; రాగదు = రమ్ము; అయ్య = తండ్రి; భాగ్యరాశివి = పెన్నిధివి; అగుచున్ = అగుచు.

భావము:- కన్నబిడ్డయైన వామనుని “నాకన్నతండ్రీ! నాపాలిదేవుడా! నా నోములపంటా! నా ముద్దుల కన్నా! నాచిన్నవడుగా! నా వంశాలంకారమా! నా పెన్నిధీ! . రావయ్యా.

8-515-క.

**అన్నా! ర"మ్మని డగ్గఱి**

**చన్నుల పాలేఱువాఱ సంశ్లేషిణి యై**

**చిన్నారి మొగము నివురుచుఁ**

**గన్నారం జూచెఁ గన్నకడుపై యుంటన్.**

టీక:- అన్నా = అబ్బాయి; రమ్మ = రా; అని = అని; డగ్గఱి = దగ్గరకుతీసుకొని; చన్నులన్ = స్తనములందు; పాలు = పాలు; ఏఱువాఱ = జాలువారగా; సంశ్లేషిణి = కౌగలించుకొన్నది; ఐ = అయ్యి; చిన్నారి = బుల్లి; మొగమున్ = ముఖమును; నివురుచున్ = దువ్వుచు; కన్నారన్ = కంటినిండుగా; చూచెన్ = చూసెను; కన్నకడుపు = తన కడుపున పుట్టినవాడు; ఐ = అయ్యి; ఉంటన్ = ఉండుటచేత.

భావము:- నా కన్నా! రావయ్యా” అంటూ అదితి దగ్గరకు పిలిచింది, అక్కున చేర్చుకుంది, మొహాన్ని దువ్వింది. తను కడుపారా కన్న ఆ చిన్నారి బాలుని కన్నుల నిండుగా చూచింది.

8-516-క.

**"పురుడీ బోటికి నిందిర**

**పురుడంబిక గాక యొరులు పురుడే?" యనుచున్**

**బురుటాలికిఁ బది దినములు**

**పురుడు ప్రవర్తించి రెలమిఁ బుణ్యపు గరితల్.**

టీక:- పురుడు = సమానురాలు, సాటి; ఈ = ఈ; బోటి = ఇల్లాలు; కిన్ = కి; ఇందిర = లక్ష్మీదేవి; పురుడు = సమానురాలు, సాటి; అంబిక = పార్వతీదేవి; కాక = అంతే

తప్పించి; ఒరులు = ఇతరులు; పురుడే = సమానులా, సాటికాగలరా; అనుచున్ = అనుచు; పురుటాలి = బాలంతరాలి; కిన్ = కి; పది = పది (10); దినములు = రోజులు; పురుడు = పురుటిశుద్ధి; ప్రవర్తించిరి = నడిపించిరి; ఎలమిన్ = అతిశయించి; పుణ్యపుగరితల్ = ముత్తైదువలు.

భావము:- "ఈ ఇల్లాలికి లక్ష్మి పార్వతులే సరిజోడియైన వారు. ఇతరులు సరిజోడి కాదు." అంటూ పెద్ద ముత్తైదువలు బాలెంతరాలైన అదితికి పది రోజులు పురుడు నడిపినారు.

8-517-వ.

అంత నబ్బాలునకు సంతసంబున మహర్షులు కశ్యపప్రజాపతిం బురస్కరించుకొని సముచితోపనయనకర్మ కలాపంబులు చేయించిరి; సవిత సావిత్రినుపదేశించె, బృహస్పతి యజ్ఞోపవీతధారణంబును, గశ్యపుండు ముంజియుఁ, గౌపీనం బదితియు, ధరణి కృష్ణాజినంబును, దండంబు వనస్పతి యగు సోముండును, గగనాధిష్ఠానదేవతఛత్రంబునుఁ, గమండలువు బ్రహ్మయు, సరస్వతి యక్షమాలికయు, సప్తర్షులు కుశపవిత్రంబులు నిచ్చిరి; మఱియును.

టీక:- అంతన్ = అంతట; ఆ = ఆ; బాలున్ = పిల్లవాని; కున్ = కి; సంతసంబునన్ = సంతోషముతో; మహర్షులు = మునీంద్రులు; కశ్యప = కశ్యపుడు యనెడి; ప్రజాపతిన్ = బ్రహ్మను; పురస్కరించుకొని = ముందుంచుకొని; సముచిత = తగినవిధముగ; ఉపనయన = వడుగు; కర్మకలాపంబులు = కార్యక్రమములు; చేయించిరి = జరిపించిరి; సవిత = సూర్యుడు; సావిత్రిన్ = గాయత్రీమంత్రమును; ఉపదేశించెన్ = ఉపదేశించెను {ఉపదేశము - అధికారదత్తపూర్వకముగ నేర్పుట}; బృహస్పతి = బృహస్పతి; యజ్ఞోపవీత = జంధ్యమును; ధారణంబును = ధరింపజేయుట; కశ్యపుండు = కశ్యపుడు; ముంజియున్ = ముంజిదర్భలు; కౌపీనంబున్ = గోచీని; అదితి = అదితి; ధరణి = భూదేవి; కృష్ణాజినంబును = నల్లజింకచర్మమును; దండంబు = దండమును; వనస్పతి = అడవికి అధిష్ఠానదేవత; అగు = అయిన; సోముండును = సోముడు; గగన = ఆకాశమునకు; అధిష్ఠానదేవత = అధికారి; ఛత్రంబును = గొడుగు; కమండలువున్ = కమండలమును;

బ్రహ్మయున్ = బ్రహ్మదేవుడు; సరస్వతి = సరస్వతీదేవి; అక్షమాలిక = జపమాల; సప్తర్షులు = సప్తర్షులు; కుశపవిత్రంబులు = పవిత్రమైనదర్భలు; ఇచ్చిరి = ఇచ్చిరి; మఱియున్ = ఇంకను.

భావము:- అటు పిమ్మట, వామనుడికి వడుగు చేయడంకోసం కశ్యప ప్రజాపతిని ముందుంచుకొని మునీంద్రులు తగిన సకల ఉపనయన కార్యకలాపాలు జరిపించారు. వామనుడికి సూర్యుడు గాయత్రి మంత్రాన్ని బోధించాడు. బృహస్పతి జంధ్యాన్నీ; కశ్యపుడు ముంజ (దర్భల మొలత్రాడునూ); అదితి కౌపీనాన్నీ (గోచీని); భూదేవి నల్లని జింకచర్మాన్నీ; చంద్రుడు దండాన్నీ; ఆకాశం గొడుగునూ; బ్రహ్మ కమండలాన్ని; సరస్వతీదేవి జపమాలనూ; సప్తఋషులు పవిత్రమైన దర్భలనూ ఇచ్చారు.

8-518-క.

**భిక్షాపాత్రిక నిచ్చెను**
**యక్షేశుఁడు వామనునకు; నక్షయ మనుచున్**
**సాక్షాత్కరించి పెట్టెను**
**భిక్షునకు భవాని పూర్ణభిక్ష నరేంద్రా!**

టీక:- భిక్షాపాత్రికన్ = చిన్నభిక్షాపాత్రను; ఇచ్చెను = ఇచ్చెను; యక్షేశుడు = కుబేరుడు; వామనున్ = వామనుని; కున్ = కి; అక్షయము = అక్షయము; అనుచున్ = అనుచు; సాక్షాత్కరించి = ప్రత్యక్షమై; పెట్టెను = పెట్టెను; భిక్షున్ = బ్రహ్మచారి; కున్ = కి; భవాని = అన్నపూర్ణాదేవి; పూర్ణ = పూర్తి; భిక్షన్ = భిక్షను; నరేంద్రా = రాజా.

భావము:- పరీక్షన్మహారాజా! యక్షుల ప్రభువు అయిన కుబేరుడు వామనుడికి భిక్షాపాత్ర ఇచ్చాడు. జగన్మాత పార్వతీదేవి ప్రత్యక్షమై అక్షయం అంటూ ఆ బ్రహ్మచారికి పూర్ణభిక్ష పెట్టింది.

8-519-క.



**శుద్ధబ్రహ్మర్షి సమా**
**రాద్ధుండై విహితమంత్రరాజిఁ జదువుచుం**
**బ్రోద్ధంబగు ననలంబున**
**వృద్ధాచారమున వటుఁడు వేల్చెన్ గడకన్!**

టీక:- శుద్ధ = పరిశుద్ధమైన; బ్రహ్మర్షి = మునీశ్వరులుచే; సమారాద్ధుండు = చక్కగా సిద్ధము చేయబడినవాడు; ఐ = అయ్యి; విహిత = శాస్త్రానుసారము; మంత్రరాజిన్ = వేదమంత్రములను; చదువుచున్ = చదువుతూ; ప్రోద్ధంబు = వెలుగుతున్నది; అగు = అయిన; అనలంబునన్ = అగ్నియందు; వృద్ధాచారమునన్ = సంప్రదాయబద్ధముగా; వటుడు = బ్రహ్మచారి; వ్రేల్చెను = హోమముచేసెను; కడకన్ = నిష్ఠతో.

భావము:- ఆ పరిశుద్ధులైన బ్రహ్మఋషులు వామనుని ఆదరంగా హోమానికి సిద్ధంచేసారు. తరువాత, ఆ బ్రహ్మచారి సంప్రదాయం ప్రకారం వేదమంత్రాలు చదువుతూ, వెలిగే అగ్నిహోత్రంలో ఉత్సాహంతో హోమం చేసాడు.

## వామనుని విప్రుల సంభాషణ

8-520-వ.

ఇట్లు కృతకృత్యుండైన మాయామాణవకుండు దేశాంతర సమాగతు లగు బ్రాహ్మణులం గొందఱ నవలోకించి యిట్లనియె.

టీక:- ఇట్లు = ఈ విధముగ; కృతకృత్యుండు = కార్యక్రమము పూర్తిచేసినవాడు; ఐన; మాయా = కపట; మాణవకుడు = బాలకుడు {మాణవకుడు - వ్యు. మను + అణ్ (అల్పార్థే) + క. ణత్వమ్, నిపా, త.ప్ర., పిల్లవాడు, ఆంధ్ర శబ్ద రత్నాకరము}; దేశాంతర = ఇతర ప్రాంత ములనుండి; సమాగతులు = వచ్చినవారు; అగు = అయిన; బ్రాహ్మణులన్ = విప్రులను; కొందఱన్ = కొంతమందిని; అవలోకించి = చూసి; ఇట్లు = ఇలా; అనియె = అడిగెను.

భావము:- ఈ విధంగా ఉపనయనం పూర్తై కృతకృత్యుడు అయిన మాయాబ్రహ్మచారి ఇతర దేశాలనుండి వచ్చిన కొందరు బ్రాహ్మణులను చూసి ఇలా అడిగాడు.

8-521-క.

"వత్తురె విప్రులు? వేఁడఁగ
నిత్తురె దాతలును వేడ్క నిష్టార్థములం?
దెత్తురె మీరును సంపద?
లిత్తెఱఁగున దాన వీరుఁ డెవ్వఁడొ చెపుడా".

టీక:- వత్తురె = వస్తుంటార; విప్రులు = బ్రాహ్మణులు; వేడగన్ = యాచించుటకు; ఇత్తురె = ఇస్తుంటారా; దాతలును = దానములిచ్చువారు; వేడ్కన్ = సంతోషముతో; ఇష్ట = కోరిన; అర్థములన్ = కోరికలను; తెత్తురె = తెచ్చుకొన్నారా; మీరును = మీరు కూడ; సంపదలున్ = సంపదలను; ఈ = ఈ; తెఱంగునన్ = విధమైన; దాన = దానము చేసే; వీరుడు = శూరుడు; ఎవ్వడొ = ఎవరో; చెపుడా = చెప్పండి.

భావము:- "దానాలు అందుకోవడానికి బ్రాహ్మణులు దాతల చెంతకు వెళ్తున్నారా? వారు కోరిన ధనాలను దాతలు ఇస్తున్నారా? మీరుకూడా అలా ధనాన్ని తెచ్చుకుంటారా? ఈవిధంగా అర్థులకు అడిగినది ఇచ్చే మహా దాత ఎవరో చెప్పండి."

8-522-వ.

## అనిన నఖిల దేశీయు లగు భూసురు లిట్లనిరి.

టీక:- అనినన్ = అనగా; అఖిల = అన్ని; దేశీయులు = దేశములవారు; అగు = అయిన; భూసురులు = విప్రులు {భూసురులు - భూమిపైని దేవతలు, బ్రాహ్మణులు}; ఇట్లు = ఈ విధముగ; అనిరి = పలికిరి.

భావము:- ఇలా ధనమిచ్చే మహాదాత ఎవరో చెప్పండి అని అడిగిన, వామనుడితో వివిధ దేశాలకు చెందిన బ్రాహ్మణులు ఇలా అన్నారు.

8-523-మ.

## కలరున్దాతలు; నిత్తురున్ ధనములుం; గామ్యార్థముల్ గొంచు వి
## ప్రులు నేతెంతురు; గాని యీవిని బలిం బోలన్ వదాన్యుండు లేఁ
## డలఘుండై యొనరించె నధ్వరశతం బా భార్గవానుజ్ఞచే;
## బలివేఁడం బడయంగ వచ్చు బహుసంపల్లాభముల్ వామనా! "

టీక:- కలరున్ = ఉన్నారు; దాతలున్ = దాతలు; ఇత్తురున్ = ఇచ్చెదరు; ధనములున్ = సంపదలను; కామ్య = కోరిన; అర్థముల్ = సంపదలను; కొంచున్ = తీసుకొనుచు; విప్రులు = బ్రాహ్మణులు; ఏతెంతురు = వస్తుంటారు; కాని = కాని; ఈవిని = దానమిచ్చుగుణ మున; బలిన్ = బలిచక్రవర్తితో; పోలన్ = సరిపోలగల; వదాన్యుండు = దాత; లేడు = లేడు; అలఘుండు = గొప్పవాడు; ఐ = అయ్యి; ఒనరించెన్ = చేసెను; అధ్వర = యాగములు; శతంబున్ = నూరింటిని (100); ఆ = ఆ; భార్గవ = శుక్రా

చార్యుని {భార్గవుడు - భర్గుని వంశము వాడు, శుక్రుడు}; అనుజ్ఞ = అనుమతి; చేన్ = తో; బలిన్ = బలిని; వేడన్ = యాచించినచో; పడయంగవచ్చున్ = పొందవచ్చును; బహు = అనేకమైన; సంపత్ = సంపదలు; లాభముల్ = లభించుటను; వామనా = వామనుడా.

భావము:- "ఓ! వామనుడా! ధనమిచ్చేదాతలు అనేకులు ఉన్నారు. బ్రాహ్మణులు కోరిన సంపదలను పొందుతున్నారు. కానీ ఆ దాతలలో బలిచక్రవర్తితో సమానమైన మహాదాత లేడు. అతను శుక్రాచార్యుని అనుమతితో గొప్ప యాగాలు నూరు చేసాడు. అతనిని అడిగితే నీవు గొప్ప సంపద సంపాదించుకోవచ్చు."

8-524-వ.

**అని తెలియంజెప్పిన బ్రాహ్మణులవచనంబు లాలకించి లోకంబులకుం బ్రీతి పుట్టింపఁ బయనంబై లాభవచనంబులుఁ గైకొని తల్లిఁదండ్రుల వీడ్కొని శుభముహూర్తంబునం గదిలి.**

టీక:- అని = అని; తెలియన్ = తెలియునట్లు; చెప్పిన = చెప్పగా; బ్రాహ్మణుల = విప్రుల; వచనంబులన్ = మాటలను; ఆలకించి = విని; లోకంబుల్ = లోకముల; కున్; ప్రీతి = మేలు; పుట్టింపన్ = కలిగించుటకై; పయనంబు=ప్రయాణము; ఐ=అయ్యి; లాభవచనంబులు= ఆశీ ర్వాదములు; కైకొని = తీసుకొని; తల్లిదండ్రులన్ = తల్లిదండ్రులనుండి; వీడ్కొని =పోవననుజ్ఞ పొంది; శుభ = శుభకరమైన; ముహూర్తంబునన్ =సమయమునందు; కదిలి= బయలుదేరి.

భావము:- ఆ విధంగా తెలియపరచిన బ్రాహ్మణుల మాటలు విని లోకాలకు మేలు కలిగించడంకోసం వామనుడు ప్రయాణం అయ్యాడు. మంచి ముహుర్తములో, పెద్దల దీవనలూ తల్లితండ్రుల అనుమతి పొంది బయలుదేరాడు.

## వామనుని భిక్షాగమనము

8-525-క.



**ప్రక్షీణ దివిజ వల్లభ**
**రక్షాపరతంత్రుఁ డగుచు రాజీవాక్షుం**
**డా క్షణమున బలి యింటికి**
**భిక్షాగమనంబు జేసెఁ బేదటికముతోన్.**

టీక:- ప్రక్షీణ = మిక్కిలిదీనుడైన; దివిజవల్లభ = దేవేంద్రుని; రక్షా = కాపాడుటయందు; పరతంత్రుడు = నిమగ్నమైనవాడు; అగుచున్ = అగుచు; రాజీవాక్షుండు = హరి; ఆ = ఆ; క్షణముననన్ = వెంటనే; బలి = బలి యొక్క; ఇంటికిన్ = నివాసమున; కిన్ = కు; భిక్షా = యాచించుటకు; ఆగమనంబున్ = చేరుటను; చేసెన్ = చేసెను; పేదఱికము = పేదరికము; తోను = తోటి.

భావము:- వామనుడు మిక్కిలి దీనుడై ఉన్న దేవేంద్రుడిని కాపాడాలి అనుకున్నాడు. వెంటనే బలిచక్రవర్తిని దానం అడగడానికి నిశ్చయించుకుని, పేదరికాన్ని ప్రదర్శిస్తూ బలి నివాసానికి బయలుదేరాడు.

8-526-క.

## హరిహరి; సిరి యురమునఁ గల
## హరిహరిహయుకొఱకు దనుజు నడుగం జనియెన్;
## బరహితరత మతియుతులగు
## దొరలకు నడుగుటయు నొడలి తొడవగుఁ బుడమిన్.

టీక:- హరిహరి = అయ్యయ్యో; సిరి = లక్ష్మీదేవి; ఉరమునన్ = వక్షస్థలమున; కల = కలిగిన; హరి = విష్ణుమూర్తి; హరిహయు = ఇంద్రుని; కొఱకున్ = కోసము; దనుజున్ = రాక్షసుని; అడుగన్ = అడుగుటకు; చనియెన్ = బయలుదేరెను; పర = ఇతరులకు; హిత = మేలుచేయుటయందు; రత = ప్రీతికల; మతి = బుద్ధి; యుతుల = కలవారు; అగు = అయిన; దొరల్ = దొడ్డబుద్ధిగలవారల; కున్ = కు; అడుగుటయున్ = యాచించుటకూడ; ఒడలి = దేహ; తొడవు = అలంకారము; అగున్ = అయి ఉండును; పుడమిన్ = లోకమునందు.

భావము:- ఔరా! రొమ్మున లక్ష్మీదేవి కలిగిన మహా సంపన్నుడు విష్ణుమూర్తి. అయినా, అతడు ఇంద్రుడి కోసం బలిని బిచ్చమడగడానికి ప్రయాణమై వెళ్ళాడు. ఇతరులకు మేలుచేసే ఉద్దేశంతో బిచ్చమెత్తడం కూడా గొప్పవారికి ఒక అలంకారమే కాబోలు ఈ భూలోకంలో.

ఈ పద్యంలోని అలంకార వైభవం ఎంతబాగుందో. (1) హరిహరి – అయ్యో, ఔరా వంటి పదం, (2) హరి అంటే విష్ణువు, (3) హరిహయుడు అంటే ఇంద్రుడు.

8-527-క.

**సర్వప్రపంచ గురుభర**
**నిర్వాహకుఁ డగుటఁజేసి నెఱిఁ జనుదేరన్**
**ఖర్వుని ప్రేఁగు సహింపక**
**యుర్వీస్థలి గ్రుంగె; మ్రొగ్గె నురగేంద్రుండున్.**

టీక:- సర్వ = అఖిల; ప్రపంచ = లోకముల; గురు = బరువును; భర = భరించుట; నిర్వాహకుడు = చేయువాడు; అగుటన్ = అగుట; చేసి = వలన; నెఱిన్ = క్రమముగా; చనుదేర = వెళ్ళుచుండగ; ఖర్వుని = పొట్టివాని; ప్రేగున్ = భారమును; సహింపక = తట్టుకొనలేక; ఉర్వీస్థలి = భూమండలము; క్రుంగెన్ = కుంగిపోయినది; మ్రొగ్గెన్ = వంగిపోయెను; ఉరగేంద్రుండున్ = ఆదిశేషుడు.

భావము:- భగవంతుడైన వామనుడు తన కడుపులో సమస్త లోకాలను భరించేవాడు కదా. అందుకే, అతడు ఒయ్యారంగా నడిచేటప్పుడు అతని బరువు తట్టుకోలేక భూమి కృంగిపోయింది. ఆదిశేషుడు వంగిపోయాడు.

8-528-వ.

**ఇట్లు చనిచని.**

టీక:- ఇట్లు = ఈ విధముగ; చనిచని = సాగిపోయి.

భావము:- ఆ వామనమూర్తి అలా వెళ్ళి వెళ్ళి . . . .

8-529-క.

**శర్మద, యమదండక్షత**
**వర్మద, నతి కఠిన ముక్తి వనితాచేతో**
**మర్మద, నంబునివారిత**
**దుర్మద, నర్మదఁ దరించెఁ ద్రోవన్ వటుఁడున్.**

టీక:- శర్మద = శుభములనిచ్చునది; యమ = యముని; దండ = దండనము యొక్క; క్షత = దెబ్బలనుండి; వర్మదన్ = కాపాడు కవచము వంటిదానిని; అతి = మిక్కిలి; కఠిన = గట్టిదైన, గడుసుదైన; ముక్తి = ముక్తి యనెడి; వనిత = స్త్రీ యొక్క; చేతస్ = మనసు; మర్మదన్ = మర్మమును తెలిపెడిదానిని; అంబు = (తన) నీటితో;

నివారిత = నివారించబడు; దుర్మదన్ = దోషములుగలదానిని; నర్మదన్ = నర్మదానదిని; తరించెన్ = దాటెను; త్రోవన్ = దారిలో; వటుడున్ = బ్రహ్మచారి.

భావము:- నర్మదానది శుభాలను అందించేది. యమ బాధలు అనే బాణాల నుండి కవచంలా కాపాడేది; బహు గడుసుది అయిన ముక్తికాంత మనసులోని గుట్టు బయట పెట్టేది; తన నీళ్ళతో దోషాలను నివారించేది. వామనుడు తన దారిలో అలాంటి మహిమాన్వితమైన నర్మదానదిని దాటాడు.

8-530-వ.

## దాటి తత్ప్రవాహంబున కుత్తరతటంబు నందు.

టీక:- దాటి = దాటి; తత్ = ఆ; ప్రవాహంబున్ = నదికి; ఉత్తర = ఉత్తరపు; తటంబున్ = గట్టు; అందున్ = అందు.

భావము:- మంచి తేజస్సు గల ఆ వామనుడు నర్మదానదిని దాటి దానికి ఉత్తర తీరంలో ఉన్న .. .

8-531-శా.

## చండస్ఫూర్తి వటుండుఁ గాంచె బహుధాజల్పన్నిశాటంబు, ను
## ద్దండాహూత మునీభ్యబిభ్యదమృతాంధస్సిద్ధకూటంబు, వే
## దండాశ్వధ్వజనీ కవాటము, మహోద్యద్ధూమ సంఛన్న మా
## ర్తాండస్యందన ఘోటమున్, బలిమఖాంతర్వేదికావాటమున్.

టీక:- చండ = తీవ్రమైన; స్ఫూర్తిన్ = తేజస్సుగలవాడు; వటుండు = బ్రహ్మచారి; బహుధా = పెక్కువిధములుగ; జల్పన్ = వాగెడివారలను {జల్పనము – ఉపయుక్తము కాని, పెక్కు మాటలాడుట}; నిశాటంబునున్ = రాక్షసులను; ఉద్దండ = ఉద్దండులైన; ఆహూత = పిలువబడిన; ముని = మునులలో; ఇభ్య = శ్రేష్ఠులవలన; బిభ్యత్ = బెదురుచున్న; అమృతాంధస్ = దేవతల {అమృతాంధస్ - అమృతము ఆహారముగా కలవారు, దేవతలు}; సిద్ధ = సిద్ధుల; కూటంబున్ = సమూహములు కలది; వేదండ = ఏనుగులు; అశ్వ = గుఱ్ఱములు; ధ్వజనీ = సేనలు; కవాటమున్ = ద్వారమువద్దనున్నది; మహా = మిక్కిలి; ఉద్యత్ = చెలరేగుచున్న; ధూమ = పొగలతో; సంఛన్న = కప్పబడిన; మార్తాండ = సూర్యుని; స్యందన = రథముయొక్క; ఘోటమున్ = గుఱ్ఱములుకలది; బలి = బలి యొక్క; మఖ = యజ్ఞముయొక్క; అంతర = అంతర్భాగపు; వేదికావాటమున్ = సభాస్థలమును.

భావము:- బలిచక్రవర్తి యాగసాలను దర్శించాడు. అలా వామనుడు చూసిన బలి యాగసాలలో రాక్షసులు పెక్కువిధాలైన పెద్దపెద్ద సందడులు చేస్తున్నారు. ఆ యజ్ఞంలో పాల్గొన్న ఉద్దండులైన మునులను చూసి దేవతలూ సిద్ధులూ భయపడుతున్నారు. ద్వారానికి ముందువైపు స్థలం ఏనుగులతో, గుఱ్ఱాలతో సైన్యాలతో నిండిపోయి ఉంది. అక్కడి యజ్ఞకుండాల పొగలతో సూర్యుని రథం గుఱ్ఱాలు పూర్తిగా కప్పబడి పోతున్నాయి.

## వామనుడు యజ్ఞవాటిక చేరుట

8-532-వ.

### కని దానవేంద్రుని హయమేధ వాటి దఱియం జొచ్చు నయ్యవస రంబున.

టీక:-కని = చూసి; దానవేంద్రుని = బలిచక్రవర్తి; హయమేధ వాటిన్ = అశ్వమేధయాగ శాలను; దఱియంజొచ్చు = చేర వచ్చెడి; ఆ = ఆ; అవసరంబునన్ = సమయమునందు;

భావము:-ఆవైభోగం అంతాచూస్తూ, వామనుడు బలిచక్రవర్తియజ్ఞవాటికను సమీపించాడు.

8-533-శా.

### "శంభుండో హరియో పయోజభవుఁడో చండాంశుఁడో వహ్నియో
### దంభాకారత వచ్చెఁ గాక ధరణిన్ ధాత్రీసురుం డెవ్వఁడీ
### శుంభద్ద్యోతనుఁ డీ మనోజ్ఞ తనుఁ" డంచున్ విస్మయభ్రాంతులై
### సంభాషించిరి బ్రహ్మచారిఁ గని తత్సభ్యుల్ రహస్యంబుగన్.

టీక:- శంభుండో = పరమశివుడో; హరియో = విష్ణుమూర్తియో; పయోజభవుడో = బ్రహ్మదేవుడో {పయోజభవుడు - పయోజ (పద్మమున) భవుడు (పుట్టినవాడు), బ్రహ్మ}; చండాంశుడో = సూర్యభగవానుడో {చండాంశుడు - చండ (తీవ్రమైన) అంశుడు (కిరణ ములు కలవాడు), సూర్యుడు}; వహ్నియో = అగ్నిదేవుడో; దంభ = కపట; ఆకారతన్ = వేషముతో; వచ్చెన్ = వచ్చెను; కాక = కాకపోయినచో; ధరణిన్ = భూమిపైన; ధాత్రీసురుండు = బ్రాహ్మణుడు {ధాత్రీసురుడు - ధాత్రీ (భూమిపైని) సురుడు (దేవత), విప్రుడు}; ఎవ్వడు = ఎవరు; ఈ = ఇంత; శుంభత్ = ప్రశస్తముగా; ద్యోతనుడు = ప్రకాశించువాడు; ఈ = ఇంత; మనోజ్ఞ = అందముగానున్న; తనుడు =

దేహముగలవాడు; అంచున్ = అనుచు; విస్మయ = ఆశ్చర్యముతో; భ్రాంతులు = భ్రాంతిలోపడినవారు; ఐ = అయ్యి; సంభాషించిరి = మాట్లాడుకొనిరి; బ్రహ్మచారిన్ = వామనుని; కని = చూసి; తత్ = అక్కడి; సభ్యుల్ = సభలోనివారు; రహస్యంబుగన్ = రహస్యముగా.

భావము:- అలా వేంచేసిన వామనుని చూసి, సభలోనివారు "శివుడో, విష్ణువో, బ్రహ్మయో, సూర్యుడో, అగ్నియో ఇలా మారు వేషంతో వచ్చి ఉండవచ్చు. ప్రపంచంలో ఇంతటి కాంతి అందమూ ఉండే బ్రహ్మచారి ఎవరుంటారు." అనుకుంటూ ఆశ్చర్యంతో చకితులై రహస్యంగా గుసగుసలాడారు.

8-534-క.

## గుజగుజలు వోవువారును
## గజిబిజిఁ బడువారు చాలఁ గలకల పడుచున్
## గజిబిజి యైరి సభాస్థలిఁ
## బ్రజలెల్లను బొట్టివడుగు పాపని రాకన్.

టీక:- గుజగుజలు = గుసగుసలు; వోవువారును = ఆడువారును; గజిబిజిన్ = తికమక; పడువారు = పడువారును; చాలన్ = మిక్కిలి; కలకల = కలకలము; పడుచున్ = పడుచు; గజిబిజిన్ = తికమకపడినవారు; ఐరి = అయిరి; సభాస్థలిన్ = సభాప్రాంగణములోని; ప్రజలు = జనులు; ఎల్లన్ = అందరు; పొట్టి = వామనరూపు; వడుగు = బ్రహ్మచారి; పాపని = పిల్లవాని; రాకన్ = వచ్చుటతో.

భావము:- పొట్టి బ్రహ్మచారి యైన వామనుడు రాగానే ఆ సభలోని కొందరు ప్రజలు గుసగుసలాడారు. కొందరు గజిబిజి పడ్డారు. కొందరు తికమక పడ్డారు. అలా ఆ సభలోని వారందరూ పెద్ద కలకలం చేసారు.

8-535-వ.

## ఆ సమయంబున బలిసభామండపంబుఁ దఱియం జొచ్చి.

టీక:- ఆ = ఆ; సమయంబునన్ = సమయమునందు; బలి = బలియొక్క; సభామండపం బున్ = సభాస్థలి; దఱియన్ = దగ్గరకు; చొచ్చి = చేరి, ప్రవేశించి.

భావము:- సభలో అలా కలకలం జరుగుతుండగా, ఆ పొట్టి బ్రహ్మచారి బలిచక్రవర్తి సభమంటపం దరిచేరాడు.

8-536-సీ.

చవులుగాఁ జెవులకు సామగానంబులు-

చదువు నుద్గాతల చదువు వినుచు

మంత్ర తంత్రార్థ సంబంధభావములు పే-

ర్కొనెడి హోతలతోడఁ గూడికొనుచు

హోమకుండంబులం దున్న త్రేతాగ్నుల-

వెలిఁగించు యాజక వితతిఁ గనుచు

దక్షులై బహువిధాధ్వర విధానంబులు-

చెప్పెడు సభ్యులఁ జేరఁ జనుచుఁ

8-536.1-తే.

బెట్టుగోరెడు వేడుక పట్టుపఱుచు

నదితి పుట్టువు లచ్చికి నాటపట్టు

కోరి చరియించె సభలోనఁ గొంతఁదడవు

పుట్టు వెన్నఁడు నెఱుగని పొట్టివడుఁగు.

టీక:- చవులుగాన్ = ఇంపుగా; చెవుల = చెవుల; కున్ = కు; సామగానంబులు = సామగానములు {సామగానములు - సామవేద మంత్రములు}; చదువు = పఠించెడి; ఉద్గాతల = ఉద్గాతలయొక్క {ఉద్గాత - యజ్ఞములందు సామవేదగానములను నడపు వాడు}; చదువు = పఠనములను; వినుచున్ = వినుచు; మంత్రతంత్ర = మంత్ర తంత్రముల; అర్థ = అర్థమునకు; సంబంధ = సంబంధించిన; భావములు = టీకలను; పేర్కొనెడి = వివరించెడి; హోతల = హోతల {హోతలు - ఋగ్వేదము తెలిసిన ఋత్విక్కులు}; తోడన్ = తోటి; కూడికొనుచు = కలియుచు; హోమకుండంబుల్ = హోమకుండ ములు; అందు = లో; ఉన్న = ఉన్నట్టి; త్రేతాగ్నులన్ = మూడుఅగ్నులను {త్రేతాగ్నులు - 1ఆహవనీయము 2గార్హపత్యము 3దక్షిణాగ్ని యనెడి మూడగ్నులు}; వెలిగించు = వెలిగించెడి; యాజక = ఋత్విక్కుల; వితతిన్ = సమూహమును; కనుచు = చూచుచు; దక్షులు = సమర్థులు; ఐ = అయ్యి; బహువిధ = పలురకములైన; అధ్వర

= యజ్ఞ; విధానంబులు = విధులను; చెప్పెడు = పేర్కొనెడి; సభ్యులన్ = సభాపతుల; చేరన్ = దగ్గరకు; చనుచున్ = వెళుతు.

పెట్టు = దానమును; కోరెడు = కోరవలెననెడి; వేడుకన్ = కుతూహలమును; పట్టు పఱుచు = విదితముచేయుచు; అదితి = అదితి; పుట్టువు = కుమారుడు; లచ్చి = లక్ష్మీ దేవి; కిన్ = కి; ఆటపట్టు = నివాసమైనవాడు; కోరి = కోరి; చరియించెన్ = తిరిగెను; సభ = సభ; లోనన్ = అందు; కొంత = కొంత; తడువు = సేపు; పుట్టువు = జన్మించుట; ఎన్నడున్ = ఎప్పుడు; ఎఱుగని = తెలియని; పొట్టి = వామనుడైన; వడుగు = బ్రహ్మచారి.

భావము:- పుట్టుకన్నదే లేని వాడూ, అదితి సుతుడూ, లక్ష్మీదేవి పతీ అయిన ఆ వామనుడు, చెవులకు ఇంపుగా సామవేదం పఠించే ఉద్గాతల గానాలు విన్నాడు. మంత్రతంత్రాలను వివరిస్తూ హోమం చేసే హోతలను కలుసుకున్నాడు. హోమకుండంలో ఆహవనీయం, గార్హపత్యం, దక్షిణాగ్ని అనే మూడగ్నులను వెలిగించే ఋత్విజులను చూసాడు. యాగవిధులను నేర్పరితనంతో పేర్కొంటున్న సభాపతులను సమీపించాడు. ఆ సభను బాగా ఆకర్షించాలని అనుకొని కొంతసేపు ఆ సభలో తిరుగాడాడు.

8-537-వ.

## మఱియును.

టీక:- మఱియును = అంతేకాక. భావము:- అంతే కాక.

8-538-క.

**వెఱచుచు వంగుచు వ్రాలుచు**
**నఱిముఱిఁ గబురులకుఁ జనుచు హరిహరి యనుచున్**
**మఱుఁగుచు నులుకుచు దిఱదిఱఁ**
**గుఱుమట్టపుఁ బడుచు వడుగుఁ గొంత నటించెన్.**

టీక:- వెఱచుచున్ = బెదురుతూ; వంగుచున్ = ఒరుగుచు; వ్రాలుచున్ = తగ్గుచు; అఱిముఱిన్ = సంభ్రమముతో; కబురులకు = సంభాషణములకు; చనుచున్ = దిగుచు; హరిహరి = అయ్యయ్యో; అనుచున్ = అనుచు; మఱుగుచు = చాటుమాటులకు వెళుచు; ఉలుకుచున్ = ఉలికిపడుచు; దిఱదిఱన్ = దిరదిరకు రూపాంతరం, తిరుగుటయందలి అనుకరణము; కుఱు = చిన్ని, కుది; మట్టపు = పొట్టి; పడుచు = బాల; వడుగు = బ్రహ్మచారి; కొంత = కొంచెముసేపు; నటించెన్ = నటించెను.

భావము:- ఆ పొట్టి బ్రహ్మచారి వెరపు చూపుతూ, ఒయ్యారంగా వంగుతూ, జనంలోకి దూరుతూ, “హరి హరి” అంటూ, చాటుకు వెడుతూ, ఉలికిపడుతూ కొంతసేపు చుట్టూతిరుగుతూ కొంతసేపు నటించాడు.

8-539-క.

కొందఱతోఁ జర్చించును
గొందఱతో జటలు చెప్పు గోష్ఠిం జేయుం
గొందఱతోఁ దర్కించును
గొందఱతో ముచ్చటాడుఁ; గొందఱ నవ్వున్.

టీక:- కొందఱ = కొంతమంది; తోన్ = తోటి; చర్చించును = చర్చలుచేయును; జటలు = వేదపాఠములను {జట - వేదము చెప్పుటలో విశేషము - జట, ఘన}; చెప్పున్ = చదువును; గోష్ఠిన్ = సల్లాపములు; చేయున్ = ఆడును; కొందఱ = కొంతమంది; తోన్ = తోటి; తర్కించును = వాదించును; కొందఱ = కొంతమంది; తోన్ = తోటి; ముచ్చటలాడును = ముచ్చటించును; కొందఱన్ = కొందరితో; నవ్వున్ = నవ్వుతుండును.

భావము:- ఆ సభలో వామనుడు కొందరితో వాదోపవాదాలు చేసాడు. కొందరితో కలిసి వేదాన్ని చదివాడు. కొందరితో చక్కగా సల్లాపాలు సాగించాడు. కొందరితో వాదించాడు. కొందరితో చక్కగా మాట్లాడాడు.

8-540-వ.

మఱియు ననేక విధంబుల నందఱకు నన్ని రూపులై వినోదించుచు.

టీక:- మఱియున్ = అంతేకాక; అనేక = పలు; విధంబులన్ = విధములుగా; అందఱ = అందరి; కున్ = కి; అన్ని = అన్ని; రూపులు = రకములుగా; ఐ = కనబడుచు; వినోదించెను = క్రీడించెను.

భావము:- అంతేకాకుండా అందరితోనూ అనేకవిధాలుగా వ్యవహరిస్తూ విహరించసాగాడు.

*8-541-క.

**పెడపెడ నడకలు నడచుచు**

**నెడనెడ నడు గిడక నడరి యిల దిగఁబడగా**

**బుడిబుడి నొడువులు నొడువుచుఁ**

**జిడిముడి తడఁబడగ వడుగు చేరెన్ రాజున్.**

టీక:- పెడపెడన్ = మెల్లిమెల్లి; నడకలు = అడుగులుతో; నడచుచున్ = తిరుగుతు; ఎడనెడ = మధ్యమధ్యలో; అడుగు = అడుగులు; ఇడక = వేయకుండ; అడరి = బెదరి; ఇల = భూమి; దిగబడగా = కుంగిపోతుండగ; బుడిబుడి = చిన్నచిన్న; నొడువులున్ = మాటలు; నొడువుచున్ = పలుకుచు; చిడిముడిన్ = కలవరపాటుతో; తడబడగ = తడబడు తుండగ; వడుగు = బ్రహ్మచారి; చేరెన్ = సమీపించెను; రాజున్ = చక్రవర్తిని.

భావము:- వామనుడు మెల్లమెల్లగా అడుగులుపేస్తూ నడిచాడు. అక్కడక్కడ నేల దిగబడుతుంటే అడుగులు తడబడుతు నడిచాడు. మధ్యలో కొద్దిగా మాట్లాడుతు, తడబడుతు, కలవరబడుతు బలిచక్రవర్తిని సమీపించాడు.

(బలిచక్రవర్తియాగశాలలోనికి వామనరూపంతోమయావటువుగా అవతరించినవిష్ణువు ప్రవేశించేఘట్టం. పద్యంనడక వామనునినడకతో పోటీపడుతోందా అన్నట్టు అద్భుతంగా ఉంది.)

8-542-వ.

**ఇట్లు డగ్గఱి మాయాభిక్షుకుండు రక్షోవల్లభుం జూచి యిట్లనియె.**

టీక:- ఇట్లు = ఇలా; డగ్గఱి = దగ్గరకుచేరి; మాయా = కపట; భిక్షకుండు = యాచకుడు; రక్షస్=రాక్షసుల; వల్లభున్ = ప్రభువును; చూచి = చూసి; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- అలా మాయాభిక్షుక రూపంలో ఉన్న వామనుడు ఆ దానవచక్రవర్తి అయిన బలిని చూసి ఇలా అన్నాడు.

8-543-మ.

"ఇతఁడే దానవచక్రవర్తి సురలోకేంద్రాగ్నికాలాది ది
క్పతిగర్వాపనయప్రవర్తి, గతలోభస్ఫూర్తి, నానా మఖ
వ్రతదానప్రవణానువర్తి, సుమనోరామామనోభేదనో
ద్ధతచంద్రాతపకీర్తి, సత్యకరుణా ధర్మోల్లసన్మూర్తి దాన్."

టీక:- ఇతడే = ఇతసేనా; దానవ = రాక్షస; చక్రవర్తి = చక్రవర్తి; సురలోకేంద్ర = దేవేంద్రుడు; అగ్ని = అగ్నిదేవుడు; కాల = యముడు; ఆది = మున్నగు; దిక్పతి = దికపాలకుల; గర్వ = గర్వమును; అపనయ = తొలగించిన; ప్రవర్తి = మొనగాడు; గత = నశించిన; లోభ = లోభము; స్ఫూర్తిన్ = ప్రకాశించగా; నానా = పలు; మఖ = యాగములు; వ్రత = వ్రతములు; దాన = దానముచేసెడి; ప్రవణ = సమర్థతతో; అనువర్తి = నడచెడివాడు; సుమనస్ = దేవతా; రామా = స్త్రీల; మనస్ = మనస్సులను; భేదన = కలవరపాటును; ఉద్ధత = పెంచెడి; చంద్ర = చంద్రుని; ఆతప = వెన్నెలవంటి; కీర్తిన్ = కీర్తి కలవాడు; సత్య = సత్యసంధత; కరుణా = దయాహృదయము; ధర్మ = ధర్మబుద్ధులతో; ఉల్లసత్ = ఉల్లాసవంతమైన; మూర్తి = వ్యక్తి; తాన్ = అతను.

భావము:- "ఇతడేనా రాక్షసచక్రవర్తి! ఇతడేనా దేవేంద్రుడు, అగ్ని, యముడూ మొదలైన దిక్పాలకుల గర్వాన్ని తొలగించిన మొనగాడు! ఇతడేనా అత్యాశలేని నిండైన హృదయం కలవాడు! ఇతడేనా పెక్కు యజ్ఞాల పుణ్యకార్యాలలో ప్రీతితో దానమిచ్చేవాడు! ఇతడేనా దేవతాస్త్రీల మనస్సులను కలవరపెట్టే వెన్నెలవంటి కీర్తికలవాడు! ఇతడేనా సత్యంతో ధర్మంతో ప్రకాశించే స్వరూపం కలవాడు!".

8-544-వ.

అని కుశ పవిత్రాక్షత సంయుతం బయిన దక్షిణహస్తంబు సాఁచి యిట్లనియె.

టీక:- అని = అని పలికి; కుశ = దర్భలు; పవిత్ర = పవిత్రమైన; అక్షత = అక్షతలు; సంయుతంబు = కలిగినది; అయిన = ఐన; దక్షిణ = కుడి; హస్తంబున్ = చేతిని; సాచి = చాచి; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- ఇలా పలికి, పవిత్రమైన దర్భలూ అక్షతలూ పట్టుకున్న తన కుడిచెయ్యి సాచి వామనుడు ఇలాఅన్నాడు.

8-545-ఉ.

"స్వస్తిజగత్త్రయీ భువన శాసన కర్తకు హాసమాత్ర వి
ధ్వస్తనిలింపభర్తకు, నుదారపదవ్యవహర్తకున్, మునీం
ద్రస్తుత మంగళాధ్వర విధాన విహర్తకు, నిర్జరీగళ
న్యస్తసువర్ణసూత్ర పరిహర్తకు, దానవలోక భర్తకున్."

టీక:- స్వస్తి = శుభమగుగాక; జగత్రయీ = ముల్లోకములలోని; భువన = ప్రపంచములను; శాసన = పరిపాలించెడి; కర్త = అధికారి; కున్ = కి; హాసమాత్ర = అవలీలగా {హాసమాత్రము - నవ్వుఒక్కదానితో, అవలీలగా}; విధ్వస్త = నాశన మొందించబడిన; నిలింపభర్త = దేవేంద్రుడుకలవాని; కున్ = కి; ఉదార = ఉన్నతమైన; పద = పదవులలో; వ్యవహర్త = మెలగెడువాని; కున్ = కి; ముని = మునులలో; ఇంద్ర = శ్రేష్ఠులచే; స్తుత = కీర్తింపబడిన; మంగళ = శుభకరమైన; అధ్వర = యజ్ఞముల; విధాన = కార్యక్రమములలో; విహర్త = మెలగునాని; కున్ = కి; నిర్జర = దేవతల; గళ = మెడలో; న్యస్త = ఉన్నట్టి; సువర్ణ = బంగారు; సూత్ర = మంగళసూత్రముల; పరిహర్త = తొలగించెడివాని; కున్ = కి; దానవ = రాక్షసులు; లోక = అందరికి; భర్త = రాజు; కున్ = కి.

భావము:- "ముల్లోకాలనూ శాశించే అధికారం కలవాడా నీకు స్వస్తి! అవలీలగా దేవేంద్రుడంత వానిని వెలవెల పోయేలా చేసినవాడా! ఉన్నత పదవిలో మెలిగేవాడా! మునీంద్రుల పొగడ్తలందుకున్న శుభకరమైన యాగకార్యాలతో విహరించేవాడా! దేవతాస్త్రీల మెడలలోని బంగారు మంగళసూత్రాలను తొలగించేవాడా! సమస్త రాక్షసలోక సార్వభౌముడా! నీకు శుభ మగుగాక."

8-546-వ.

అని దీవించి కరచరణాద్యవయవంబులు ధరించిన వేదరాశియుం బోలె ముందట నకుటిలుండును, జటిలుండును, సదండఛత్రుం డునుఁ, గక్షలంబిత భిక్షాపాత్రుండునుఁ, గరకలిత జల కమండలుండును, మనోహరవదనచంద్రమండలుండును, మాయా వాదననటుండును నగు వటునిం గని దినకర కిరణ పిహితంబులైనగ్రహంబుల చందంబునఁ దిరోహితులై భృగువులుఁ

గూర్చున్న యెడల లేచి క్షేమంబడిగి తియ్యనిమాటల నాదరిం
చిరి; బలియును నమస్కరించి తగిన గద్దియ నునిచి, పాదం
బులుఁ దుడిచి తన ప్రాణవల్లభ పసిండి గిండియల నుదకంబు
వోయ వడుగు కొమరుని చరణంబులఁ గడిగి తడి యొత్తి
తత్సమయంబున.

టీక:- అని = అని; దీవించి = దీవించి; కర = చేతులు; చరణ = కాళ్ళు; ఆది = మున్నగు; అవయవంబులున్ = అవయవములను; ధరించిన = స్వీకరించిన; వేద = వేదముల; రాశియున్ = సమూహము; పోలెన్ = సరిపోలి; ముందటన్ = ఎదురుగ; అకుటిలుండును = అమాయకుడు; జటిలుండును = జటలుకట్టినజుట్టు కలవాడు; సదండఛత్రుండునున్ = దండము గొడుగు గలవాడు; కక్షన్ = చంకలో; లంబిత = వేల్లాడుచున్న; భిక్షాపాత్రుండును = భిక్షాపాత్ర కలవాడు; కర = చేతిలో; కలిత = ఉన్నట్టి; జల = నీరుగల; కమండులుడును = కమండలము కలవాడు; మనోహర = అందమైన; వదన = మోము యనెడి; చంద్రమండ లుండును = చంద్రమండలమువాడు; మాయా వాదన = చతురోక్తులతో; నటుండును = వర్తించువాడు; అగు = అయిన; వటునిన్ = బ్రహ్మచారిని; కని = చూసి; దినకర = సూర్య {దినకరుడు - దినము (పగలును) కరుడు (కలిగించెడివాడు), సూర్యుడు}; కిరణ = కిరణములచే; పిహితంబులు = కప్పబడినవి; ఐన = అయిన; గ్రహంబుల = గ్రహముల; చందంబునన్ = వలె; తిరోహితులు = మరుగు పడినవారు; ఐ = అయ్యి; భృగువులున్ = భృగువంశపు బ్రాహ్మణులు; కూర్చున్న = కూర్చొనియున్న; ఎడలన్ = చోటులందు; లేచి = లేచినిలబడి; క్షేమంబున్ = కుశలప్రశ్నలు; అడిగి = అడిగి; తియ్యని = మృదుపైన; మాటలన్ = మాటలతో; ఆదరిం చిరి = ఆదరముగ పలకరించిరి; బలియును = బలికూడ; నమస్కరించి = నమస్కారము చేసి; తగిన = యుక్తమైన; గద్దియను = ఆసనమున; ఉనిచి = కూర్చొనబెట్టి; పాదంబు లున్ = పాదములను; తుడిచి = తుడిచి; తన = తనయొక్క; ప్రాణవల్లభ = ఇల్లాలు {ప్రాణవల్లభ - ప్రాణములతో సమానమైన వల్లభ (ప్రియురాలు), భార్య}; పసిండి = బంగారు; గిండియలన్ = చెంబులతో; ఉదకంబు = నీరు; వోయ = పోయగా; వడుగు = బ్రహ్మచారి; కొమరుని = పిల్లవాని; చరణంబులు = కాళ్ళు, పాదములు; కడిగి = కడిగి; తడి = తడిని; ఒత్తి = పొడిబట్టతోతుడిచి; తత్ = ఆ; సమయంబుననన్ = సమయము నందు.

భావము:- అలా బలిని దీవించిన వామనుడు కరచరణాలతో మానవాకారం ధరించిన వేదరాశివలె అతని ముందు నిలబడ్డాడు. జడలుకట్టిన జుట్టు, దండమూ, గొడుగు, కమండలం ధరించి ఉన్నాడు. అతని చంకలో భిక్షాపాత్ర వ్రేలాడుతున్నది. అతని ముఖం చంద్రబింబంవలె అందంగా వుంది. మాయా వాదనల చతురోక్తులు పలుకుటలో అతడు నేర్పరి. సూర్యుని కిరణాలతో కప్పబడి వెలవెల పోయిన ఇతర గ్రహాలమాదిరిగా ఆ బ్రహ్మచారి ముందు భృగువంశపు బ్రాహ్మణులు మరుగుపడిపోయారు. వారు కూర్చున్న చోటు నుండి లేచి నిలబడి వామనుని క్షేమాన్ని అడిగి తియ్యని మాటలతో అతణ్ని గౌరవించారు. బలిచక్రవర్తి అతనికి మ్రొక్కి ఆసనంపై కూర్చోపెట్టాడు. అతని అడుగులను తుడిచాడు. తన ఇల్లాలు బంగారు కలశంతో నీళ్ళు పోయగా, రాక్షస చక్రవర్తి ఆ వడుగు అడుగులు కడిగి తడి తుడిచాడు. ఆ సమయంలో. . .

8-547-ఆ.

వటుని పాద శౌచవారి శిరంబునఁ

బరమ భద్ర మనుచు బలి వహించె

నే జలము గిరీశుఁ డిందుజూటుఁడు దేవ

దేవుఁ డుద్వహించె ధృతి శిరమున.

టీక:- వటుని = బ్రహ్మచారి; పాద = పాదములు; శౌచ = కడిగిన; వారిన్ = నీటిని; శిరంబునన్ = తలపైన; పరమ = మిక్కిలి; భద్రము = శుభకరము; అనుచు = అనుచు; బలి = బలి; వహించెన్ = ధరించెను; ఏ = ఎట్టి; జలమున్ = నీటిని; గిరీశుండు = పరమశివుడు {గిరీశుడు - గిరి (కైలాసగిరిపైనున్న) ఈశుడు (ప్రభువు), శంకరుడు}; ఇందుజూటుండు = పరమశివుడు {ఇందుజూటుండు - ఇందు (చంద్రుని) జూటుండు (జటాజూటమున కల వాడు), శంకరుడు}; దేవదేవుడు = పరమశివుడు {దేవదేవుడు - మహాదేవుడు, శంకరుడు}; ఉద్వహించెన్ = చక్కగాధరించెను; ధృతిన్ = పూని; శిరమునన్ = తలపైన.

భావము:- జటాజూటంలో చంద్రుని ధరించిన మహాదేవుడైన శివుడు ఎల్లప్పుడూ ఏనీళ్ళను తలపై ధరిస్తాడో, అటువంటి వామనుని కాళ్లు కడిగిన నీళ్ళను బలిచక్రవర్తి మేలుకలిగించేవిగా తలచి తలపై చల్లుకున్నాడు.

## వామనుని భిక్ష కోరు మనుట

8-548-వ.

మఱియు నయ్యజమానుం డభ్యాగతున కిట్లనియె.

టీక:- మఱియున్ = అటుపిమ్మట; ఆ = ఆ; యజమానుండు = యజ్ఞముచేయువాడు; అభ్యాగతున్ = విచ్చేసినవాని; కిన్ = కి; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- అలా కాళ్ళు కడిగి తలపై జల్లుకున్న ఆ చక్రవర్తి విచ్చేసిన ఆ వామనునితో ఇలా అన్నాడు.

8-549-మ.

"వ**డు**గా! యెవ్వరివాఁడ? వెవ్వఁడవు? సంవాసస్థలంబెయ్య? ది
య్యె**డ**కున్ నీవరుదెంచుటన్ సఫలమయ్యెన్ వంశమున్జన్మమున్;
గ**డు**ధన్యాత్ముఁడనైతి; నీ మఖము యోగ్యంబయ్యె; నా కోరికల్
గ**డ**తేఱెన్; సుహుతంబులయ్యె శిఖులుం; గల్యాణ మిక్కాలమున్.

టీక:- వడుగా = బ్రహ్మచారి; ఎవ్వరివాడవు = ఎవరిపిల్లవాడవు; ఎవరవు = ఎవరివినీవు; సంవాస = ఉండెడి; స్థలంబు = చోటు; ఎయ్యెడకున్ = ఎక్కడ; నీవు = నీవు; అరుదెంచుటన్ = వచ్చుటచేత; సఫలము = సార్థకము; అయ్యెన్ = అయినది; వంశమున్ = (నా) వంశము; జన్మమున్ = పుట్టుక; కడు = మిక్కిలి; ధన్యాత్ముడను = పుణ్యాత్ముడను; ఐతిన్ = అయ్యాను; ఈ = ఈయొక్క; మఖమున్ = యాగము; యోగ్యంబు = పవిత్రమైనది; అయ్యెన్ = అయినది; నా = నా యొక్క; కోరికల్ = మనోవాంఛితములు; కడతేఱెన్ = తీరి పోయినవి; సుహుతంబులు = చక్కగాకాలుతున్నవి; అయ్యెన్ = అయినవి; శిఖులున్ = అగ్నులు; కల్యాణము = మిక్కిలి శుభదాయకము; ఈ = ఈ; కాలమున్ = సమయము.

భావము:- “ఓ బ్రహ్మచారీ! నీపేరేమిటి? ఎవరి పిల్లవాడవు? నీవు నివసించే చోటేది? ఇక్కడికి నీవు రావడంవల్ల నావంశమూ నా జన్మ సఫలము అయ్యాయి. నేను చాలా పుణ్యాత్ముడను అయ్యాను. ఈ యజ్ఞం పవిత్రం అయింది. నా కోరికలు నెరవేరాయి. అగ్నులు బాగా వేల్వబడ్డాయి. ఈ సమయం చాలా శుభదాయకం అయింది.

*8-550-మ.

వరచేలంబులొ మాడలో ఫలములో వన్యంబులో గోవులో
హరులో రత్నములో రథంబులొ విమృష్టాన్నంబులో కన్యలో
కరులో కాంచనమో నికేతనములో గ్రామంబులో భూములో
ధరణీ ఖండమొ కాక యే మడిగెదో ధాత్రీసురేంద్రోత్తమా! "

టీక:- వర = మంచి; చేలంబులో = బట్టలుకాని; మాడలో = సువర్ణ నాణెములుకాని {మాడ - అరవరహా, ఒకసువర్ణనాణెము}; ఫలములో=పళ్ళుకాని; వన్యంబులో= వనములు కాని; గోవులో = ఆవులుకాని; హరులో = గుఱ్ఱములుకాని; రత్నములో = మణులుకాని; రథంబులో = రథములుకాని; విమృష్టాన్నంబులో = మంచిఆహారములుకాని; కన్యలో = స్త్రీలుకాని; కరులు = ఏనుగులుకాని; కాంచనమో = బంగారముకాని; నికేతనములో = ఇళ్ళుకాని; గ్రామంబులో = ఊళ్ళుకాని; భూములో = పొలములుకాని; ధరణీఖండమో = భూభాగముకాని; కాక = కాకపోతే; ఏమి = ఏది; అడిగెదో = అడిగెదవు; ధాత్రీసుర = బ్రాహ్మణ; ఇంద్ర = శ్రేష్ఠులలో; ఉత్తమా = ఉత్తముడా.

భావము:- ఓ బ్రాహ్మణోత్తముడా! నీకేం కావాలో కోరుకో. మేలైన వస్త్రములా, డబ్బులా, పండ్లా, అడవి సంపదలా, గోవులా, గుఱ్ఱములా, రత్నాలా, రథాలా, మంచి ఆహారాలా, కన్యలా, ఏనుగులా, బంగారమా, భవనాలా, గ్రామాలా, పొలాలా, భూభాగాలా లేకపోతే ఇవి కాకుండా ఇంకేమైనా కోరుకుంటున్నావా?"

8-551-వ.

అని ధర్మయుక్తంబుగాఁ బలికిన వైరోచని వచనంబులు విని
సంతోషించి యీశ్వరుం డిట్లనియె.

టీక:- అని = అని; ధర్మయుక్తంబుగాన్ = ధర్మబద్ధముగా; పలికిన = అడిగిన; వైరోచని = బలిచక్రవర్తి {వైరోచని - విరోచనుని పుత్రుడు, బలి}; వచనంబులు = మాటలు; విని = విని; సంతోషించి = ఆనందించి; ఈశ్వరుండు = భగవంతుడు; ఇట్లు = ఇలా; అనియె = పలికెను.

భావము:- ఇలా ధర్మబద్ధంగా బలిచక్రవర్తి పలికిన పలుకులకు సంతోషించిన భగవంతుడైన వామనుడు ఇలా అన్నాడు.

## వామనుని సమాధానము

*8-552-సీ.

"ఇది నాకు నెలవని యేరీతిఁ బలుకుదు?-
నొక చో టనక యెందు నుండ నేర్తు;
నెవ్వనివాఁడ నం చేమని నుడువుదు?-
నా యంతవాఁడనై నడవనేర్తు;
నీ నడవడి యని యెట్లు వక్కాణింతుఁ?-
బూని ముప్పోకల బోవ నేర్తు;
నదినేర్తు నిదినేర్తు నని యేలఁ జెప్పంగ?-
నేరుపు లన్నియు నేన నేర్తు;

8-552.1-తే.

నొరులుఁ గారు నాకు నొరులకు నే నౌదు
నొంటివాఁడఁ జుట్ట మొకఁడు లేఁడు
సిరియుఁ దొల్లి గలదు చెప్పెద నా టెంకి
సుజనులందుఁ దఱచు చొచ్చియుందు.

టీక:- ఇది = దీనిని; నా = నా; కున్ = కు; నెలవు = నివాసము; అని = అని; ఏ = ఏ; రీతిన్ = విధముగా; పలుకుదు = చెప్పగలను; ఒక = ప్రత్యేకముగ ఒక; చోటు = ప్రదేశము; అనక = అనకుండ; ఎందున్ = ఎక్కడైనను; ఉండనేర్తున్ = ఉండగలను; ఎవ్వని = ఎవరికి చెందిన; వాడన్ = వాడిని; అంచున్ = అనుచు; ఏమి = ఏమి; అని = అని; నుడువుదున్ = చెప్పగలను; నా = నా; అంతవాడను = అంతవాడినినేనే; ఐ = అయ్యి; నడవనేర్తు = స్వేచ్ఛగావర్తించెదను; ఈ = ఇలాంటి; నడవడి = వర్తన కలవాడను; అని = అని; ఎట్లు = ఎలా; వక్కాణింతున్ = చెప్పగలను; పూని = ధృతితో; ముప్పోకలన్ = మూడు పోకడలు, పెక్కు త్రోవలను {ముప్పోకలు - మూడుపోకడలు, 1సత్త్వగుణము 2రజగుణము 3తమో గుణములు కల మూడువిధములు, 1శ్రవణ 2అధ్యయన 3ఉపన్యాస అనెడి మూడు విద్యలు, 1ముందుకు 2వెనుకుక 3పక్కలకు అనెడి మూడు

గమనములు}; పోవనేర్తు = వెళ్ళగలను; అది = అది; నేర్తున్ = తెలుసును; ఇది = ఇది; నేర్తున్ = తెలుసును; అని = అని; ఏల = ఎందుకు; చెప్పంగన్ = చెప్పడము; నేరుపులు = విద్యలు; అన్నియున్ = అన్ని; నేన = నేను; నేర్తున్ = తెలుసుకున్నాను; ఒరులు = ఇతరులు; కారు = ఏమీకారు.

నా = నా; కున్ = కు; ఒరుల = ఇతరుల; కున్ = కు; నేన్ = నేను; ఔదు = ఉపయోగ పడెదను; ఒంటి = ఒంటరి, అనితరమైన; వాడన్ = వాడిని; చుట్టము = బంధువు; ఒకడు = ఒక్కడుకూడ; లేడు = లేడు; సిరియున్ = లక్ష్మీదేవి, సంపద; తొల్లి = ఇంతకుముందు; కలదు = ఉన్నది; చెప్పెదన్ = తెలియచెప్పెదను; నా = నా యొక్క; టెంకి = నివాసము; సుజనులు = మంచివారి, పుణ్యాత్ముల; అందున్ = లో, ఎడల; తఱచు = ఎక్కువగా, ఎక్కువమార్లు; చొచ్చి = కూడి, చొరవకలిగి; ఉందున్ = ఉంటాను.

భావము:- “ఇది నా చోటు అని ఎలా చెప్పగలను? ఒక చోటనకుండా అన్ని చోట్లా ఉంటాను. ఎవరికి చెందినవాడనని చెప్పగలను? నేను నాఅంతవాడనై స్వేచ్ఛగా నడుచుకుంటాను. నానడవడి ఇది అని ఎలా చెప్పగలను? పూనికతో మూడుపోకడలూ పోగలను. అది ఇది నేర్చుకున్నానని చెప్పడము ఎందుకు గానీ, అన్ని విద్యలూ నేర్చుకున్నాను. వేరే వారు ఎవ్వరూ నన్ను చేరదీయరు. నేనే వారిని చేరదీస్తాను. నేను ఒంటరివాణ్ణి. చుట్టాలు ఎవరూ లేరు. ఇంతకు ముందు నాకు సిరికూడా ఉండేది. ఎక్కువగా నేను మంచివారితో కలిసి మసలుతుంటాను. అదే నా నివాసము.

8-553-వ.

అది యట్లుండ నిమ్ము.

టీక:- అది=దాని; అట్లు; ఉండనిమ్ము = ఉండనియ్యి. భావము:- ఆ సంగతి అట్లుండనీ.

8-554-సీ.

జననాథ! నీ మాట సత్యంబు సత్కీర్తి;
దంబు గులార్హంబు ధర్మయుతముఁ
గరుణానువర్తులు ఘనసత్త్వమూర్తులు-
కాని మీ కులమందుఁ గలుగ రొరులు
రణభీరువులు వితరణభీరువులు లేరు-
ప్రత్యర్థు లర్థులు ప్రబ్బికొనిన

దానశౌండిమమునఁ దనుపుదు రధికులై-
   మీ తాత లందఱు మేటిమగలు

8-554.1-ఆ.

మీ కులంబునందు మెఱయుఁ బ్రహ్లాదుండు
మింటి చంద్రుమాడ్కి మేలి రుచులఁ
బ్రథిత కీర్తితోడ భవదీయవంశంబు
నీరరాశి భంగి నెగడు చుండు.

టీక:- జననాథ = రాజా; నీ = నీ యొక్క; మాట = మాటలు; సత్యంబు = యధార్థములు; సత్ = మంచి; కీర్తిదంబు = కీర్తినిచ్చెడివి; కుల॰ = కులస్తులకు; అర్హంబు = తగినవి; ధర్మ యుతమున్ = ధర్మబద్ధమైనవి; కరుణ = కనికరము కలిగి; అనువర్తులు = నడచువారు; ఘన = మిక్కిలి; సత్త్వ =బలము గల; మూర్తులు = స్వరూపులు; కాని = తప్పించి; మీ = మీ యొక్క; కులము = వంశము; అందున్ = లో; కలుగరు = పుట్టరు; ఒరులు = ఇతరులు; రణ = యుద్ధమునందు; భీరువులున్ = పిరికివారు; వితరణ = దానముచేయుటయందు; భీరువులున్ = వెనుదీయువారు; లేరు = లేరు; ప్రత్యర్థులున్ = శత్రులు; అర్థులున్ = యాచకులు; ప్రబ్బికొనిన = కమ్ముకొనగా; దాన = దానములతోను; శౌండిమమునన్ = పరాక్రమముతోను; తనుపుదురు = తృప్తి కలిగించెదరు; అధికులు = అతిశయించినవారు; ఐ = అయ్యి; మీ = మీ యొక్క; తాతలు = పూర్వీకులు; అందఱున్ = అందరు; మేటి = గొప్ప; మగలు = శూరులు.

మీ = మీ యొక్క; కులంబున్ = వంశము; అందున్ = లో; మెఱయు = ప్రకాశించెడి; ప్రహ్లాదుండు = ప్రహ్లాదుడు; మింటి = ఆకామందున్న; చంద్రు = చంద్రుని; మాడ్కిన్ = వలె; మేలి = శ్రేష్ఠమైన; రుచులన్ = కాంతులతో; ప్రథిత = పెద్దదైన; కీర్తి = కీర్తి; తోడన్ = తోటి; భవదీయ = నీ యొక్క; వంశంబు = వంశము; నీరరాశి = సముద్రము {నీరరాశి - నీరు రాశిగాగలది, కడలి}; భంగిన్ = వలె; నెగడుచుండున్ = ప్రకాశించును.

భావము:- ఇప్పుడు నాతో నీవు అన్నమాట యదార్థం. మంచి కీర్తిని ఇచ్చేది నీ వంశానికి తగినది ధర్మంతో కూడినది మీ వంశం. మీకులంలో కనికరం కలవారూ ఆత్మబలంకలవారూ తప్ప వేరేవారు పుట్టలేదు. మీలో యుద్ధం చెయ్యడానికి గానీ, దానం ఇవ్వడానికి గానీ భయపడేవారు ఎవరూ లేరు. దరిచేరిన ప్రత్యర్థులకు పరాక్రమంతోనూ, దేహి అనే అర్థులకు దానంతోనూ తృప్తి కలిగిస్తారు. మీ పూర్వీకులు అందరూ గొప్ప

మేటివీరులు. ఆకాశంలో వెలిగే చంద్రునిలా మీ వంశంలో ప్రహ్లాదుడు మేలైన కాంతివంతమైన కీర్తితో ప్రకాశిస్తాడు. మీవంశం సమృద్ధమైన ఆకీర్తితో సముద్రంవలె పెంపారుతుంది.

8-555-వ.

## తొల్లి మీ మూఁడవ తాత హిరణ్యాక్షుండు విశ్వజయంబు జేసి గదా యుధుండై భూతలంబునఁ బ్రతివీరులం గానక సంచరింప విష్ణుండు వరాహ రూపంబున నతని సమయించె; తద్భ్రాత యగు హిరణ్య కశిపుఁ డది విని హరి పరాక్రమంబునకు నాశ్చర్యంబు నొంది తన జయంబును బలంబునుం బరిహసించి గ్రద్దన నుద్దవిడి నద్దనుజ మర్దను మందిరంబునకుం జనియె; నప్పుడు.

టీక:- తొల్లి = పూర్వము; మీ = మీ యొక్క; మూడవతాత = ముత్తాత; హిరణ్యాక్షుండు = హిరణ్యాక్షుడు; విశ్వ = జగత్తంతటిని; జయంబుచేసి = జయించి; గదాయుధుండు = గదా యుధమువాడు; భూతలంబునన్ = భూమండలముమీద; ప్రతివీరులన్ = ఎదిరించగల శూరులను; కానక = కనపడనివిధముగ; సంచరింపన్ = తిరుగుతుండగ; విష్ణుండు = నారాయణుడు; వరాహ = వరాహ; రూపంబునన్ = అవతారముతో; అతనిన్ = అతడిని; సమయించె = సంహరించెను; తత్ = అతని; భ్రాత = సహోదరుడు; అగు = అయిన; హిరణ్య కశిపుడు = హిరణ్యకశిపుడు; అది = ఆ విషయమును; విని = విని; హరి = నారాయణుని; పరాక్రమంబున్ =పరాక్రమమునకు; ఆశ్చర్యంబున్ = ఆశ్చర్యమును; ఒంది = పొంది; తన = అతని; జయంబును = జయశీలమును; బలంబునున్ = శక్తిని; పరిహరించి = తూలనాడి; గ్రద్దనన్ = వెంటనే; ఉద్దవిడిన్ = దండెత్తి; ఆ = ఆ; దనుజమర్దను = వైకుంఠుని; మందిర మున్ = వైకుంఠమున; కున్ = కు; చనియె = వెళ్ళెను; అప్పుడు = ఆ సమయమునందు.

భావము:- పూర్వం మీ మూడవ తరం తాత అయిన హిరణ్యాక్షుడు విశ్వాన్ని జయించి గదా దండాన్ని ధరించి భూలోకం అంతా తిరిగాడు. ఎక్కడా పగవాడు కనిపించలేదు. చివరకు అతనిని విష్ణువు వరాహరూపంలో పరిమార్చాడు. ఆ సంగతిని హిరణ్యాక్షుని సోదరుడైన హిరణ్యకశిపుడు విన్నాడు. విష్ణువు పరాక్రమానికి

ఆశ్చర్యపడ్డాడు. విష్ణువు విజయాన్ని బలాన్ని తూలనాడాడు. వెంటనే అసురమర్దనుడు విష్ణువు యొక్క పట్టణమైన వైకుంఠంపై దండెత్తాడు.

8-556-క.

**శూలా**యుధహస్తుండై
**కాలా**కృతి వచ్చు దనుజుఁ గని విష్ణుండుం
గా**ల**జ్ఞత మాయాగుణ
**శీ**లత నిట్లని తలంచెఁ జిత్తములోనన్.

టీక:- శూలా = శూలము యనెడి; ఆయుధ = ఆయుధము; హస్తుండు = చేతగలవాడు; ఐ = అయ్యి; కాలా = యముని; ఆకృతిన్ = వలె; వచ్చు = వచ్చెడి; దనుజున్ = రాక్షసుని; కని = చూసి; విష్ణుండున్ = నారాయణుడు; కాలజ్ఞతన్ = సమయజ్ఞతతో; మాయా = మాయగల; గుణశీలతన్ = లక్షణములతో; ఇట్లు = ఇలా; అ = అని; తలచెన్ = భావించెను; చిత్తము = మనసు; లోనన్ = అందు.

భావము:- అప్పుడు శూలాన్ని ధరించి ప్రళయకాలయమునివలె వస్తున్న హిరణ్యకశిపుణ్ణి చూసి, సమయాసమయములు గుర్తించగల మాయలమారి కనుక, విష్ణువు తన మనస్సులో ఇలా ఆలోచించాడు.

8-557-మ.

"ఎ**దు**రై పోర జయింప రా దితనిఁ; గా కెందేనియుం బోవ భీ
ప్ర**దుఁ**డై ప్రాణులఁదోలు మృత్యువుక్రియంబైవచ్చు"నంచుం గ్రియా
వి**దుఁ**డబ్జాక్షుఁడు సూక్ష్మరూపమున నావేశించె నిశ్వాస రం
ధ్ర **దిశన్** దైత్యు హృదంతరాళమునఁ బ్రత్యక్షక్రియాభీరుఁడై.

టీక:- ఎదురై = ఎదిరించి; పోర = యుద్ధము చేయుటకు; జయింపన్ = జయించుటకు; రాదు = వీలుకాదు; ఇతనిన్ = ఇతనిని; కాక = అలాకాకుండగ; ఎందేనియున్ = ఎక్కడి కైనను; పోవన్ = పోయినచో; భీప్రదుడు = భయము కలిగించెడివాడు; ఐ = అయ్యి; ప్రాణు లన్ = జీవులను; తోలున్ = తరుమును; మృత్యువు = మరణము; క్రియన్ = వలె; పైవచ్చు = మీదికివచ్చును; అంచున్ = అనుచు; క్రియా = ఉపాయము; విదుడు = తెలిసినవాడు; అబ్జాక్షుడు = నారాయణుడు; సూక్ష్మ = చాలాచిన్న; రూపమునన్ = రూపముతో; ఆవేశించె = ప్రవేశించెను; నిశ్వాసరంధ్ర = ముక్కు; దిశన్

= ద్వారా; దైత్యు = రాక్షసుని; హృత్ = హృదయము; అంతరాళమునన్ = లోనికి; ప్రత్యక్షక్రియా = ఎదుర్కొనుటకు; భీరుడు = బెదరినవాడు; ఐ = అయ్యి.

భావము:- ఈ హిరణ్యకశిపుడిని యుద్ధంలో ఎదిరించి జయించడానికి వీలుకాదు. అలాకాకుండా నేను ఎక్కడికైనా వెళ్ళిపోతే ఇక లోకంలోని ప్రాణులపైకి మృత్యువు మాదిరిగా దండెత్తి భయపెట్టి పారద్రోలుతాడు అనుకొని విష్ణువు ఉపాయాన్ని ఆలోచించాడు. సూక్ష్మరూపంతో ముక్కురంధ్రం గుండా హిరణ్యకశిపుని హృదయంలో ప్రవేశించాడు.

8-558-వ.

**అంతనద్దైత్యవల్లభుండు వైష్ణవాలయంబు జొచ్చి వెదకి హరిం గానక కోపంబుమానక మిన్నుమన్నునన్వేషించి త్రిదివంబు నరసి, దిశలం బరికించి, భూవివరంబులు వీక్షించి, సముద్రంబులు వెదకి, పురంబులు శోధించి, వనంబులు విమర్శించి, పాతాళంబు పరీక్షించి, జగంబున నదృష్టశత్రుండై మార్గణంబు చాలించి, తనలో నిట్లనియె.**

టీక:- అంతన్ = అంతట; ఆ = ఆ; దైత్య = రాక్షస; వల్లభుండు = రాజు; వైష్ణవాలయంబున్ = వైకుంఠమును {వైష్ణవాలయము -విష్ణువు యొక్క నివాసము, వైకుంఠము}; చొచ్చి = ప్రవేశించి; వెదకి = అన్వేషించి; హరిన్ = విష్ణుని; కానక = కనుగొనలేక; కోపంబు = కోపము; మానక = వదలకుండ; మిన్ను = ఆకాశము; మన్ను = నేల; అన్వేషించి = వెతికి; త్రిదివంబున్ = స్వర్గమును {త్రిదివము - భూర్భువస్సువః త్రిలోకములలోని మూడవది, స్వర్గము}; అరసి = గాలించి; దిశలన్ = దిక్కులను; పరికించి = పరిశీలించి చూసి; భూవివ రంబులున్ = బొరియ గుహాదులందు; వీక్షించి = చూసి; సముద్రంబులు = సముద్రము లలో; వెదకి = అన్వేషించి; పురంబులు = పట్టణములు; శోధించి = వెతికి; వనంబులున్ = అడవులను; విమర్శించి = గాలించి; పాతాళంబున్ = పాతాళమును; పరీక్షించి = వెతికి; జగంబునన్ = జగత్తునందు; అదృష్ట = కనబడని; శత్రుండు = శత్రువు కలవాడు; ఐ = అయ్యి; మార్గణంబు = వెతకుట; చాలించి = ఆపివేసి; తన = తన; లోనన్ = మనసులో; ఇట్లు = ఇలా; అనియె = అనుకొనెను.

భావము:- ఆ తరువాత ఆ రాక్షసేంద్రుడు హిరణ్యకశిపుడి వైకుంఠం ప్రవేశించి, విష్ణువు కోసం వెదకాడు. కానీ పగవాడు కనిపించ లేదు. కోపంతో ఆ రాక్షసుడు విష్ణువు కోసం

ఆకాశాన్ని, భూలోకాన్ని, స్వర్గలోకాన్ని గాలించాడు. సకల దిక్కులనూ, భూగర్భాలనూ, సముద్రాలనూ, పట్టణాలనూ, అడవులనూ అంతటా వెదకాడు. లోకంలో విష్ణువుజాడ ఎక్కడా చిక్కలేదు. కడకు వెతుకుట ఆపి ఇలా అనుకున్నాడు.

8-559-క.

"పగవాఁడు మడియ నోపును
దెగడేనియు నెదురుపడఁడె? దేహధరులకుం
దెగిన యెడఁ బగఱ మీఁదనుఁ
బగఁగొనఁ దగ"దనుచు నుడిగెఁ బ్రాభవశక్తిన్.

టీక:- పగవాడు = శత్రువు; మడియన్ = మరణించి; ఓపున్ = యుండిఉండ వచ్చును; తెగడు = మరణించక ఉన్నవాడు; ఏనియున్ = అయినచో; ఎదురుపడడె = ఎదుర్కొనెడి వాడేకదా; దేహధరుల్ = జీవుల; కున్ = కు; తెగిన = మరణించిన; ఎడన్ = తరువాత; పగఱ = శత్రువుల; మీదనున్ = పైన; పగగొన = పగబూనుట; తగదు = యుక్తముకాదు; అనుచునున్ = అనుచు; ఉడిగెన్ = విడిచెను; ప్రాభవశక్తిన్ = దండయాత్రను;

భావము:- “నా శత్రువు మరణించి ఉండవచ్చు. మరణించకుండా ఉండి ఉంటే నన్ను ఎదుర్కొనేవాడే కదా. మరణించిన పగవారిపై పగబూనడం తగదు.” అని హిరణ్యకశిపుడు అనుకొని విష్ణువుపై దండయాత్ర ఆపెను

8-560-వ.

అతండు మీ ప్రపితామహుం; డతని గుణంబు లనేకంబులు గల; వవి యట్లుండనిమ్ము.

టీక:- అతండు = అటువంటివాడు; మీ = మీ యొక్క; ప్రపితామహుండు = ముత్తాత; అతని = అతని యొక్క; గుణంబుల్ = గొప్పగుణములు; అనేకంబులు = చాలా; కలవు = ఉన్నాయి; అవి = వానిని; అట్లు = అలా; ఉండనిమ్ము = ఉండనియ్యి.

భావము:- ఈవిధంగా అనుకొని దండయాత్ర ఆపేసాడు. అలాంటి మీ ముత్తాత హిరణ్యకశిపుడు గుణాలు లెక్కలేనన్ని ఉన్నాయి అనుకో. వాటిని అలా ఉండనీ.

8-561-క.

**ఆతుర భూసురగతిఁ బురు**
**హూతాదులుఁ దన్ను వేఁడ నొగిఁ గొం డనుచున్**
**మీ తండ్రి యిచ్చె నాయువు**
**నేతన్మాత్రుఁడవె నీవు నీలోకమునన్?**

టీక:- ఆతుర = ఆపదలోనున్న; భూసుర = బ్రాహ్మణుల; గతిన్ = వలె; పురుహూత = ఇంద్రుడు {పురుహూతుడు - యజ్ఞములందు ప్రచురమైన పిలుపు కలవాడు, ఇంద్రుడు}; ఆదులున్ = మొదలగువారు; తన్ను = తనను; వేడన్ = అర్థించగా; ఒగిన్ = ఒప్పుకొని; కొండు = తీసుకొనండి; అనుచున్ = అనుచు; మీ = మీ యొక్క; తండ్రి = నాన్న; ఇచ్చెన్ = ఇచ్చివేసెను; ఆయువున్ = ఆయుష్షును; ఏతన్మాత్రుడవె = వారికి తీసిపోనివాడవే కదా; నీవున్ = నీవుకూడ; ఈ = ఈ; లోకమునన్ = లోకములో.

భావము:- ఇక మీ తండ్రి మాత్రం సామాన్యుడా ఇంద్రాదులు బ్రహ్మణులవలె బాధ నటిస్తూ అర్థించగా సరే తీసుకోండి అంటూ మీ తండ్రి వారికి తన ఆయుస్సును దానమిచ్చేసాడు. నీవు కూడా వారికి ఏమాత్రం తీసిపోవు.

8-562-క.

**ఏలితివి మూఁడు జగములుఁ;**
**దోలితి వింద్రాది సురలఁ; దొల్లిటివారిం**
**బోలితివి దానగుణముల;**
**సోలితివి పిశాచరాక్షసుల రక్షింపన్.**

టీక:- ఏలితివి = పరిపాలించితివి; మూడుజగములున్ = ముల్లోకములను; తోలితివి = తరిమితివి; ఇంద్ర = ఇంద్రుడు; ఆది = మున్నగు; సురలన్ = దేవతలను; తొల్లిటివారిన్ = పూర్వులను; పోలితివి = సరిపోలితివి; దాన = దానముచేసెడి; గుణములన్ = లక్షణము లతో; సోలితివి = పారవశ్యము పొందితివి; పిశాచ = భీకరులైన; రాక్షసులన్ = రాక్షసులను; రక్షింపన్ = కాపాడుటయందు.

భావము:- నీవు ముల్లోకాలనూ పాలించావు. ఇంద్రాది దేవతలను ఓడించావు. దానమివ్వడంలోనూ గుణాలలోనూ మీ పెద్దలకు సరిపోలిన వాడవు అయ్యావు. రాక్షసులను రక్షించడంలో సమర్థుడవు అయ్యావు.



## వామనుడు దాన మడుగుట

8-563-వ.

**అదియునుం గాక.**

టీక:- అదియునున్ = అంతే; కాక = కాకుండగ.

భావము:- అంతే కాకుండా.

8-564-క.

**రాజ్యంబు గలిగె నేనిం**
**బూజ్యులకును యాచకులకు భూమిసురులకున్**
**భాజ్యముగ బ్రతుక డేనిం**
**ద్యాజ్యంబులు వాని జన్మ ధన గేహంబుల్.**

టీక:- రాజ్యంబున్ = రాజ్యాధికారము; కలిగెన్ = లభించిన; ఏనిన్ = ఎడల; పూజ్యుల = గౌరవింపదగినవారి; కునున్ = కి; యాచకుల = భిక్షుల; కున్ = కు; భూమిసురుల్ = బ్రాహ్మణుల; కున్ = కు; భాజ్యముగన్ = పంచిపెట్టెడి విధముగ; బ్రతుకడేనిన్ = జీవించక పోయినచో; త్యాజ్యంబులున్ = త్యజింపదగినవి; వాని = అతని; జన్మ = పుట్టుక; ధన = సంపద; గేహంబుల్ = గృహములు.

భావము:- రాజ్యాధికారం కలిగినప్పుడు గౌరవింపదగినవారికీ, బ్రాహ్మణులకూ బిచ్చగాళ్ళకూ ధనాన్ని పంచిపెడుతూ బ్రతకాలి. అలా చేయనివాడి బ్రతుకూ, ధనమూ, గృహములు నిరర్థకమైనవి, పరిత్యజింప తగినవి.

8-565-క.

మున్నెన్నుదురు వదాన్యుల
నెన్నెడుచో నిన్నుఁ ద్రిభువనేశుం డనుచున్;
ఇన్నిదినంబుల నుండియు
నెన్నఁడు నినుఁ బెట్టు మనుచు నీంద్రము జేయన్.

టీక:- మున్ను = ముందుగ; ఎన్నుదురు = లెక్కించెదరు; వదాన్యులన్ = దాతలను; ఎన్నెడుచో = లెక్కించునప్పుడు; నిన్నున్ = నిన్ను; త్రిభువన = ముల్లోకములకు; ఈశుండు = ప్రభువు; అనుచున్ = అనుచు; ఇన్ని = ఇన్ని; దినంబుల = రోజుల; నుండి యున్ = నుంచి; ఎన్నడున్ = ఎప్పుడుకూడ; నినున్ = నిన్ను; పెట్టుము = ఇమ్ము; అనుచున్ = అనుచు; ఈంద్రము = పీడించుట; చేయన్ = చేయలేదు.

భావము:- దాతలను లెక్కించేటప్పుడు ముల్లోకాలలోనూ గొప్పవాడుగా మొట్టమొదట నిన్నే ఎన్నిక చేస్తారు. ఇంతవాడవు అయినా ఇంతవరకూ నిన్ను ఇమ్మంటూ ఏనాడూ నేను పీడించలేదు.

*8-566-ఆ.

ఒంటివాఁడ నాకు నొకటి రెం డడుగుల
మేర యిమ్ము సొమ్ము మేర యొల్ల;
గోర్కిఁదీర బ్రహ్మకూకటి ముట్టెద
దానకుతుకసాంద్ర! దానవేంద్ర!".

టీక:- ఒంటివాడన్ = ఒక్కడను; నా = నా; కున్ = కు; ఒకటిరెండు = మూడు (3); అడుగుల = అడుగుల; మేర = కొలత కల భూమి; ఇమ్ము = ఇమ్ము; సొమ్ము = సంపదలు; మేర = ఎల్లను; ఒల్ల = అంగీకరించను; కోర్కిన్ = కోరిక; తీరన్ = తీరినచో; బ్రహ్మకూకటి ముట్టెదన్ = మిక్కిలి సంతోషించెదను {బ్రహ్మకూకటిముట్టెదను - బ్రహ్మయొక్క జుట్టును అందుకొనెదను, మహానందపడెదను}; దాన = దానముచేసెడి; కుతుక = కుతూహలము; సాంద్ర = అధికముగా కలవాడ; దానవేంద్ర = రాక్షసరాజా.

భావము:- ఓ దానవరాజా! దానం చేయాలనే గట్టి కుతూహలం కలవాడా! బలిచక్రవర్తీ! నేను ఒంటరివాడిని. నాకు సొమ్ములూ భూములూ అక్కరలేదు. మూడడుగుల నేల మాత్రము ఇమ్ము. దానితో తృప్తిపడి బ్రహ్మానందం పొందుతాను."

8-567-వ.

## అనిన బరమయాచకునకుఁ బ్రదాత యిట్లనియె.

టీక:- అనినన్ = అనగా; పరమ = మహా; యాచకున్ = భిక్షుని; కున్ = కి; ప్రదాత = గొప్పదాత; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- ఇలా మూడు అడుగుల నేల అడిగిన ఉత్కృష్ట భిక్షుకుడైన వామనుడితో, బహు దొడ్డ దాత అయిన బలిచక్రవర్తి ఇలా అన్నాడు.

8-568-ఆ.

## "ఉన్నమాటలెల్ల నొప్పును విప్రుండ!
## సత్య గతులు వృద్ధ సమ్మతంబు;
## లడుగఁ దలఁచి కొంచె మడిగితివో చెల్ల;
## దాత పెంపు సొంపుఁ దలఁపవలదె."

టీక:- ఉన్నమాటలు = చెప్పినవి; ఎల్లన్ = అన్ని; ఒప్పును = తగును; విప్రుండ = బ్రాహ్మణుడా; సత్య = యదార్థమైన; గతులు = విధములు; వృద్ధ = పెద్దలచే; సమ్మతంబులు = అంగీకరింపబడునవి; అడుగన్ = అడగవలెనని; తలచి = అనుకొని; కొంచెము = కొద్దిగానే; అడిగితివో = అడిగితివేమి; చెల్ల = అరె; దాత = దాతయొక్క; పెంపు = గొప్పదనమును; సొంపున్ = మంచితనమును; తలపన్ = భావించ; వలదె = వద్దా.

భావము:- "ఓ బ్రాహ్మణుడా! నీ మాటలన్నీ ఉన్నమాటలే. వాటిని ఒప్పుకోవలసిందే. ముమ్మాటికీ సత్యములే. అందుకు పెద్దలు కూడా కాదనరు. కానీ పాపం అడక్క అడక్క

అడిగి ఇంత కొంచెమే అడిగావు. చాలా బాగుంది. కానీ అడిగే టప్పుడు దాత గొప్ప దనాన్నీ అతని గొప్ప గుణాన్ని తలచాలి కదా!”

8-569-వ.

## అని మఱియు ని ట్లనియె.

టీక:- అని = అని; మఱియున్ = ఇంకా; ఇట్లు = ఇలా; అనియె = పలికెను.

భావము:- అని బలిచక్రవర్తి మరల ఇలా అన్నాడు.

*8-570-మ.

## "వసుధాఖండము వేఁడితో? గజములన్ వాంఛించితో? వాజులన్ వెసనూహించితొ? కోరితో యువతులన్ వీక్షించి కాంక్షించితో? పసిబాలుండవు; నేర వీ వడుగ; నీ భాగ్యంబు లీపాటి గా కసురేంద్రుండు పదత్రయం బడుగ నీ యల్పంబు నీ నేర్చునే?"

టీక:- వసుధాఖండము = భూభాగమును; వేడితో = అడుగుటకాని; గజములన్ = ఏనుగులను; వాంఛించితో = కోరుటకాని; వాజులన్ = గుఱ్ఱములను; వెసన్ = మిక్కిలి; ఊహించితో = అనుకొనుటకాని; కోరితో = కావాలనుటకాని; యువతులన్ = జవరాండ్రను; వీక్షించి = చూసి; కాంక్షించితో = కోరుటకాని; పసి = బాగాచిన్న; బాలుండవు = పిల్లవాడవు; నేరవు = తెలియనివాడవు; అడుగ = అడుగుట; నీ = నీయొక్క; భాగ్యంబుల్ = అదృష్ట ములు; ఈపాటి = ఈమాత్రమే; కాక = అయినప్పటికిని; అసురేంద్రుండు = రాక్షసచక్రవర్తి; పదత్రయంబు = మూడడుగులే; అడుగన్ = అడిగినని; ఈ = ఇంత; అల్పంబున్ = స్వల్ప ముగా, కొంచెమును; ఈన్ = ఇచ్చుట; నేర్చునే = చేయకలడా.

భావము:- “భూభాగం కోరుకోవాలి లేదా ఏనుగులు కోరుకోవాలి లేదా గుఱ్ఱాలను కోరాలి లేదా అందగత్తెలను చూసి కాంక్షపుడితే జవరాండ్రను కోరుకోవాలి; కాని చిన్నపిల్లాడివి కదా అడగటం తెలియదు; నీ సిరి / సామర్థ్యం ఇంత అల్పమైందే. కనుకే మూడడుగులు మాత్రమే అడిగావు; ఐనా ఇంతటి రాక్షస చక్రవర్తిని ఇంత అల్పం ఎలా ఇస్తాను.”

అని అంటున్నాడు బలిచక్రవర్తి మూడడుగుల మేర దానం అడిగిన వామనునితో.

8-571-వ.

**అనిన మొగంబునం జిఱునగవు మొలకలెత్త గృహమేధికి మేధావి యి ట్లనియె.**

టీక:- అనినన్ = అనగా; మొగంబునన్ = ముఖమునందు; చిఱునగవు = చిరునవ్వు; మొలకలెత్త = ఉదయించగా; గృహమేధి = గృహస్థున; కిన్ = కు; మేధావి = విజ్ఞాని; ఇట్లు = ఇలా; అనియె = చెప్పెను.

భావము:- ఇలా ఇంత చిన్నదానమా అంటున్న యాగ యజమాని బలిచక్రవర్తితో మేధావి అయిన వామనుడు ఇలా అంటున్నాడు.

*8-572-మ.

**గొడుగో,జన్నిదమో, కమండలువొ,నాకున్ ముంజియో,దండమో,**
**వడుఁగే నెక్కడ భూము లెక్కడ? కరుల్, వామాక్షు, లశ్వంబు లె**
**క్కడ? నిత్యోచిత కర్మ మెక్కడ? మదాకాంక్షామితంబైన మూఁ**
**డడుగుల్ మేరయ త్రోవ కిచ్చుటది బ్రహ్మాండంబు నా పాలికిన్.**

టీక:- గొడుగో = గొడుగుకాని; జన్నిదమో=జంధ్యముకాని; కమండులువొ= కమండలము కాని; నా = నా; కున్ = కు; ముంజియో = మొలత్రాడుకాని; దండమో = యోగదండము కాని; వడుగున్ = బ్రహ్మచారిని; ఏన్ = నేను; ఎక్కడ = ఎక్కడ; భూములు = భూభాగ ములు; ఎక్కడ = ఎక్కడ; కరుల్ = ఏనుగులు; వామాక్షులు = జవరాండ్రు; అశ్వంబులున్ = గుఱ్ఱములు; ఎక్కడ = ఎక్కడ; నిత్యోచితకర్మము = నిత్యకృత్యములు; ఎక్కడ = ఎక్కడ; మత్ = నాచేత; కాంక్షితంబు = కోరబడినది; ఐన = అయిన; మూడు = మూడు (3); అడుగుల్ = అడుగుల; మేరయ = పాటిది; త్రోవక = కాదనక; ఇచ్చుట = దానముచేయుట; అది = అదే; బ్రహ్మాండంబు = బ్రహ్మాండము; నా = నా; పాలికిన్ = పాలిటికి, మట్టుకు.

భావము:- “అయ్యా! నేను బ్రహ్మచారిని. నాకు గొడుగు కాని, యజ్ఞోపవీతం కాని, కమండలం కాని, మొలతాడు కాని ఉపయోగిస్తాయి. అంతేకాని బ్రహ్మచారి నైన నా కెందుకు భూములు, ఏనుగులు, గుఱ్ఱాలు, స్త్రీలు. నా నిత్యకృత్యాలకి వాటితో పనిలేదు కదా. కాదని తోసేయకుండ నే కోరిన ఆ మూడు అడగుల చోటిస్తే అదే నాకు బ్రహ్మాండం.

8-573-వ.

**అదియునుంగాక.**

టీక:- అదియునున్ = అంతే; కాక = కాకుండగ.

భావము:- అంతేకాకుండా. .

8-574-క.

**వ్యాప్తింబొందక వగవక**
**ప్రాప్తంబగు లేశమైనఁ బదివే లనుచుం**
**దృప్తింజెందని మనుజుఁడు**
**సప్తద్వీపముల నయినఁ జక్కంబడునే?**

టీక:- వ్యాప్తిన్ = ఉబ్బిపోవుట; పొందక = పొందకుండగ; వగవక = విచారించకుండ; ప్రాప్తంబు = దొరికినది; అగు = అయిన; లేశము = ఎంత అల్పము, కొంచెము; ఐనన్ = అయినప్పటికిని; పదివేలు = అధికమైనది; అనుచున్ = అనుకొని; తృప్తిన్ = తృప్తి; చెందని = పడని; మనుజుడు = మానవుడు; సప్తద్వీపములన్ = సప్తద్వీపముల సంపద తో {సప్త ద్వీపములు - 1జంబూ 2ప్లక్ష 3శాల్మల 4కుశ 5క్రౌంచ 6శాక 7పుష్కర యనెడి 7 ద్వీపములు}; అయినన్ = అయినప్పటికిని; చక్కంబడునే = సరిగా అగునా కాదు.

భావము:- లభించినది ఎంత కొంచం అయినాసరే ఉబ్బితబ్బిబ్బు పడకుండా, అదే పదివేలుగా భావించి తృప్తి పొందాలి. అలా తృప్తిపడనివారికి సప్తద్వీపాల సంపదలు వచ్చిపడినా కూడా తృప్తి తీరదు.

*8-575-శా.

**ఆశాపాశము దాఁ గడున్ నిడుపు; లే దంతంబు రాజేంద్ర! వా**
**రాశిప్రావృత మేదినీవలయ సామ్రాజ్యంబు చేకూడియుం**
**గాసింబొందిరిఁ గాక పైన్య గయ భూకాంతాదులున్నర్థకా**
**మాశంబాయఁగ నేర్చిరే మును నిజాశాంతంబులం జూచిరే.**

టీక:- ఆశా = ఆశ యనెడి; పాశంబు = తాడు; తాన్ = అది; కడున్ = మిక్కిలి; నిడుపు = పొడవైనది; లేదు = లేదు; అంతంబు = అంతు; రాజేంద్రా = చక్రవర్తి; వారాశి = సముద్రముచే {వారాశి - నీటికికుప్ప, కడలి}; ప్రావృత = చుట్టబడిన; మేదినీ = భూ; వలయ = మండల; సామ్రాజ్యంబున్ = సామ్రాజ్యములు; చేకుడియున్ = సమకూరి నప్పటికి; గాసిన్ = శ్రమను; పొందిరి = పడిరి; కాక = కావచ్చుకాని; పైన్య = పృథుడు; గయ = గయుడు యనెడి; భూకాంతులున్ = చక్రవర్తులుకూడ; అర్థ = సంపదలపైన; కామ = కామములపైన; ఆశన్ = ఆశను; పాయగన్ = వదలుట; నేర్చిరే = చేయగలి

గిరా, లేదు; మును = ఇంతకుముందు; నిజ = తమ; ఆశ = ఆశలకు; అంతంబున్ = అంతును; చూచిరే = కనుగొనగలిగిరా, లేదు.

భావము:- బలి రాక్షస మహారాజా! ఆశ మిక్కిలి పొడవైన త్రాడు వంటిది. దానికి అంతు అన్నది ఉండదు. పూర్వకాలంలో పృధుచక్రవర్తీ గయుడూ మొదలైన రాజులు సముద్రాల దాకా వ్యాపించిన సామ్రాజ్యాన్ని సంపాదించి పాలించారు. వారు సైతం వృథాగా కష్టపడినవారే కానీ అర్థంమీదా కామంమీదా ఆశలను వదలుకోలేదు. అంతటి వారు కూడా ఆశల అంతు చూడలేదు కదా.

8-576-సీ.

సంతుష్టుఁడీ మూఁడు జగములఁ బూజ్యుండు-
సంతోషి కెప్పుడుఁ జరుఁగు సుఖము
సంతోషిఁ గాకుంట సంసార హేతువు-
సంతసంబున ముక్తిసతియు దొరకుఁ
బూఁటపూఁటకు జగంబుల యదృచ్ఛాలాభ-
తుష్టిని దేజంబు తోన పెరుఁగుఁ
బరితోష హీనతఁ బ్రభ చెడిపోవును-
జలధార ననలంబు సమయునట్లు

8-576.1-ఆ.

నీవు రాజ వనుచు నిఖిలంబు నడుగుట
దగవు గాదు నాకుఁ; దగిన కొలఁది
యేను వేఁడికొనిన యీ పదత్రయమునుఁ
జాల దనక యిమ్ము; చాలుఁజాలు."

టీక:- సంతుష్టుడు = తృప్తిపడువాడు; ఈ = ఈ; మూడుజగములన్ = ముల్లోకములం దును; పూజ్యుండు = గౌరవింపదగినవాడు; సంతోషి = తృప్తిపడువాని; కిన్ = కి; ఎప్పుడున్ = ఎప్పటికిని; జరుగు = కలుగుతుండును; సుఖము = సౌఖ్యము; సంతోషి = సంతృప్తి; కాకుంటన్ = చెందకపోవుట; సంసార = సంసారబంధనములకు; హేతువు = కారణము; సంతసంబునన్ = సంతృప్తివలన; ముక్తి = మోక్షము యనెడి;

సతియున్ = కాంతకూడ; దొరకున్ = లభించును; పూటపూట = ప్రతిదినమున; కు=కు; జగంబులన్= లోకములందు; అదృచ్ఛా = తనకితానుగా; లాభ = దొరకినదానితో; తుష్టినిన్ = తృప్తివలన; తేజంబున్ = తేజస్సు; తోనన్ = తోపాటు; పెరుగున్ = అభివృద్ధి కలుగును; పరితోష = సంతృప్తి; హీనతన్ = లేకపోవుటచేత; ప్రభ = తేజస్సు; చెడిపోవును = పాడైపోవును; జల = నీటి; దారన్ = దారలవలన; అనలంబు = అగ్ని; సమయున్ = ఆరిపోవు; అట్లు = విధముగా.

నీవున్ = నీవు; రాజవు = రాజువుకదా; అనుచున్ = అని; నిఖిలంబున్ = సమస్తమును; అడుగుట = కోరుట; తగవు = తగినది; కాదు = కాదు; నా = నా; కున్ = కు; తగిన = సరిపడిన; కొలది = అంత; ఏనున్ = నేను; వేడికొనిన = కోరుకొన్న; ఈ = ఈ; పద = అడుగులు; త్రయమును = మూడింటిని (3); చాలదు = వీలుకాదు; అనక = అనకుండగ; ఇమ్ము = ఇమ్ము; చాలుజాలు = ఇంకచాలు.

భావము:- తృప్తిపడేవాడు ముల్లోకాల్లోనూ గౌరవింపబడతాడు. తృప్తునికి ఎప్పుడూ సుఖం కలుగుతుంది. సంతోషం లేకపోవడమే తిరిగి పుట్టడానికి కారణం. సంతోషంవల్ల మోక్షం కూడా సమకూరుతుంది. పూటపూటకూ తనంతతానుగా దొరికినదానితో సంతోష పడుతుంటే తేజస్సు పెరుగుతుంది. నీళ్ళ వలన నిప్పు చల్లారినట్లుగా సంతోషం లేకపోతే తేజస్సు తగ్గిపోతుంది. నీవు రాజువు కదా అని అవి ఇవి అన్నీ అడగడం భావ్యం కాదు. నాకు తగినట్లుగా నేనడిగిన మూడుఅడుగులూ కాదనకుండా ఇమ్ము. అంతే చాలు. అదే చాలు."

## శుక్ర బలి సంవాదంబును

8-577-వ.

### అని యిట్లు పలుకుచున్న ఖర్వునకు నుర్వీదానంబు చేయం దలంచి కరకలితసలిలకలశుండైన యవ్వితరణగుణముఖరునిం గని, నిజవిచారయుక్త దనుజ రాజ్యచక్రుండగు శుక్రుం డిట్లనియె.

టీక:- అని = అని; ఇట్లు = ఈ విధముగ; పలుకుచున్న = అనుచున్న; ఖర్వున్ = పొట్టివాని; కును = కి; ఉర్వీదానంబు = భూదానము; చేయన్ = చేయవలెనని; తలచి = అనుకొని; కర = చేతిలో; కలిత = ఉన్న; సలిల = నీటి; కలశుండు = కలశము కలవాడు; ఐన = అయినట్టి; ఆ = ఆ; వితరణ = దానముచేసెడి; గుణ = లక్షణములతో;

ముఖరునిన్ = ముఖ్యమైనవానిని; కని = చూసి; నిజ = తన; విచార = ఆలోచనలో; యుక్త = కూడిన; దనుజ = రాక్షస; రాజ్య = రాజ్యమును; చక్రుండు = నడపువాడు; అగు = అయిన; శుక్రుండు = శుక్రుడు; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- ఇలా చాలంటూ పలికిన వామనునికి మూడు అడుగుల భూదానం ఇవ్వడానికి బలిచక్రవర్తి జలకలశం చేతిలోనికి తీసుకుని సమాత్తం అవుతున్నాడు. అంతలో రాక్షసరాజ్య నిర్వాహణా దక్షుడు అయిన శుక్రాచార్యుడు దానశీలుడైన దానవచక్రవర్తి బలితో ఇలాఅన్నాడు.

8-578-సీ.

"దనుజేంద్ర! యీతఁడు ధరణీసురుఁడుఁ గాడు-
  దేవకార్యంబు సాధించుకొఱకు
హరి విష్ణుఁ డవ్యయుం డదితి గర్భంబునఁ-
  గశ్యపసూనుఁడై కలిఁగె; నకట!
యెఱుఁగ కీతని కోర్కి నిచ్చెద నంటివి-
  దైత్య సంతతి కుపద్రవము వచ్చు
నీ లక్ష్మిఁ దేజంబు నెలవు నైశ్వర్యంబు-
  వంచించి యిచ్చుఁ దా వాసవునకు;

8-578.1-ఆ.

మొనసి జగము లెల్ల మూఁడు పాదంబుల
నఖిలకాయుఁ డగుచు నాక్రమించు
సర్వ ధనము విష్ణు సంసర్జనము చేసి
బడుగు పగిది నెట్లు బ్రతికె దీవు?

టీక:- దనుజేంద్ర = రాక్షసచక్రవర్తి; ఈతడు = ఇతగాడు; ధరణీసురుడు = బ్రాహ్మణుడు; కాడు = కాడు; దేవ = దేవతల; కార్యంబు = పని; సాధించు = సాధించుట; కొఱకు = కోసము; హరి = నారాయణుడు; విష్ణుడు = నారాయణుడు; అవ్యయుండు = నారాయణుడు; అదితి = అదితి యొక్క; గర్భంబునన్ = కడుపులో; కశ్యప = కశ్యపునియొక్క; సూనుడు = పుత్రుడు; ఐ = అయ్యి; కలిగెన్ = పుట్టెను; అకట =

అయ్యో; ఎఱుగక = తెలియక; ఈతని = ఇతని యొక్క; కోర్కిన్ = కోరికను; ఇచ్చెదన్ = ఇస్తాను; అంటివి = అన్నావు; దైత్య = రాక్షస; సంతతి = కులమున; కున్ = కు; ఉపద్రవము = పెనుముప్పు; వచ్చున్ = వచ్చును; నీ = నీ యొక్క; లక్ష్మిన్ = సంపదలను; తేజంబున్ = తేజస్సును; నెలవున్ = స్థానమును; ఐశ్వర్యంబున్ = ఐశ్వర్యమును; వంచించి = దొంగిలించి; ఇచ్చున్ = ఇచ్చును; తాన్ = అతడు; వాసవున్ = ఇంద్రుని; కు = కి.

మొనసి = వ్యూహముపన్ని; జగములు = లోకములు; ఎల్లన్ = అన్నిటిని; మూడు = మూడు (3); పాదంబులన్ = అడుగులతోటి; అఖిలకాయుండు = విశ్వరూపుడు; అగుచున్ = అగుచు; ఆక్రమించున్ = అలముకొనును; సర్వ = సమస్తమైన; ధనమున్ = సంపదలను; విష్ణు = నారాయణునికి; సంసర్జనంబు = అప్పజెప్పుట; చేసి = చేసి; బడుగు= బీదవాని; పగిదిన్ = వలె; ఎట్లు = ఎలా; బ్రతికెదవు = జీవించగలవు; ఈవు = నీవు.

భావము:- "రాక్షసేశ్వరా! బలీ! ఇతడు బ్రాహ్మణుడు కాదు. అనంతాత్ముడైన హరి, విష్ణువు. దేవతల కార్యాన్ని సాధించడానికి కశ్యపుని కొడుకుగా అదితి గర్భంలో పుట్టినవాడు. అయ్యో! తెలియకుండా ఇతనికి దానం ఇస్తానని ఒప్పుకున్నావు. దీని వలన రాక్షసులకు కష్టం వస్తుంది. ఇతడు నిన్ను మోసగించి నీ సంపదనూ తేజస్సునూ రాజ్యాన్నీ ఇంద్రునికి ఇస్తాడు. విశ్వరూపం ధరించి మూడడుగులతో లోకాలు అన్నిటినీ ఆక్రమిస్తాడు. నీ ఐశ్వర్యమంతా ధారపోసి నీవు నిరుపేదగా ఎలా బ్రతుకుతావు.

8-579-క.

**ఒక్కపదంబున భూమియు**
**నొక్కటఁ ద్రిదివంబు ద్రొక్కి యున్నతమూర్తిన్**
**దిక్కులు గగనముఁ దానై**
**వెక్కసమై యున్న నెందు వెడలెదు? చెపుమా!**

టీక:- ఒక్క = ఒక; పదంబునన్ = అడుగుతో; భూమియున్ = భూలోకమును; ఒక్కటన్ = ఒకదానితో; త్రిదివంబున్ = స్వర్గలోకమును; త్రొక్కి = ఆక్రమించేసి; ఉన్నత = పెద్ద; మూర్తిన్ = స్వరూపముతో; దిక్కులున్ = దిక్కులు; గగనమున్ = ఆకాశము; తాను = తనే; ఐ = అయ్యి; వెక్కసము = నిండిపోయినవాడు; ఐ = అయ్యి; ఉన్నన్ = అయిపోయినచో; ఎందున్ = ఎక్కడకు; వెడలెదు = పోయెదవు; చెపుమా = చెప్పు.

భావము:- ఇతడు ఒకపాదంతో భూలోకాన్నీ, ఇంకొకపాదంతో స్వర్గలోకాన్నీ కప్పివేస్తాడు. బాగా పెద్ద ఆకారం ధరించి, దిక్కులూ, ఆకాశం పిక్కటిల్లేటట్లు పెరిగి, అంతా తానై నిండిపోతాడు. అప్పుడు నీవు ఎక్కడికి పోతావు చెప్పు.

8-580-సీ.

ఇచ్చెద నని పల్కి యీకున్న నరకంబు-
 ద్రోవ నీవును సమర్థుఁడవుఁ గావ;
యే దానమున నాశ మేతెంచు నదియును-
 దానంబుఁ గా దండ్రు తత్త్వవిదులు;
దానంబు యజ్ఞంబుఁ దపముఁ గర్మంబును-
 దా విత్తవంతుఁడై తలఁపవలయుఁ;
దన యింటఁ గల సర్వధనమును నైదు భా-
 గములుగా విభజించి కామమునకు

8-580.1-ఆ.

నర్థమునకు ధర్మయశముల కాశ్రిత
బృందములకు సమతఁ బెట్టునట్టి
పురుషుఁ డిందు నందు బూర్ణుఁడై మోదించుఁ
దన్ను మాని చేఁత దగవుఁ గాదు.

టీక:- ఇచ్చెదన్ = ఇస్తాను; అని = అని; పల్కి = పలికి; ఈకున్న = ఇవ్వకపోతే; నరకంబు = నరకమునకు పోవుటను; త్రోవన్ = తోసిపుచ్చుటకు; నీవును = నీవుకూడ; సమర్థుం డవు = శక్తిమంతుడవు; కావ = కావా, అవును; ఏ = ఎట్టి; దానమునన్ = దానమువలన; నాశమున్ = నాశనము; ఏతెంచు = కలుగునో; అదియునున్ = అది; దానంబున్ = దానము; కాదు = కాదు; అండ్రున్ = అనెదరు; తత్త్వవిదులు = విజ్ఞానులు; దానంబున్ = దానము; యజ్ఞంబున్ = యాగము; తపమున్ = తపస్సు; కర్మంబున్ = కార్యక్రమములను; తాన్ = తను; విత్తవంతుడు = ధనముకలవాడు; ఐ = అయ్యి; తలపవలయున్ = సంకల్పిం చవలెను; తన = తన యొక్క; ఇంటన్ = ఇంటిలో; కల = ఉన్నట్టి; సర్వ = సమస్త మైన; ధనమున్ = సంపదలను; ఐదు =

అయిదు; భాగములు = విభాగములుగా; విభజించి = విడదీసి; కామమున్ = కామమున; కున్ = కు; అర్థమున్ = అర్థమున; కున్ = కు.

ధర్మ = ధర్మమునకు; యశముల్ = కీర్తి; కిన్ = కి; ఆశ్రిత = ఆశ్రయించినవారి; బృందముల్ = సమూహముల; కున్ = కు; సమతన్ = సరిగా; పెట్టున్ = ఉపయోగించు; అట్టి = అటువంటి; పురుషుండు = మానవుడు; ఇందున్ = ఇహమున; అందున్ = పరమున; పూర్ణుడు = సార్థకుడు; ఐ = అయ్యి; మోదించున్ = ఆనందించును; తన్ను = తనకు; మాని = మించిన; చేతన్ = చేయుట; తగవు = తగినది; కాదు = కాదు.

భావము:- ఇస్తానని చెప్పి ఇవ్వకపోతే, వచ్చే నరకాన్ని త్రోసిపుచ్చడానికి నీకు శక్తి ఉంది. “దాతకు నాశనం తెచ్చే దానం దానమే కాదు” అని పెద్దలు చెప్తారు. తాను ధనవంతుడుగా ఉంటూ దానాన్ని యజ్ఞాన్ని తపస్సునూ గురించి ఆలోచించాలి. ఉత్తముడైన పురుషుడు తన ధనమంతా ఐదు భాగాలు చేసి కామానికి, అర్థానికి, ధర్మానికి, కీర్తికి, ఆశ్రయించినవారికీ సమానంగా పంచాలి. ఆ విధంగా చేసేవాడు, ఈ లోకంలోనూ ఆ లోకంలోనూ కృతార్థుడు అయి సుఖపడతాడు. తనకు మించిన ధర్మం న్యాయం కాదు.

8-581-వ.

## అదియునుం గాక యీ యర్థంబునందు బహుభంగి బహ్వృచ గీతార్థంబుఁ గల దొక్కటి; సావధానుండవై యాకర్ణింపుము.

టీక:- అదియునున్ = అంతే; కాక = కాకుండగ; ఈ = ఈ; అర్థంబు =విషయము; అందున్ = లో; బహు = అనేక; భంగిన్ = విధములుగ; బహ్వృచ = ఋగ్వేద; గీతార్థంబు = సూక్తి; కలదు = ఉన్నది; ఒకటి = ఒకటి; సావధానుండవు = శ్రద్ధగలవాడవు; ఐ = అయ్యి; ఆకర్ణింపుము = వినుము.

భావము:- అంతేకాకుండా, ఈ విషయంలో ఎంతో ప్రసిద్ధమైన ఒక ఋగ్వేదసూక్తి ఉన్నది. దాన్ని చెబుతాను శ్రద్ధగా విను.

8-582-సీ.

అంగీకరించిన నఖిలంబుఁ బోవుచో-

నన్నృతంబుఁగాదు లే దనిన నధిప!

యాత్మ వృక్షము మూల మన్నృతంబు నిశ్చయ-

మన్నృత మూలముఁ గల్గ నాత్మ చెడదు;

పుష్పఫలము లాత్మ భూజంబునకు సత్య-

మామ్రాను బ్రతుకమి నదియుఁ జెడును;

ఫలపుష్పములు లేక పస చెడి వృక్షంబు-

మూలంబుతో వృద్ధిఁ బొందుఁ గాదె?

8-582.1-తే.

చేటుఁ గొఱతయు లఘిమయుఁ జెందకుండ

నిచ్చు పురుషుండు చెడకుండు నిద్ధచరిత!

కాక యంచిత సత్య సంగతి నటంచు

నిజధనం బర్థి కిచ్చిన నీకు లేదు.

టీక:- అంగీకరించినన్ = ఒప్పుకొనినచో; అఖిలంబున్ = సమస్తము; పోవుచోన్ = పోవు నప్పుడు; అన్నృతంబు = అబద్ధము; కాదు = కాదు; లేదు = లేదు; అనినన్ = అన్నప్పటి కిని; అధిప = రాజా; ఆత్మ = దేహము యనెడి; వృక్షమున్ = చెట్టునకు; మూలము = మూలము, వేళ్ళు; అన్నృతంబు = అబద్దము; నిశ్చయము = తథ్యముగా; అన్నృత = అబద్దము; మూలమునన్ =వేరు; కల్గన్ = బాగున్నచో; ఆత్మ = దేహము; చెడదు = పాడైపోదు; పుష్ప = పూలు; ఫలముల్ =పండ్లు; ఆత్మన్ =దేహముయనెడి; భూజంబున్ = చెట్టున; కున్ = కు; సత్యము = సత్యము; ఆ = ఆ; మ్రాను = కాండము; బ్రతుకమి = జీవములేకపోయినచో; అదియున్ = అదికూడ; చెడును = నశించును; ఫల = పండ్లు; పుష్పములున్ = పూలు; లేక = లేకుండ; పస = అందము; చెడి = పాడైపోయినను; వృక్షంబు = చెట్టు; మూలంబు = కాండము, మొదలు; తోన్ = ద్వారా; వృద్ధిన్ = అభివృద్ధిని; పొందున్ = పొందును; కాదె = కదా.

చేటు = నాశనము; కొఱత = లోటు; లఘిమ = తక్కువగుట; చెందకుండ = పొందకుండగ; ఇచ్చు = దానముచేసెడి; పురుషుండు = మానవుడు; చెడక = నాశనముకాకుండ; ఉండున్ = ఉండును; ఇద్ధచరిత = ప్రసిద్ధమైన నడవడిక కలవాడ; కాక = అలాకాకండ; అంచిత = అచ్చమైన; సత్య = సత్యము; సంగతిన్ = కోసము; అటంచున్ = అనుచు; నిజ = తన; ధనంబున్ = సంపదలను; అర్థి = అడిగినవాని; కిన్ = కి; ఇచ్చిన = ఇచ్చివేసినచో; నీకు = నీకు; లేదు = ఏమీఉండదు.

భావము:- రాజా! సచ్చరిత్రా! దేనిని ఇవ్వడం వలన సమస్తమూ నష్టము అవుతుందో ఆ దానము ఇవ్వరాదు. ఇస్తానని మాట ఇచ్చినాసరే. దానివల్ల అసత్య దోషం అంటదు. ఆత్మ అనే చెట్టుకు అసత్యమే మూలం కదా. అటువంటి ఆత్మ వృక్షానికి సత్యం పూలు పండ్లుగా ఉంటుంది. అసత్యం అనే మూలం బాగుంటే ఆత్మ అనే వృక్షం చెడదు. మొదలు చెడితే చెట్టు పూలూ పండ్లు చెడతాయి. పండ్లు పూలు లేకపోయినా మొదలు బాగా ఉంటే వృక్షం వృద్ధి చెందుతుంది. కాబట్టి మొదటికి చేటు వాటిల్లకుండా; లోటు రాకుండా; పదుగురలో పలుచన కాకుండా దానం చేసే దాత చెడిపోడు. అందుచేత, సత్యంకోసం నీవు ఇతనికి దానమిస్తే నీకు మిగిలేది ఏమీ ఉండదు.

8-583-ఆ.

## సర్వమయినచోట సర్వధనంబులు
## నడుగ లే దటంచు నన్ృతమాడు
## చెనటి పందనేమి చెప్పఁ బ్రాణము తోడి
## శవము వాఁడు; వాని జన్మ మేల?

టీక:- సర్వము = సమస్తము; అయిన = అదే అయిన; చోట = అప్పుడు; సర్వ = సమస్త మైన; ధనంబులు = సంపదలు; అడుగ = కోర; లేదు = లేదు; అట = అని; అంచున్ = అనుచు; అన్ృతము = అబద్ధము; ఆడు = ఆడెడి; చెనటిపంద =కుత్సితపు పిఱికిపందను; ఏమి = ఏమని; చెప్ప = చెప్పవలెను; ప్రాణము = జీవము; తోడి = తో ఉన్న; శవము = శవము; వాడు = అతడు; వాని = అతడి; జన్మము = పుట్టుక; ఏల = ఎందుకు.

భావము:- ఏ దానం దాత సంపద అంతటికి సమానమో, ఒక ప్రక్క అది అడుగుతూ; నేను అడిగేది స్వల్పమే సమస్త సంపదలూ కాదు అంటూ అబద్ధం చెప్పరాదు కదా. ఆ విధంగా చెప్పేవాడు నీచుడు, పిరికివాడు; వాడు ప్రాణమున్న పీనుగ; వాడి బ్రతుకు వ్యర్థము.

8-584-వ.

మఱియు నిం దొక్క విశేషంబు గలదు; వివరించెద.

టీక:- మఱియున్ = ఇంతేకాక; ఇందున్ = దీనిలో; ఒక్క = మరొక; విశేషంబు = ముఖ్యమైన విషయము; కలదు = ఉన్నది; వివరించెద = వివరముగా తెలిపెదను.

భావము:- దీనిలో ఇంకొక విశేషం ఉంది వివరిస్తాను విను.

*8-585-ఆ.

వారిజాక్షులందు వైవాహికము లందుఁ
బ్రాణవిత్తమానభంగమందుఁ
జకిత గోకులాగ్ర జన్మరక్షణ మందు
బొంకవచ్చు నఘము పొందఁ దధిప!

టీక:- వారిజాక్షుల = ఆడవారి విషయము {వారిజాక్షులు - వారిజ (పద్మముల)వంటి అక్షులు (కన్నులు కలవారు), స్త్రీలు}; అందున్ = లోను; వైవాహికములు = పెండ్లికి సంబంధించిన వాని; అందున్ = లోను; ప్రాణ = ప్రాణములు; విత్త = ధనములు; మాన = గౌరవము; భంగము = పోయెడి సందర్భముల; అందున్ = లోను; చకిత = భీతిల్లిన; గో = గోవుల; కుల = సమూహములను; అగ్రజన్మ = బ్రాహ్మణులను; రక్షణము = కాపాడుట; అందున్ = లోను; బొంకవచ్చు = అబద్ధమాడవచ్చును; అఘము = పాపము; పొందదు = అంటదు; అధిప = రాజా.

భావము:- ఓ బలిచక్రవర్తి! ఆడువారి విషయంలో కాని; పెళ్ళిళ్ల సందర్భంలో కాని; ప్రాణానికి, ధనానికి, గౌరవానికి భంగం కలిగేటప్పుడు కాని; భీతిల్లిన గోవులను, విప్రులను కాపాడే టప్పుడు కాని అవసరమైతే అబద్ధం చెప్పవచ్చు. దాని వల్ల ఏ పాపం రాదు.

8-586-మ.

కులమున్ రాజ్యముఁదేజమున్ నిలుపుమీకుబ్జుండువిశ్వంభరుం
డలతిం బోఁడు; త్రివిక్రమస్ఫురణ వాఁడై నిండు బ్రహ్మాండముం;
గలఁడే మాన్ప నొకండు? నా పలుకు లాకర్ణింపు కర్ణంబులన్;
వలదీ దానము గీనముం బనుపుమా వర్ణిన్ వదాన్యోత్తమా!"

టీక:- కులమున్ = వంశమును; రాజ్యమున్ = రాజ్యమును; తేజమున్ = తేజస్సును; నిలుపుము = నిలబెట్టుము; ఈ = ఈ; కుబ్జుండు = వామనుడు; విశ్వంభరుండు = విష్ణుమూర్తి {విశ్వంభరుడు - జగత్తును భరించువాడు, హరి}; అలతిన్ = అంతతేలికగా; పోడు = వదలిపెట్టడు; త్రివిక్రమ = ముల్లోకములను ఆక్రమించెడి; స్ఫురణన్ = స్ఫూర్తికల; వాడు = వాడు; ఐ = అయ్యి; నిండున్ = నిండిపోవును; బ్రహ్మాండమున్ = బ్రహ్మాండమును; కలడే = సమర్థుడు ఉన్నాడా; మాన్పన్ = ఆపుటకు; ఒకండు = ఒకడైన; నా = నా యొక్క; పలుకులున్ = మాటలను; ఆకర్ణింపుము = వినుము; కర్ణంబులన్ = చెవులారా; వలదు = వద్దు; ఈ = ఈ; దానమున్ = దానము; గీనమున్ =గీనము; పనుపుమా= పంపివేయుము; వర్ణిన్ = బ్రహ్మచారిని; వదాన్య = దాతలలో; ఉత్తమా = శ్రేష్ఠుడా.

భావము:- దాతలలోకెల్లా అగ్రేశ్వరుడా! బలీ! ఈ పొట్టివాడు సాక్షాత్తు విశ్వభర్త, విష్ణువు. అంత తేలికగా ఇతను ఇక్కడ నుండి వెళ్ళడు. మూడు లోకాలనూ, మూడు అడుగులుగా కొలిచే త్రివిక్రమ రూపం ధరించి, బ్రహ్మాండం అంతా నిండిపోతాడు. అప్పుడు అతనిని ఎవ్వరూ ఆపలేరు తెలుసా. దానం వద్దు, గీనం వద్దు. ఈ బ్రహ్మచారిని పంపిచెయ్యి. నీ కులాన్నీ, రాజ్యాన్నీ, పరాక్రమాన్నీ నిలబెట్టుకో".

8-587-వ.

## అని యిట్లు హితంబు పలుకుచున్న కులాచార్యునకు క్షణమాత్ర నిమీలితలోచనుండయి యశస్వి యిట్లనియె.

టీక:- అని = అని; ఇట్లు = ఇలా; హితంబు = మేలుకోరి; పలుకుచున్న = చెప్పుతున్న; కుల = వంశ; ఆచార్యున్ = గురువున; కున్ = కు; క్షణమాత్ర = కొంచెముసేపు; నిమీలిత = అరమూసిన; లోచనుండు = కన్నులు కలవాడు; అయి = అయ్యి; యశస్వి = కీర్తిగలవాడు; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- ఇలా తమ మేలు కోరి, గురువు శుక్రుడు చెప్పగా, గొప్ప యశస్సు గల బలి ఒక క్షణం పాటు కన్నులు మూసుకుని ఇలా అన్నాడు.

8-588-సీ.

"నిజ మానతిచ్చితి వీవు మహాత్మక!-
    మహిని గృహస్థధర్మంబు నిదియ
యర్థంబుఁ గామంబు యశమును వృత్తియు-
    నెయ్యది ప్రార్థింప నిత్తు ననియు
నర్థ లోభంబున నర్థిఁ బొమ్మను టెట్లు?-
    పలికి లే దనుకంటెఁ బాప మెద్ది?
యెట్టి దుష్కర్ముని నే భరించెదఁ గాని-
    సత్యహీనుని మోవఁ జాల ననుచుఁ

8-588.1-తే.

పలుకదే తొల్లి భూదేవి బ్రహ్మతోడ
సమరముననుండి తిరుగక చచ్చుకంటె
బలికి బొంకక నిజమునఁ బరఁగుకంటె
మానధనులకు భద్రంబు మఱియుఁ గలదె.

టీక:- నిజమున్ = సత్యమును; ఆనతిచ్చితివి = చెప్పితివి; ఈవు = నీవు; మహాత్మక = గొప్ప ఆత్మ కలవాడ; మహిని = భూమిపైన; గృహస్థ = గృహస్థులయొక్క; ధర్మంబున్ = ధర్మము; ఇదియ = ఇదె; అర్థంబున్ = అర్థము; కామంబు = కామము; యశము = కీర్తి; వృత్తియున్ = జీవనోపాయము; ఎయ్యదిన్ = దేనికోసము; ప్రార్థింపన్ = కోరినా; ఇత్తును = ఇచ్చెదను; అనియు = అని; అర్థ = సంపదలపై; లోభంబునన్ =లోభముతో; అర్థిన్= అడిగిన వానిని; పొమ్ము = వెళ్ళిపొమ్ము; అనుట = అనుట; ఎట్లు = ఎలాకుదురుతుంది; పలికి = మాట యిచ్చి; లేదు = లేదు; అనుట = అనుట; కంటెన్ = కంటె; పాపము = పాపము; ఎద్ది = ఏముంది; ఎట్టి = ఎలాంటి; దుష్కర్ముని = చెడ్డపనిచేసినవానినైన; నేన్ = నేను; భరించెదన్ = మోయగలను; కాని = కాని; సత్యహీనును = ఆడితప్పువానిని; మోవజాలన్ = మోయలేను; అనుచున్ = అని.

పలుకదే = అన్నదికదా; తొల్లి = పూర్వము; భూదేవి = భూదేవి; బ్రహ్మ = బ్రహ్మదేవుని; తోడన్ = తోటి; సమరమున = యుద్ధము; నుండి = నుండి; తిరుగక = వెనుతిరగక;

చచ్చు = మరణించుట; కంటెన్ = కంటె; పలికి = మాట యిచ్చి; బొంకక = పలుకలేదనకుండ; నిజమునన్ = సత్యమునందు; పరగు = వర్తిల్లెడి; కంటెన్ = కంటె; మాన = అభిమానము యనెడి; ధనుల = సంపదలుగలవార; కున్ = కి; భద్రంబు = శుభమైనది; మఱియున్ = మరింకొకటి; కలదె = ఉన్నదా, లేదు.

భావము:- "ఓ మహాత్మా! శుక్రాచార్యా! నీవు చెప్పింది నిజమే. లోకంలో ఇదే గృహధర్మం కూడా. అర్థమూ, కామమూ, కీర్తి, జీవనోపాయము వీటిలో ఏది అడిగినా ఇస్తానని చెప్పాను. ధనంపై దురాశతో అడిగినవానికి లేదని చెప్పి త్రిప్పి పంపించలేను. ఇచ్చిన మాట తప్పడం కంటే పాపం లేదు. పూర్వం భూదేవి "ఎంతటి చెడ్డ పనిచేసిన వాడిని అయినా మోస్తాను కానీ ఆడినమాట తప్పిన వాడిని మాత్రం మోయలేను." అని చెప్పింది కదా. యుద్ధంలో వెనుతిరగకుండా వీరమరణం పొందడం, మాటకు కట్టుబడి సత్యంతో బ్రతకడం మానధనులు అయిన వారికి మేలైన మార్గాలు కదా.

8-589-క.

**ధాత్రిని హలికునకును సు**

**క్షేత్రము బీజములు నొకటఁ జేకుఱు భంగిం**

**జిత్రముగ దాత కీవియుఁ**

**బాత్రము సమకూరునట్టి భాగ్యము గలదే?**

టీక:- ధాత్రిన్ = భూమిపైన; హలికున్ = రైతున; కునున్ = కు; క్షేత్రము = మంచిపొలము; బీజములు = మంచివిత్తనములు; ఒకటన్ = ఒకేచోట; చేకూరు = సమకూరెడి; భంగిన్ = వలె; చిత్రముగ = అపురూపముగ; దాత = దానముచేయువాని; కి = కి; ఈవియున్ = దానమునకు తగినది; పాత్రము = తగినగ్రహీత; సమకూరున్ = కలిసివచ్చు; అట్టి = అటువంటి; భాగ్యము = అదృష్టము; కలదే = ఉందా, లేదు.

భావము:- దున్నే రైతుకు మంచి పొలమూ, మంచి విత్తనాలూ ఒక చోట దొరకడం అరుదు. అదే విధంగా దాతకు తగిన ధనమూ, దానిని తీసుకునే ఉత్తముడూ దొరికే అదృష్టం అపురూపం కదా.

*8-590-శా.

కారేరాజులు? రాజ్యముల్ గలుగవే? గర్వోన్నతిం బొందరే?
వారేరీ సిరిమూటఁగట్టుకొని పోవం జాలిరే? భూమిపైఁ
బేరైనం గలదే? శిబిప్రముఖులుం బ్రీతిన్ యశః కాములై
యీరేకోర్కులు? వారలన్ మఱచిరే యిక్కాలమున్? భార్గవా!

టీక:- కారే = కలుగరా; రాజులు = రాజులు; రాజ్యముల్ = రాజ్యములు; కలుగవే = పొందలేదా ఏమి; గర్వ = అహంకారముతో; ఉన్నతిన్ = ఔన్నత్యమును; పొందరే = చెందలేదా ఏమి; వారు = వాళ్ళందరు; ఏరి = ఎక్కడ ఉన్నారు; సిరిని = సంపదలను; మూటగట్టుకొని = కూడగొట్టుకొని; పోవంజాలిరే = తీసుకుని పోగలిగేరా, లేదు; భూమి = నేలపైన; పేరైనన్ = కనీసము పేరైన; కలదే = ఉన్నదా, లేదు; శిబి = శిబిచక్రవర్తి; ప్రముఖులున్ = మొదలగువారు; ప్రీతిన్ = కోరి; యశః = కీర్తి; కాములు = కోరువారు; ఐ = అయ్యి; ఈరే = ఇవ్వలేదా; కోర్కులు = దానములను; వారలన్ = వారిని; మఱచిరే = మరచిపోయారా, లేదు; ఈ = ఇప్పటి; కాలమున్ = కాలమునందును; భార్గవా = శుక్రాచార్యుడా {భార్గవుడు - భృగువు వంశమువాడు, శుక్రుడు}.

భావము:- శుక్రాచార్యా! పూర్వ కాలంలో కూడ ఎందరో రాజులు ఉన్నారు కదా. వారికి రాజ్యాలు ఉన్నాయి కదా. వాళ్ళు ఎంతో అహంకారంతో ఎంతో ఔన్నత్యాన్ని సాధించునవారే కదా. కాని వా రెవరు సంపదలు మూటగట్టుకొని పోలేదు కదా. కనీసం ప్రపంచంలో వారి పేరైనా మిగిలి లేదు కదా. శిబి చక్రవర్తివంటి వారు కీర్తికోసం సంతోషంగా అడిగినవారి కోరికలు తీర్చారు కదా. వారిని ఈ నాటికీ లోకం మరువలేదు కదా.

బలిచక్రవర్తి రాక్షసరాజైనా సత్యసంధుడు, తనువు నశ్వరతను, సిరుల యస్థిరతను ఎరిగిన జ్ఞాని; కనుకనే ఆచార్యుడు శుక్రుడు చెప్పిన రాజనీతిని కాదని తన నిర్ణయం చెప్తున్నాడు.

8-591-క.

ఉడుగని క్రతువులఁ వ్రతములఁ
బొడగనఁ జన నట్టి పొడవు పొడవునఁ గుఱుచై
యడిగెడినఁట; ననుబోఁటికి
నిడరాదె మహానుభావ! యిష్టార్థంబుల్.

టీక:- ఉడుగని = ఎడతెగని; క్రతువులన్ = యాగములతో; వ్రతములన్ = వ్రతములతో; పొడగనన్ = దర్శించుటకు; చననట్టి = వీలుకానట్టి; పొడవు = గొప్పవాడు; పొడవున = ఔన్నత్యముతో, కొలతలో; కుఱుచ = తక్కువ, పొట్టి; ఐ = అయ్యి; అడిగెడిన్ = అడుగు తున్నాడు; అట = అట; నను = నా; పోటి = వంటివాని; కిన్ = కి; ఇడన్ = దానమిచ్చుట; రాదె = చేయకూడదా ఏమి; మహానుభావ = గొప్పవాడా; ఇష్ట = కోరిన; అర్థంబుల్ = సంపదలను.

భావము:- ఓ మహాత్మా! శుక్రాచార్యా! ఎడతెగని యజ్ఞ యాగాలు, వ్రతాలూ చేసినా, పుణ్య కార్యాలు చేసినా విష్ణువును దర్శించడానికి వీలు పడదు. అటువంటి గొప్ప వాడు కురచ అయి అడుగుతున్నాడు. అతడు కోరినదానిని ఇవ్వడం కంటే నావంటి వాడికి ఇంకేం కావాలి.

*8-592-శా.

**ఆదిన్** శ్రీసతి కొప్పుపైఁ, దనువుపై, నంసోత్తరీయంబుపైఁ,
**బాదాబ్జం**బులపైఁ, గపోలతటిపైఁ, బాలిండ్లపై నూత్న మ
**ర్యాదం** జెందు కరంబు గ్రిం దగుట మీఁదై నా కరంబుంట మేల్
గా**దే?** రాజ్యము గీజ్యమున్ సతతమే? కాయంబు నాపాయమే?

టీక:- ఆదిన్ = ముందుగా; శ్రీసతి = లక్ష్మీదేవి; కొప్పు = జుట్టుముడి; పైన్ = మీద; తనువు = శరీరము; పైన్ = మీద; అంసోత్తరీయంబు = పైట; పైన్ = మీద; పాద = పాద ములు యనెడి; అబ్జంబుల = పద్మముల; పైన్ = మీద; కపోలతటి = చెక్కిళ్ళ; పైన్ = మీద; పాలిండ్ల = స్తనముల; పైన్ = మీద; నూత్న = సరికొత్త; మర్యాదన్ = గౌరవ మును; చెందు = పొందెడి; కరంబు = చేయి; క్రింద = కింద ఉన్నది; అగుట = అగుట; మీద=పైన ఉన్నది; ఐ; నా = నా యొక్క; కరంబున్ = చేయి; ఉంటన్ = ఉండుట; మేల్ = గొప్ప; కాదే = కాదా ఏమిటి; రాజ్యమున్ = రాజ్యము; గీజ్యమున్ = గీజ్యము; సతతమే = శాశ్వతమా కాదు; కాయంబు = దేహము; నాపాయమే = చెడిపోనిదా కాదు.

భావము:- ఇతడు దానం కావాలని చాచినచేయి ఎంతో గొప్పది కదా! మొదట లక్ష్మీదేవి యొక్క కొప్పు ముడి మీద, శరీరం మీద, పైట చెంగు మీద, పాదపద్మాల మీద, చెక్కిళ్ళ మీద, పాలిండ్ల మీద సరికొత్త మర్యాదలు పొందే దివ్యమైన హస్తం. అంతటి చెయ్యి కిందది కావటం నాచెయ్యి పైది కావటం ఎంత అదృష్టం! ఎంత మేలు! దీని ముందు ఈ రాజ్యం ఏ పాటిది! ఇదేమైనా శాశ్వతంగా ఉండేదా! ఈ శరీరం ఏమైనా పడిపోకుండా ఉండిపోతుందా.

*8-593-మ.

ని<u>ర</u>యంబైన, నిబంధమైన, ధరణీ నిర్మూలనంబైన, దు
ర్మరణంబైనఁ గులాంతమైన నిజమున్ రానిమ్ము; కానిమ్ము పో;
హరుఁడైనన్, హరియైన, నీరజభవుం డభ్యాగతుండైన నౌఁ;
దిరుగన్ నేరదు నాదు జిహ్వ; వినుమా; ధీవర్య! వే యేటికిన్?

టీక:- నిరయంబు = నరకము దాపురించినది; ఐనన్=అయినసరే; నిబంధము= కట్టివేయ బడుట; ఐనన్ = జరిగినసరే; ధరణీ = భూమండలము; నిర్మూలనంబు = నాశనము; ఐనన్ = అయినాసరే; దుర్మరణంబు = దుర్మరణము; ఐనన్ = సంభవించినా సరే; కుల = వంశము; అంతము = నాశనము; ఐనన్ = జరిగినసరే; నిజమున్ = సత్యమునే; రానిమ్ము = ఒప్పుకొనెదను; కానిమ్ము = జరిగెడిది జరుగనిమ్ము; పో = భయం లేదు; హరుడు = శివుడు; ఐనన్ = అయినా; హరి = విష్ణువు; ఐనన్ = అయినా; నీరజ భవుండు = బ్రహ్మదేవుడయినా; అభ్యాగతుండు = అతిథిగావచ్చినవాడు; ఐనన్ = అయిన; ఔ = సరే; తిరుగన్ = వెనుతిరుగుట; నేరదు = చేయలేదు; నాదు = నా యొక్క; జిహ్వ = నాలుక; వినుమా = వినుము; ధీవర్య = విజ్ఞాని; వేయేటికిన్ = పలుమాటలుదేనికి.

భావము:- మిగతావి అన్నీ అనవసరమయ్య! నే బంధింప బడటం కాని, నాకు దుర్మరణం కలగటం కాని, నాకు నరకం దాపురించటం కాని, నా కులమే నాశనం కావటం కాని, భూమండలం బద్ధలవటం కాని, నిజంగానే వస్తే రానియ్యి; జరుగుతే జరుగనీ; ఏమైనా సరే నేను మాత్రం అబద్ధమాడ లేను. దానం పట్టడానికి వచ్చిన వాడు సాక్షాత్తు ఆ పరమ శివుడే అయినా, ఆ విష్ణుమూర్తే అయినా, ఆ బ్రహ్మదేవుడే అయినా సరే నా నాలుకకి ఆడిన మాట తప్పటం రాదు. పరమ విజ్ఞాన స్వరూప శుక్రాచార్య! నా నిర్ణయం వినవయ్య!

8-594-ఆ.

నొడివినంత పట్టు నుసలక యిచ్చుచో
నేల కట్టు విష్ణుఁ డేటి మాట?
గట్టెనేనిఁ దాన కరుణించి విడుచును
విడువకుండ నిమ్ము విమలచరిత!

టీక:- నొడివినంతపట్టున్ = అన్నమాట ప్రకారము; నుసలక = ఆలస్యములేక; ఇచ్చుచోన్ = ఇచ్చిన ఎడల; ఏల = ఎందుకు; కట్టు = బంధించును; విష్ణుడు = విష్ణుమూర్తి; ఏటిమాట = అదేమి మాట; కట్టెనేని = బంధించినను; తాన = అతను; కరుణించి = దయచేసి; విడుచును = వదలిపెట్టును; విడువక = వదలిపెట్టక; ఉండనిమ్ము = పోతే పోనియ్యి; విమల = నిర్మలమైన; చరిత = వర్తన కలవాడ.

భావము:- నిర్మల ప్రవర్తన గల శుక్రాచార్యా! అదేం మాట, అన్నమాట ప్రకారం ఆలస్యం చేయకుండా దానం ఇస్తే విష్ణువు ఎందుకు బంధిస్తాడు. ఒకవేళ బంధించాడే అనుకో అతడే దయతో విడిచి పెడతాడు. విడిచి పెట్టకపోతే పోనీ ఇబ్బందేం ఉంది?

## బలి దాన నిర్ణయము

*8-595-క.

**మేరువు దల క్రిం దైనను**
**బారావారంబు లింకఁ బాఱిన లోలో**
**ధారుణి రజమై పోయినఁ**
**దారాధ్వము బద్ధమైనఁ దప్పక యిత్తున్.**

టీక:- మేరువు = మేరుపర్వతము; తలక్రింద = తలకిందులు; ఐనన్ = అయిపోయినసరే; పారావారంబులు = సముద్రములు; ఇంకబాఱినన్ = ఇంకిపోయినసరే; లోలోన్ = లోపలలోపలే; ధారుణి = భూమండలము; రజము = పొడి; ఐపోయినన్ = అయిపోయిన సరే; తారాధ్వము బద్ధమైనన్ = ఆకాశము కుంచించుకుపోయినాసరే {తారాధ్వము బద్ధ మైనన్ - తారలకు అధ్వము (త్రోవ), ఆకాశము; బద్ధము హద్దు పరిమితికలది, ఐనన్ - ఐనా సరే; అపరిమితమైన ఆకాశం పరిమితమైనది అగుట అంటే కుంచించుకుపోవుట జరిగినప్పటికి గమనిక -బద్ధలైనన్ అన లేదు బద్ధమైనన్ అన్నారు కనుక ముక్కలవ్వడం కాడు కుంచించుకుపోవడమే సరి}; తప్పక = తప్పకుండ; ఇత్తున్ = ఇచ్చెదను.

భావము:- మేరుపర్వతం తిరగబడితే బడవచ్చు, సప్తసముద్రాలు ఇంకిపోతే పోవచ్చు, ఈ భూమండలం అంతా తనలో తనే పొడిపొడి అయితే కావచ్చు, పరిమితులులేని ఆకాశం హద్దులేర్పడి కుంచించుకుపోవుట జరిగితే జరగవచ్చు, కాని నేను మాత్రం ఇస్తానన్న దానం తప్పకుండా ఇస్తాను.

*8-596-మత్త.

ఎన్నఁడుం బరువేఁడఁ బోఁడట; యేకలుం డఁట; కన్న వా
రన్నదమ్ములు నైన లేరఁట; యన్నివిద్యల మూల గో
ష్ఠిన్నెఱింగిన ప్రోడ గుజ్జఁట; చేతు లొగ్గి వసింప నీ
చిన్నిపాపనిఁ ద్రోసిపుచ్చఁగఁ జిత్త మొల్లదు సత్తమా!"

టీక:- ఎన్నడున్ = ఎప్పుడు; పరున్ = ఇతరులను; వేడన్ = అడుగుటకు; పోడు = వెళ్ళడు; అటన్ = అట; ఏకలుండు = ఒంటరి, అసహాయుడు; అట = అట; కన్నవారు = తల్లిదండ్రులు; అన్నదమ్ములు = సోదరులు; ఐనన్ = అయినను; లేరు = లేరు; అటన్ = అట; అన్ని = సర్వ; విద్యలన్ = విద్యలయొక్క; మూలగోష్ఠి = ముఖ్యసారాంశమును; ఎఱింగిన = తెలిసిన; ప్రోడగుజ్జు = బహునేర్పరి; అటన్ = అట; చేతులు = చేతులు; ఒగ్గి = చాచి; వసింపన్ = ఉండగా; ఈ = ఈ; చిన్నిపాపనిన్ = పసివానిని; త్రోసిపుచ్చగన్ = గెంటివే యుటకు; చిత్తము = మనసు; ఒల్లదు = ఒప్పుటలేదు; సత్తమా = సమర్థుడా.

భావము:- మహానుభావా! ఈ పొట్టి పిల్లాడు ఎప్పుడు ఇతరులను అడగటం అన్నది లేదుట. ఒంటరి యట. కన్నవాళ్ళు, తోడబుట్టిన వాళ్ళు లేరుట. అన్ని విద్యల మూల సారం తెలిసిన నేర్పరి యట. నా ముందు చేతులు చాపి ఇలా నిల్చున్న ఇలాంటి పసివాడిని గెంటేయటానికి నాకు మన సొప్పటం లేదు."

8-597-వ.

అని యిట్లు సత్యపదవీప్రమాణ తత్పరుండును, వితరణ కుతూహల సత్త్వరుండును, విమల యశస్కుండును, దృఢ మనస్కుండును, నియతసత్యసంధుండును, నర్థిజన కమలబంధుండును నైన బలిం జూచి శుక్రుండు గోపించి "మదీయ శాసనం బతిక్రమించితివి గావున శీఘ్రకాలంబునఁ బదభ్రష్టుండవుఁ గ"మ్మని శాపం బిచ్చె బలియును గురుశాపతప్తుండయ్యు ననృతమార్గంబున కభిముఖుండుఁ గాకుండె; నప్పుడు.

టీక:- అని = అని; ఇట్లు = ఈ విధముగ; సత్యపదవీ = సత్యమార్గమునుండి; ప్రమాణ = చలించని; తత్పరుండు = నిష్ఠ కలవాడు; వితరణ = దానముచేయవలెనని; కుతూ

హల = కౌతుకము; సత్వరుండును = తహతహలాడువాడు; విమల = నిర్మలమైన; యశస్కుం డును = కీర్తి కలవాడు; దృఢ =గట్టి; మనస్కుండును =మనసుకలవాడు; నియత= నియమ బద్ధమైన; సత్యసంధుడు = సత్యసంధుడు; అర్థిజన = కోర్కెలను అడిగెడివారికి; కమల బంధుండును = సూర్యుని వంటివాడు; ఐనన్ = అయినట్టి; బలిన్ = బలిని; చూచి = చూసి; శుక్రుండు = శుక్రుడు; కోపించి = కోపగించుకొని; మదీయ = నా యొక్క; శాసనంబున్ = ఆజ్ఞను; అతిక్రమించితివి = మీరితివి; కావునన్ = కనుక; శీఘ్ర = కొద్ది; కాలంబునన్ = కాలములోనే; పద = పదవినుండి; భ్రష్టుండవు = జారి పోయినవాడవు; కమ్ము = అయిపో; అని = అని; శాపంబున్ = శాపమును; ఇచ్చెన్ = ఇచ్చెను; బలియునున్ = బలి; గురు = గురువు యొక్క; శాప = శాపమునకు; తప్తుండు = క్షోభితుడు; అయ్యున్ = అయినప్పటికి; అనృత = అసత్యము; మార్గంబున్ = వైపునకు; అభిముఖుండు = వెళ్ళువాడు; కాకుండెన్ = కాలేదు; అప్పుడు = ఆ సమయమునందు.

భావము:- ఇలా పలికిన ఆయొక్క సత్యమార్గం నుండి చలించని వాడునూ, వామనునికి దానమివ్వాలనే కుతూహలంతో ఉన్నవాడునూ, నిర్మలమైన కీర్తి గలవాడునూ, దృఢసంకల్పం గలవాడునూ, పలికిన మాట తప్పనివాడునూ, అర్థులకు ఆత్మబంధువూ అయిన బలిచక్రవర్తి మీద శుక్రాచార్యులు కోపగించుకుని ఇలా శాపమిచ్చాడు, " నా ఆజ్ఞ మీరావు. కాబట్టి త్వరలో పదభ్రష్టుడవు అయిపోతావు." గురువుగారి శాపానికి గురైనప్పటికీ బలి బాధపడలేదు. అసత్యమార్గం అవలంబించలేదు. అంత.

8-598-ఆ.

## బ్రతుక వచ్చుఁగాక బహుబంధనములైన
## వచ్చుఁగాక లేమి వచ్చుఁగాక
## జీవధనములైనఁ జెడుఁగాక పడుఁగాక
## మాటఁ దిరుఁగ లేరు మానధనులు.

టీక:- బ్రతుకన్ = బాగాబతుక; వచ్చుగాక = కలిగినసరే; బహు = పలువిధముల; బంధనములు = కష్టములు; ఐనన్ = కలిగిన; వచ్చుగాక = కలిగినసరే; లేమి = పేదరికము; వచ్చుగాక = కలిగినసరే; జీవ = ప్రాణ; ధనములు = సంపదలు; ఐనన్ = అయినను; చెడుగాక = హానికలగనిమ్ము; పడుగాక =చావు వచ్చినా; మాట = ఇచ్చినమాట; తిరుగలేరు = తప్పలేరు; మానధనులు = అభిమానవంతులు.

భావము:- బాగా బ్రతికినా; పెక్కుకష్టాలకు గురి అయినా; పేదరికం వచ్చినా; ప్రాణానికి ధనానికి చేటు వచ్చినా; కడకు చావు సంభవించినా సరే మానధనులు మాట తప్పలేరు.

## వామనునికి దాన మిచ్చుట

8-599-వ.

అ య్యవసరంబున.

టీక:- ఆ = ఆ; అవసరంబునన్ = సమయమునందు. భావము:- ఆ సమయంలో.

8-600-ఆ.

దనుజలోకనాథు దయిత వింధ్యావళి
రాజవదన మదమరాళ గమన
వటుని కాళ్ళుఁ గడుగ వరహేమ ఘటమున
జలముఁ దెచ్చె భర్త సన్న యెఱిఁగి.

టీక:- దనుజలోక = రాక్షసులందరికి; నాథు = రాజుయొక్క; దయిత = భార్య; వింధ్యావళి = వింధ్యావళి; రాజవదన = చంద్రముఖి; మదమరాళ = రాయంచలవంటి; గమన = నడకలు కలామె; వటుని = బ్రహ్మచారి; కాళ్ళు = పాదములు; కడుగ = కడుగుటకు; వర = శ్రేష్ఠమైన; హేమ = బంగారు; ఘటమునన్ = కలశముతో; జలమున్ = నీటిని; తెచ్చెన్ = తీసుకువచ్చెను; భర్త = పతి; సన్న = సైగను; ఎఱిగి = అర్థముచేసికొని.

భావము:- బలిచవర్తి ఇల్లాలు వింధ్యావళి. ఆమె ముఖము చందమామ వంటిది. ఆమె నడకలు రాజహంస నడకలు. ఆ సందర్భంలో ఆమె భర్త సైగ గమనించింది. బ్రహ్మచారి కాళ్ళు కడగడానికి బంగారు కలశంతో నీళ్ళు తెచ్చింది.

8-601-వ.

అయ్యవసరంబునఁ గపటవటునకు న ద్దానవేంద్రుం డిట్లనియె.

టీక:- ఆ = ఆ; అవసరంబునన్ = సమయమునందు; కపట = మాయా; వటున్ = బ్రహ్మచారి; కున్ = కి; ఆ = ఆ; దానవేంద్రుడు = రాక్షసరాజు; ఇట్లు = ఇలా; అనియె = పలికెను.

భావము:- అప్పుడు మాయా బ్రహ్మచారి వామనుడితో, ఆ రాక్షసేంద్రుడు బలిచక్రవర్తి ఇలా అన్నాడు.

8-602-క.



"రమ్మా మాణవకోత్తమ!
లెమ్మా నీ వాంఛితంబు లే దన కిత్తుం
దెమ్మా యడుగుల నిటు రా
నిమ్మా కడుగంగవలయు నేటికిఁ దడయన్?"

టీక:- రమ్మా = రమ్ము; మాణవక = బాలక; ఉత్తమ = శ్రేష్ఠుడ; లెమ్మా = లెమ్ము; నీ = నీ యొక్క; వాంఛితంబున్ = కోరికను; లేదు = లేదు; అనక = అనకుండగా; ఇత్తున్ = ఇచ్చెదను; తెమ్మా = తెమ్ము; అడుగులన్ = పాదములను; ఇటు = ఇటుపక్కకి; రానిమ్మా = రానిమ్ము; కడుగంగ = కడుగుట; వలయున్ = చేయవలెను; ఏటికి = దేనికి; తడయన్ = ఆలస్యముచేయుట.

భావము:- "ఓ బాలకా! లేవయ్యా! ఇలా రావయ్యా! నీవు అడిగింది ఇస్తాను. నీ పాదాలు కడగనియ్యి. ఇంకా ఆలస్యం చేయటం దేనికి."

8-603-వ.

అనిన విని.

టీక:- అనిన = అనగా; విని = విని. భావము:- బలిచక్రవర్తి పిలుపును విని. . .

8-604-మ.

బలిదైత్యేంద్ర కరద్వయీ కృత జలప్రక్షాళనవ్యాప్తికిన్
జలజాతాక్షుఁడు చాఁచె యోగి సుమనస్సంప్రార్థితశ్రీదముం
గలితానమ్ర రమా లలాటపదవీ కస్తూరికా శాదమున్
నలినామోదము రత్ననూపురిత నానావేదముం బాదమున్.

టీక:- బలిదైత్యేంద్ర = బలిచక్రవర్తి; కర = చేతులు; ద్వయీ = రెంటి (2) తోను; కృత = చేయు; జల = నీటితో; ప్రక్షాళన = కడుగుట; వ్యాప్తికిన్ = జరుగుటకు; జలజాతాక్షుడు = విష్ణువు {జలజాతాక్షుడు - జలజాత (పద్మములవంటి) అక్షుడు (కన్నులు కలవాడు), విష్ణువు}; చాచెన్ = చాచెను; యోగి = యోగులచేత; సుమనస్ = దేవతల

చేత; సంప్రార్థిత = చక్కగా సేవింపబడెడి; శ్రీ = శుభములను; దమున్ = కలిగించెడిది; కలిత = కలిగిన; ఆనమ్ర = వంగినట్టి; రమా = లక్ష్మీదేవి; లలాట = నుదుట; పదవీ = ఉన్న; కస్తూరికా = కస్తూరితిలకము; శాదము = పంకముకలది; నలిన = పద్మముల; ఆమోదమున్ = పరిమళము కలది; రత్న = మణులుపొదిగిన; నూపురిత = అందెలు కలగిన; నానా = సమస్త; వేదమున్ = వేదములునునైనది; పాదమున్ = పాదమును.

భావము:- బలిచక్రవర్తి తన రెండు చేతులతోనూ కడగడానికి అనువుగా వామనుడు తన పాదాన్ని సాచాడు. ఆ పాదం యోగులూ, దేవతలూ సేవించునది, వారు కోరుకొనే సంపదలను సమకూర్చునది; భక్తితో వంగిన లక్ష్మిదేవి నొసటి మీది కస్తూరి కుంకుమతో కూడినది; పద్మాల పరిమళం గుబాళించునది; ఆ పాదం వేదాలరాశి అనే మణిమంజీరాలు అలంకరించుకున్నది.

8-605-క.

సురలోక సముద్ధరణము
నిరతశ్రీకరణ మఖిల నిగమాంతాలం
కరణము భవసంహరణము
హరిచరణము నీటఁ గడిగె నసురోత్తముడున్.

టీక:- సురలోక = దేవతలు అందరిని; సముద్ధరణమున్ = చక్కగా కాపాడెడిది; నిరత = కలకాలము; శ్రీకరణ = మేలుకలిగించెడిది; అఖిల = సర్వ; నిగమాంత = వేదాంతములకు; అలంకరణమున్ = అలంకారమైనది; భవ = పునర్జన్మప్రాప్తి; హరణమున్ = పోగొట్టునది; హరి = విష్ణునియొక్క; చరణమున్ = పాదమును; నీటన్ = నీటితో; కడిగెన్= శుభ్రపరచెను; అసుర = రాక్షసులలో; ఉత్తముడున్ = శ్రేష్ఠుడు.

భావము:- దేవతలను కష్టాలనుండి కాపాడేది, కలకాలమూ మేలుకలిగించేది, సమస్త ఉపనిషత్తులకూ అలంకారం అయినది, భవబంధాలను పోకార్చి మోక్షాన్ని సమకూర్చెడిది, అయిన వామనావతారుడు విష్ణువు యొక్క కుడిపాదమును బలిచక్రవర్తి నీటితో కడిగాడు.

8-606-వ.

ఇట్లు ధరణీసుర దక్షిణచరణ ప్రక్షాళనంబు చేసి వామపాదంబు గడిగి తత్పావనజలంబు శిరంబునం జల్లుకొని వార్చి దేశ కాలాది పరిగణనంబు చేసి.

టీక:- ఇట్లు = ఈ విధముగ; ధరణీసుర = బ్రాహ్మణుని {ధరణీసురుడు - భూమిపైదేవత, విప్రుడు}; దక్షిణ = కుడి; చరణ = పాదమును; ప్రక్షాళనము = కడుగుట; చేసి = చేసి; వామ = ఎడమ; పాదంబున్ = పాదమును; కడిగి = కడిగి; తత్ = ఆ; పావన = పవిత్రమైన; జలంబున్ = నీటిని; శిరంబునన్ = తలపైన; చల్లుకొని = ప్రోక్షించుకొని; వార్చి = ఆచమనముచేసి; దేశ = ప్రదేశము; కాల = కాలము; ఆది = మున్నగువాని; పరిగణన = ఎంచిపలుకుట; చేసి = చేసి.

భావము:- అదేవిధంగా ఆ చక్రవర్తి వామనుని కుడి పాదాన్ని పిమ్మట ఎడమ పాదాన్ని కడిగాడు. పవిత్రమైన ఆ జలాలను నెత్తి మీద చల్లుకున్నాడు. ఆచమనం చేసాడు. దేశమూ కాలమూ మొదలైన వాటిని లెక్కించి (సంకల్పం చెప్పుకుని). . .

8-607-శా.

## "విప్రాయ ప్రకటవ్రతాయ భవతే విష్ణుస్వరూపాయ వే
## దప్రామాణ్యవిదే త్రిపాద ధరణిం దాస్యామి!"యంచుం గ్రియా
## క్షిప్రుండై దనుజేశ్వరుండు వడుగుం జే సాఁచి పూజించి "బ్ర
## హ్మప్రీత"మ్మని ధారపోసె భువనం బాశ్చర్యముం బొందగన్.

టీక:- విప్రాయ = బ్రాహ్మణునికొఱకు; ప్రకటవ్రతాయ = ప్రసిద్ధమైన నిష్ఠ కలవానికొఱకు; భవతే = నీకొఱకు; విష్ణుస్వరూపాయ = విష్ణుమూర్తి యొక్క స్వరూపునికొఱకు; వేదప్రామాణ్యవిదే = వేదములందలి ప్రమాణములు / నియమములు తెలిలిసినవానికొఱకు; త్రి = మూడు (3); పాద = అడుగుల; ధరణిన్ = భూమిని; దాస్యామి = దానము చేయు చుంటిని; అంచున్ = అనుచు; క్రియాక్షిప్రుండు = పనియందు త్వరకలవాడు; ఐ = అయ్యి; దనుజేశ్వరుండు = రాక్షసరాజు; వడుగున్ = బ్రహ్మచారిని; చేన్ = చేయి; చాచి = చాచి; పూజించి = పూజచేసి; బ్రహ్మ = పరబ్రహ్మకి; ప్రీతమ్ము = ప్రీతికలుగగాక; అని = అని; ధారపోసె = ధారపోసెను {ధారపోయు - దానముచేయుట, దానముచేసెడి క్రియలో నీటిధారను దాత చేతినుండి గ్రహీత చేతిలో పడునట్లు పోసెడి విధి}; భువనంబు = జగత్తంతా; ఆశ్చర్యంబున్ = ఆశ్చర్యము; పొందగన్ = పడునట్లుగా.

భావము:- బలిచక్రవర్తి చేతులు సాచి వామనుడిని పూజించాడు. “బ్రాహ్మణుడవూ; ప్రసిద్ధమైన వ్రతం కలవాడవు; విష్ణు స్వరూపుడవూ; వేదాల నియమాలు తెలిసినవాడవూ; అయిన నీకు మూడడుగుల నేల దానం చేస్తున్నాను.” అని పలికి

“పరమాత్మునకు ప్రీతి కలుగుగాక.” అంటూ వెనువెంటనే ధారపోసాడు. అదిచూసి విశ్వం అంతా ఆశ్చర్యపోయింది.

8-608-వ.

**తత్కాలంబున.**

టీక:- తత్ = ఆ; కాలంబునన్ = సమయమునందు. భావము:- ఆసమయంలో. . . .

8-609-ఆ.

**నీరధారఁ బడఁగ నీక యడ్డంబుగాఁ**
**గలశరంధ్ర మాఁపగాను దెలిసి**
**హరియుఁ గావ్యు నేత్ర మటఁ గుశాగ్రంబున**
**నడువ నేకనేత్రుఁ డయ్యె నతఁడు.**

టీక:- నీరన్ = నీటిని; ధారన్ = ధారగా; పడనీక = పడనీయకుండ; అడ్డంబుగాన్ = అడ్డముగా; కలశ = కలశముయొక్క; రంధ్రమున్ = కన్నమును; ఆపగాను = ఆపివేయగా; తెలిసి = తెలిసికొని; హరియున్ = విష్ణువు; కావ్యు = శుక్రాచార్యుని {కావ్యుడు - భృగువు పుత్రుడైన కవి యొక్క పుత్రుడు, శుక్రుడు}; నేత్రమున్ = కంటిని; అటన్ = అక్కడ; కుశ = దర్భ; అగ్రమునన్ = కొనతో; నడువన్ = పొడువగా; ఏకనేత్రుడు = ఒంటికన్నువాడు; అయ్యెన్ = అయ్యెను; అతడు = అతను.

భావము:- నీళ్ళధార పడకుండా శుక్రాచార్యుడు కలశ రంధ్రానికి అడ్డుపడి ఆపేసాడు. సాక్షాత్తు విష్ణువు అయిన వామనుడు ఆ సంగతి తెలుసుకుని దర్భకొనతో పొడిచాడు. దానివలన శుక్రుడు ఒంటి కన్ను వాడు అయ్యాడు.

8-610-వ.

**అంత.**

టీక:- అంత = అంతట.

భావము:- అలా ఒంటి కన్నువాడై శుక్రాచార్యుడు అడ్డు తప్పుకున్న పిమ్మట. . .

8-611-మ.

**అమరారాతి కరాక్షతోజ్ఝిత పవిత్రాంభః కణశ్రేణికిం**
**గమలాధీశ్వరుఁ డొడ్డె ఖండిత దివౌకస్స్వామిజిన్మస్తముం**
**గమలాకర్షణ సుప్రశస్తము రమాకాంతాకచోపాస్తమున్**
**విమలశ్రీ కుచశాత చూచుక తటీవిన్యస్తమున్ హస్తమున్.**

టీక:- అమరారాతి = బలిచక్రవర్తి {అమర + అరాతి (సవర్ణదీర్ఘ సంధి) - దేవతల శత్రువు (బలి)}; కరా = చేతిలోని; అక్షత = క్షయము లేకుండా (ఆటంకము లేకుండా); ఉజ్ఝిత = విడువబడిన; పవిత్ర = పవిత్రమైన; అంభః = నీటి; కణ = బిందువుల; శ్రేణి = వరుస; కిన్ = కు; కమలాధీశుడు = విష్ణువు {కమలాధీశుడు - కమలా (లక్ష్మీదేవి) అధీశుడు (భర్త), విష్ణువు}; ఒడ్డె = పట్టెను; ఖండిత = తెగగొట్టబడిన; దివౌకస్స్వామి = ఇంద్రుని {దివౌకః+ స్వామి - దివౌకః (స్వర్గవాసుల) స్వామి (ప్రభువు), ఇంద్రుడు}; జిత్ = జయించువాని; మస్తమున్=తలకలదానిని; కమల=లక్ష్మీదేవిని; ఆకర్షణ =ఆకర్షించుటలో; సుప్రశస్తమున్ = మిక్కిలి ప్రసిద్ధమైనదానిని; రమాకాంత = లక్ష్మీదేవి; కచ = శిరోజములకు; ఉపాస్తమున్ = ఉపాస్తి(సేవ)చేయుదానిని; విమల=నిర్మలమైన; శ్రీ = లక్ష్మీదేవి; కుచ = స్తనముల; చూచుక = అగ్రముల; తటీ = ప్రదేశమున; విన్యస్తమున్ = కదలెడి దానిని; హస్తమున్ = చేతిని.

భావము:- ఆటంకం లేకుండా దైవవిద్వేషి బలిచక్రవర్తి చేతిలోనుండి నిరాటంకంగా పవిత్రమైన జలం ధారపోసాడు. పవిత్రమైన ఆ నీటిబిందువులకు ఆ లక్ష్మీపతి వామనుడు తన చెయ్యి ఒడ్డాడు. ఆ చెయ్యి ఎలాంటిది అంటే. రాక్షసుల శిరస్సులు ఖండించునది. లక్ష్మీదేవిని ఆకర్షించడంలో మేలైనది. లక్ష్మీదేవి శిరోజాలను సేవించునది. నిర్మలమైన ఆమె కుచాగ్రముల మీద మర్యాదలు అనుభవించేది.

8-612-క.

**మునిజన నియమాధారను**
**జనితాసుర యువతి నేత్రజలకణ ధారన్**
**దనుజేంద్ర నిరాధారను**
**వనజాక్షుఁడు గొనియె బలివివర్జితధారన్.**

టీక:- ముని = మునుల; జన = సమూహముయొక్క; నియమ = నిష్ఠలకు; ఆధారను = ఆధారభూతమైనదానిని; జనిత = కలిగించబడిన; అసుర = రాక్షస; యువతి = స్త్రీల; నేత్రజల = కన్నీటి; కణ = బిందువుల; ధారన్ = ధారకలదానిని; దనుజేంద్ర = బలిచక్రవర్తిని; నిరాధారను = నిరాధారుని చేసెడిదానిని; వనజాక్షుడు = విష్ణువు; కొనియె = గ్రహించెను; బలి = బలిచేత; వివర్జిత = విడువబడిన; ధారన్ = దానజలధారను.

భావము:- బలిచక్రవర్తి అందించిన దానధారను పద్మాలవంటి కన్నులు గలస్వామి వామనుడు స్వీకరించాడు. ఆ జలధార మునుల నియమాలకు ఆధారమైనది. రాక్షసస్త్రీలను కన్నీటి పాలుచేసేది. రాక్షసరాజులను నిరాధారులుగా మార్చేది.

*8-613-ఆ.

కమలనాభు నెఱిఁగి కాలంబు దేశంబు
నెఱిఁగి శుక్రు మాట లెఱిఁగి నాశ
మెఱిఁగి పాత్ర మనుచు నిచ్చె దానము బలి
మహి వదాన్యుఁ డొరుఁడు మఱియుఁ గలఁడె.

టీక:- కమలనాభున్ = విష్ణుడని; ఎఱిగి = తెలిసి; కాలంబు = కాలప్రభావము; దేశంబు = ప్రదేశప్రభావములను; ఎఱిగి = తెలిసి; శుక్రు = శుక్రుని; మాటలు = మాటలను; ఎఱిగి = తెలిసి; నాశమున్ = కలిగెడిచేటు; ఎఱిగి = తెలిసి; పాత్రము = యోగ్యమైనది; అనుచున్ = అనుచు; ఇచ్చెన్ = ఇచ్చెను; దానమున్ = దానమును; బలి = బలి; మహిన్ = భూమిమీద; వదాన్యుడు = దాత; ఒరుడు = ఇంకొకడు; మఱియున్ = మఱి; కలడె = ఉండగలడా, లేడు.

భావము:- బలిచక్రవర్తి విష్ణుమూర్తిని తెలుసుకున్నాడు. దేశకాలాలు తెలుసుకున్నాడు. శుక్రుని మాటలు అర్థం చేసుకున్నాడు. తనకు చేటువాటిల్లుతుందని తెలుసుకున్నాడు. అయినప్పటికి యోగ్యమైనదిగా భావించి ఆ దాన మిచ్చాడు. లోకంలో అటువంటి మహాదాత మరొకడుంటాడా?

8-614-క.

**బలిచేసిన దానమునకు**

**నళినాక్షుఁడు నిఖిలభూత నాయకుఁ డగుటం**

**గలకల మని దశదిక్కులు**

**భళిభళి యని పొగడె భూతపంచక మనఘా!**

టీక:- బలి = బలి; చేసిన = చేసినట్టి; దానమున్ = దానమున; కున్ = కు; నళినాక్షుండు = విష్ణువు; నిఖిల = సమస్తమైన; భూత = జీవుల; నాయకుడు = ప్రభువు; అగుటన్ = అగుటవలన; కలకలము = కలకల; అని = అని; దశ = పది; దిక్కులు = దిశలు {దశదిక్కులు - 4దిక్కులు 4మూలలు పైన కింద మొత్తం 10వైపులు}; భళిభళి = ఓహో ఓహో; అని = అని; పొగడె = శ్లాఘించెను; భూతపంచకము = పంచభూతములును {పంచభూతములు - 1పృథివి 2అప్పు 3తేజస్సు 4వాయువు 5ఆకాశము}; అనఘా = పుణ్యుడా.

భావము:- ఓ పరీక్షన్మహారాజా! సర్వ భూతాలకూ విష్ణువు అధిపతి కదా. కనుక, ఆయనకు బలిచక్రవర్తి దానం చేయగానే దిక్కులు అన్నీ కళకళలాడాయి. పంచభూతాలూ "భళి భళి" అని పొగిడాయి.

8-615-క.

**"క్షితిదానమిచ్చు నతఁడును**

**నతికాంక్షఁ బరిగ్రహించు నతఁడును దురిత**

**చ్యుతులై శతవత్సరములు**

**శతమఖ లోకమునఁ గ్రీడ సలుపుదు రెలమిన్.**

టీక:- క్షితిదానము = భూదానమును; ఇచ్చు = ఇచ్చెడి; అతడున్ = వాడు; అతి = మిక్కిలి; కాంక్షన్ = కోరికతో; పరిగ్రహించు = తీసుకొనెడి; అతడున్ = వాడు; దురిత = పాపములు; చ్యుతులు = నశించినవి; ఐ = అయ్యి; శత = నూరు (100); వత్సరములు = సంవత్సరములు; శతమఖ = ఇంద్రుని; లోకమునన్ = లోకమునందు; క్రీడన్ = విహరించుట; సలుపుదురు = చేసెదరు; ఎలమిన్ = సంతోషముతో.

భావము:- అంతట మాయాబ్రహ్మచారి బలిచక్రవర్తి తో ఇలాఅన్నాడు. "భూమిని దానం ఇచ్చినవాడికి; దానిని ప్రీతితో తీసుకున్నవాడికి పాపాలు నశించిపోతాయి. వారు సంతోషంగా నూరు యాగాలు చేస్తే దక్కే స్వర్గలోకంలో నూరేండ్లు విహరిస్తారు.

8-616-వ.

అట్లుగావున నే దానంబును భూదానంబునకు సదృశంబు గానేరదు; గావున వసుంధరా దానం బిచ్చితి; వుభయలోకం బులం గీర్తి సుకృతంబులు పడయు"మని పలికి య మ్మాయా వటుం డిట్లనియె.

టీక:- అట్లుగావున = అందుచేత; ఏ = ఎట్టి; దానంబును = దానముకూడ; భూదానంబున్ = భూదానమున; కున్ = కు; సదృశంబున్ = సమానమైనది; కానేరదు = కాలేదు; కావున = అందుచేత; వసుంధరాదానంబు = భూదానము; ఇచ్చితివి = ఇచ్చినావు; ఉభయ = ఇహపరరెండు; లోకంబులన్ = లోకములలోను; కీర్తి = యశము; సుకృతంబులు = పుణ్యములు; పడయుము = పొందుదువుగాక; అని = అని; పలికి = చెప్పి; ఆ = ఆ; మాయా = కపట; వటుండు = బ్రహ్మచారి; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- అందుచేత, ఏదానమూ భూదానానికి సమానంకాదు. భూదానం ఇచ్చిన నీకు ఇహ పర లోకాలు రెంటిలోనూ కీర్తి, పుణ్యమూ కలుగుతుంది." అని పలికి మాయాబ్రహ్మచారి మళ్లీ ఇలా అన్నాడు.

8-617-క.

"ఇ**ది**యేమి వేఁడితని నీ<br>
మ**ది**వగవక ధారపోయుమా; సత్యము పెం<br>
పొ**ద**వఁగ గోరిన యర్థం<br>
బి**ది** యిచ్చుట ముజ్జగంబు లిచ్చుట మాకున్."

టీక:- ఇది = దీనిని; ఏమి = దేనికి; వేడితి = అడిగితిని; అని = అని; నీ = నీ యొక్క; మదిన్ = మనసున; వగవక = చితించకుండ; ధారపోయుమా = దానమిమ్ము; సత్యమున్ = సత్యము; పెంపొదవన్ = పెంపొందేవిధముగ; కోరిన = అడిగిన; అర్థంబు = కోరిక; ఇది = ఇది; ఇచ్చుట = ఇచ్చుట; ముజ్జగంబులున్ = ముల్లోకములను; ఇచ్చుట = ఇచ్చుట; మాకున్ = మాకు.

భావము:- “నేనెందుకు దీనిని అడిగానని నీ మనస్సులో చింతించకుండా దానమియ్యి. సత్యం పెంపొందే విధంగా దాన మియ్యి. ఈ మూడడుగులూ ఇస్తే మాకు మూడు లోకాలూ ఇచ్చినట్లే.”

8-618-వ.

## అని పలికిన వటుని పలుకులకు హర్ష నిర్భర చేతస్కుండై వైరోచనుండు.

టీక:- అని = అని; పలికిన = అనిన; వటుని = బ్రహ్మచారి; పలుకుల = మాటల; కున్ = కు; హర్ష = సంతోషముతో; నిర్భర = మిక్కిలి నిండిన; చేతస్కుండు = మనసు కలవాడు; ఐ = అయ్యి; వైరోచనుండు = బలిచక్రవర్తి {వైరోచనుడు - విరోచనునిపుత్రుడు, బలి};

భావము:- ఇలా పలికిన వామనుడి పలుకలకు విరోచనుడి కొడుకు అయిన బలి మనస్సు ఎంతగానో సంతోషంతో నిండిపోయింది.

*8-619-ఆ.

## "పుట్టి నేర్చుకొనెనొ పుట్టక నేర్చెనో<br>చిట్టి బుద్ధు లిట్టి పొట్టివడుగు<br>పొట్ట నున్న వెల్ల బూమెలు" నని నవ్వి<br>యెలమి ధరణి దాన మిచ్చె నపుడు.

టీక:- పుట్టి = పుట్టినతరవాత; నేర్చుకొనెనొ = నేర్చుకొన్నాడో లేక; పుట్టక = పుట్టుటకు ముందే; నేర్చెనో = నేర్చుకొన్నాడో; చిట్టి = లీలా, ముద్దుల {చిట్టి - చిట్టకము కలవి, లీల మాత్రపు}; బుద్ధులు = బుద్ధులు; ఇట్టి =ఇటువంటి; పొట్టి=పొట్టివాడైన; వడుగు= బ్రహ్మచారి; పొట్టన్ = కడుపునిండా; ఉన్నవి = ఉన్నట్టివి; ఎల్ల = అన్ని; బూమెలున్ = మాయలు; అని = అని; నవ్వి = నవ్వి; ఎలమిన్ = సంతోషముతో; ధరణిదానమున్ = భూదానమును; ఇచ్చెన్ = ఇచ్చెను; అపుడు = అప్పుడు.

భావము:- ఈ పొట్టి బ్రహ్మచారి ఈ చిట్టి బుద్ధులు పుట్టేకా నేర్చుకున్నాడా? పుట్టకముందే నేర్చుకున్నాడా? ఇతని పొట్ట నిండా మాయలే అంటు నవ్వి సంతోషంగా భూదానం యిచ్చాడు.

8-620-ఆ.

గ్రహ మునీంద్ర సిద్ధ గంధర్వ కిన్నర
యక్ష పక్షి దేవతాహి పతులు
పొగడి రతని పెంపుఁ; బుష్పవర్షంబులు
గురిసె దేవతూర్యకోటి మొరసె.

టీక:- గ్రహ = గ్రహములు; ముని = మునులలో; ఇంద్ర = శ్రేష్ఠులు; సిద్ధ = సిద్ధులు; గంధర్వ = గంధర్వులు; కిన్నర = కిన్నరలు; యక్ష = యక్షులు; పక్షి = గరుడులు; దేవత = దేవతలు; అహిపతులు = సర్పరాజులు; పొగిడిరి = శ్లాఘించిరి; అతని = అతని యొక్క; పెంపున్ = ఔదార్యమును; పుష్ప = పూల; వర్షంబులున్ = వానలు; కురిసె = కురిసెను; దేవ = దివ్య; తూర్య = వాద్య; కోటి = సమూహములు; మొరసెన్ = మోగినవి.

భావము:- బలిచక్రవర్తి ఔదార్యాన్ని గ్రహాలూ, మునీశ్వరులూ. సిద్ధులూ, గంధర్వులూ, కిన్నరులూ, యక్షులూ, గరుడులూ, దేవతలూ, సర్పరాజులూ అందరూ అతని గొప్పదనాన్ని పొగిడారు. పూలవానలు కురిపించారు. దేవతల విజయ దుందుభులు మారుమ్రోగాయి.

8-621-వ.

ఇట్లు ధారా పరిగ్రహంబు చేసి.

టీక:- ఇట్లు; ధారా = దానజలధారను; పరిగ్రహంబు = తీసుకొనుట; చేసి = చేసి.

భావము:- ఈ విధంగా వామనుడు దానాన్ని గ్రహించి. . . .

## త్రివిక్రమ స్ఫురణంబు

*8-622-శా.

ఇంతింతై, వటుఁడింతయై మఱియుఁ దా నింతై నభోవీథిపై
నంతై తోయదమండలాగ్రమున నల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రుని కంతయై ధ్రువునిపై నంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుం డగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై.

టీక:- ఇంతింతై = ఇంతఇంతచొప్పునపెరుగుతూ; వటుడు = బ్రహ్మచారి; ఇంత = మరింత పెరిగిన వాడు; ఐ = అయ్యి; మఱియున్ = ఇంకను; తాను = అతను; ఇంత = ఇంకొంత పెరిగినవాడు; ఐ = అయ్యి; నభోవీథి = ఆకాశము; పైన్ = మీద; అంత = అంత; ఐ = అయ్యి; తోయద=మేఘ; మండల = మండలమునకు; అగ్రమున్ = పైకొస; కున్ = కు; అల్లంత = ఆవతలంత; ఐ = అయ్యి; ప్రభారాశి = వెలుగులరాశి, పాలపుంత; పైన్=కంటెఎక్కువ ఎత్తు; అంత = అంత; ఐ = అయ్యి; చంద్రుని = చంద్రుని; కిన్ = కి; అంత = అంత; ఐ = అయ్యి; ధ్రువుని = ధ్రువుడి కంటె; పైన్ = ఎక్కువ ఎత్తు; అంత = అంత; ఐ = అయ్యి; మహర్వాటిన్ = మహర్లోకము కంటె; పైన్ = ఎక్కువ ఎత్తు; అంత = అంత; ఐ = అయ్యి; సత్యపద = బ్రహ్మలోకముకంటె; ఉన్నతుండు = ఎక్కువ ఎత్తు కలవాడు; అగుచున్ = అగుచు; బ్రహ్మాండ = బ్రహ్మాండము; అంత = చివరవరకు; సంవర్ధి = నిండాపెరిగినవాడు; ఐ = అయ్యి.



భావము:- బలిచక్రవర్తి మూడడుగుల మేర భూమి ధారపోయగానే గ్రహించిన వామనుడు చూస్తుండగానే

ఇంత పొట్టి బ్రహ్మచారీ, ఇంత ఇంత చొప్పున ఎదగటం మొదలెట్టాడు; అంతట్లోనే అంత పొడుగు ఎదిగాడు; అలా ఆకాశం అంత ఎత్తు పెరిగాడు; అదిగో మేఘాలకన్నా పైకి పెరిగిపోసాగాడు; పాలపుంత, చంద్రమండలం అన్నీ దాటేసాడు; అదిగదిగో ధ్రువ నక్షత్రం కూడ దాటేసాడు; మహర్లోకం మించిపోయాడు. సత్యలోకం కన్నా ఎత్తుకి ఇంకా ఎత్తుకి పెరిగిపోతూనే ఉన్నాడు. మొత్తం బ్రహ్మాండభాడం అంతా నిండిపోయి వెలిగిపోతున్నాడు; ఆహా ఎంతలో ఎంత త్రివిక్రమరూపం దాల్చేసాడో శ్రీమన్నారాయణ మహా ప్రభువు.

*8-623-మ.

**రవిబింబం బుపమింపఁ బాత్రమగు ఛత్రంబై శిరోరత్నమై**
**శ్రవణాలంకృతియై గళాభరణమై సౌవర్ణకేయూరమై**
**ఛవిమత్కంకణమై కటిస్థలి నుదంచద్ఘంటయై నూపుర**
**ప్రవరంబై పదపీఠమై వటుఁడు దా బ్రహ్మాండమున్ నిండుచోన్.**

టీక:- రవిబింబంబున్ = సూర్యబింబము; ఉపమింపన్ = సరిపోల్చుటకు; పాత్రము = తగినది; అగు = అయిన; ఛత్రంబు = గొడుగు; ఐ = వలెనయ్యి; శిరోరత్నము = శిరసు

పైని ఆభరణము; ఐ = వలెనయ్యి; శ్రవణ = చెవుల; అలంకృతి = అలంకారము; ఐ = వలెనయ్యి; గళ = కంఠమునందలి; ఆభరణము = ఆభరణము; ఐ = వలెనయ్యి; సౌవర్ణ = బంగారపు; కేయూరము = భుజకీర్తి; ఐ = వలెనయ్యి; ఛవిమత్ = మెరిసెడి; కంకణము= చేతికంకణము; ఐ = వలెనయ్యి; కటిస్థలిన్ = నడుమున; ఉదంచత్ = వేయబడిన; గంట = గంట; ఐ = వలె నయ్యి; నూపుర =కాలిఅందెల; ప్రవరంబు=పేరు; ఐ=వలెనయ్యి; పదపీఠంబు= పాదపీఠము; ఐ = అయ్యి; వటుడు = బ్రహ్మచారి; తాన్ = అతను; బ్రహ్మాండమున్ = బ్రహ్మాండమును; నిండుచోన్ = అంతవ్యాపించునప్పుడు.

భావము:- వామనుడు బ్రహ్మాండ మంతా నిండిపోతుంటే, మింట నుండే సూర్యబింబం ఆ పరాత్పరునికి అలంకారంగా పోల్చి చెప్పడానికి తగి ఉన్నాడట. అది ఎలాగంటే ఆ సమయం లో క్రమక్రమంగా త్రివిక్రమునికి గొడుగులా, తర్వాత శిరోమణిలా, తర్వాత మకరకుండలంలా, పిమ్మట కంఠాభరణంలా, ఆ పిమ్మట బంగారు భుజకీర్తులులా, ఆ పిమ్మట కాంతులీనే కంకణంలా, అపైన మొలలోని గంటలా, అనంతరం మేలైన కాలిఅందెలా, చివరికి పాదపీఠంలా పోల్చడానికి తగి ఉన్నాడట.

అందంగా కళ్ళకుకట్టినట్లు అలవోకగాచెప్పడంలో సిద్ధహస్తుడు ఐన మన పోతనామాత్యుల వారి త్రివిక్రమావతరణ అత్యద్భుతం తెలుగు సాహిత్యానికే మకుటాయ మానమైన పద్యాలుగా ఎన్నదగ్గవి. ఉపమానం అని చెప్తు ఉపమానానికి గొప్పదనం అబ్బేలా చేయటం సామాన్య విషయం కాదు. ఇది అద్భుతమైన అక్షర శిల్పము.

*8-624-వ.

ఇట్లు విష్ణుండు గుణత్రయాత్మకంబగు విశ్వరూపంబు ధరియించి భువియును, నభంబును, దివంబును, దిశలును, దిశాఛిద్రంబు లును, సముద్రంబులునుఁ, జలదచల దఖిల భూతనివహం బులుం దానయై యేకీభవించి, క్రమక్రమంబున భూలోకంబు నకుం బొడపై భువర్లోకంబునతిక్రమించి, సువర్లోకంబును దల కడచి, మహర్లోకంబు దాఁటి, జనలోకంబునకు మీఁదై, తపంబు నకు నుచ్ఛ్రితుండై, సత్యలోకంబు కంటె నౌన్నత్యంబు వహించి, యెడ లిఱుములు సందులు రంధ్రములు లేకుండ నిండి, మహా దేహ మహితుండై చరణతలంబునరసాతలంబునుఁ, బాదంబుల

మహియును, జంఘుల మహీధ్రంబులును, జానువులఁ బతత్త్రి సముదయంబులును, నూరువుల నింద్రసేన మరుద్గణంబు లును, వాసస్థ్సలంబున సంధ్యయు, గుహ్యంబునఁ బ్రజాపతు లును, జఘునంబున దనుజ లును, నాభిని నభంబును, నుదరంబున నుదధిసప్తకంబును, నురంబున దారకానికరం బును, హృదయంబున ధర్మ్ంబును, నురోజంబుల ఋతసత్యం బులును, మనంబునఁ జంద్రుండును, వక్షంబున గమలహస్త యగు లక్ష్మియుఁ, గంఠంబున సామాది సమస్త వేదంబులును, భుజంబులఁ బురంద రాది దేవతలునుఁ, గర్ణంబులదిశలును, శిరంబుననాకంబును, శిరోజంబుల మేఘంబు లును, నాసా పుటంబునవాయువును, నయనంబులసూర్యుండును, వదనం బున వహ్నియు, వాణి నఖిలచ్ఛంద స్సముదయంబును, రసనంబున జలేశుండును, భ్రూయుగళంబున విధినిషేధంబు లును, ఱెప్పలనహోరాత్రంబులును, లలాటంబునఁగోపంబును, నధరంబున లోభంబును, స్పర్శంబునఁ గామంబును, రేతంబున జలంబును, బృష్ఠంబున నధర్మ్ంబును, గ్రమణంబుల యజ్ఞంబు లును, ఛాయల మృత్యువును, నగవులవలన ననేక మాయా విశేషంబులును, రోమంబుల నోషధులును, నాడీప్రదేశంబుల నదులును, నఖంబుల శిలలును, బుద్ధి నజుండును, బ్రాణంబుల దేవర్షి గణంబులును, గాత్రంబున జంగమ స్థావర జంతు సంఘం బులును గలవాఁడయి, జలధరనినద శంఖశార్ఙ్గ సుదర్శన గదా దండ ఖడ్గాక్షయ బాణతూణీర విభ్రాజితుండును, మకరకుండల కిరీట కేయూర హార కటక కంకణ కౌస్తుభమణి మేఖలాంబర

వనమాలికా విరాజితుండును, సునంద నంద జయ విజయ ప్రముఖ పరిచర వాహినీ సందోహ పరివృతుం డును, నమేయ తేజోవిరాజితుండును, నై బ్రహ్మాండంబు దన మేనికప్పు తెఱంగున నుండ విజృంభించి.

టీక:- ఇట్లు = ఈ విధముగ; విష్ణుండు = నారాయణుండు; గుణత్రయ = త్రిగుణములతో {గుణత్రయము - 1సత్త్వ 2రజస్ 3తమస్ అనెడి 3 గుణములు}; ఆత్మకంబు = కూడినది; అగు = అయిన; విశ్వరూపంబున్ = విశ్వరూపమును; ధరియించి = ధరించి; భువియును = భూమండలము; నభంబును = ఆకాశమును; దివంబును = స్వర్గమును; దిశలును = నలుదిక్కులును; దిశాఛిద్రంబులును = నలుమూలలును; సముద్రంబులును = సముద్రములును; చలదచల = చరాచర; అఖిల = మున్నగు సమస్తమైన; భూత = జీవ; నివహంబులున్ = సమూహములును; తాన = తనే; ఐ = అయ్యి; ఏకీభవించి = ఒకటిచేసి; క్రమక్రమంబునన్ = క్రమక్రమముగా; భూలోకంబున్ = భూలోకమున; కున్ = కంటె; పొడవు = పెద్ద; ఐ = అయ్యి; భువర్లోకంబున్ = భువర్లోకమును; అతిక్రమించి = దాటి; సువర్లోకంబు నున్ = సువర్లోకమును; తలకడచి = దాటేసి; మహర్లోకంబున్ = మహర్లోకమును; దాటి = దాటి; జనలోకంబున్ = జనలోకమున; కున్ = కంటెను; మీద = ఎక్కువ ఎత్తు; ఐ = అయ్యి; తపంబున్ = తపోలోకమున; కున్ = కు; ఉచ్ఛ్రితుండు = దాటినవాడు; ఐ = అయ్యి; సత్య లోకంబున్ = సత్యలోకము; కంటెన్ = కంటె; ఔన్నత్యంబు = ఎత్తగుటను; వహించి = చెంది; ఎడలు = చోటులు; ఇఱుములు = మరుగుస్థానములు; సందులు = సందులు; రంధ్రము లున్ = కన్నములు; లేకుండ = లేకుండునట్లు; నిండి = నిండిపోయి; మహా = బాగాపెద్ద; దేహ = శరీరము కల; మహితుండు = గొప్పవాడు; ఐ = అయ్యి; చరణతలంబునన్ = అరికాళ్ళవద్ద; రసాతలంబును = రసాతలము, పాతాళము; పాదంబులన్ = పాదములవద్ద; మహియును = భూతలము; జంఘలన్ = పిక్కలవద్ద; మహీధ్రంబులును = పర్వతము లును; జానువులన్ = మోకాళ్ళవద్ద; పతత్రి = పక్షుల; సముదయంబులును = సమూహ ములు; ఊరువులన్ = తొడలవద్ద; ఇంద్రసేన = దేవతలను; మరుత్ = మరుత్తుల; గణంబు లును = సమూహములు; వాసస్థ్సలంబునన్ = వస్త్రములవద్ద; సంధ్యయున్ = సంధ్యలు; గుహ్యంబునన్ = రహస్యాంగమువద్ద; ప్రజాపతులును = ప్రజాపతులు; జఘనంబున = పిరుదులవద్ద; దనుజులును = రాక్షసులు; నాభిన్ = బొడ్డువద్ద; నభంబును = ఆకాశము;

ఉదరంబునన్ = పొట్టవద్ద; ఉదధిసప్తకంబును = సప్తసముద్రములు; ఉరంబున = వక్షము వద్ద; తారకా = నక్షత్రముల; నికరంబును = సమూహములు; హృదయంబునన్ = హృదయమువద్ద; ధర్మంబునున్ = ధర్మము; ఉరోజంబులన్ = స్తనములవద్ద; ఋత = ఋతము {ఋతము - శాశ్వతముగా నిలిచే సత్యము}; సత్యంబులును = సత్యమును; మనంబునన్ = మనసునందు; చంద్రుండును = చంద్రుడు; వక్షంబునన్ = వక్షస్థలమున; కమల = పద్మము; హస్త = చేత కలామె; అగు = అయిన; లక్ష్మియున్ = లక్ష్మీదేవి; కంఠంబునన్ = కంఠమునందు; సామ = సామవేదము; ఆది = మున్నగు; సమస్త = సమస్తమైన; వేదంబులును = వేదములు; భుజంబులన్ = భుజములందు; పురందర = ఇంద్రుడు; ఆది = మున్నగు; దేవతలును = దేవతలు; కర్ణంబులన్ = చెవులందు; దిశలును = దిక్కులు; శిరంబునన్ = తలయందు; నాకంబును = స్వర్గము; శిరోజంబులన్ = తల వెంట్రుకలందు; మేఘంబులును = మేఘములును; నాసాపుటంబునన్ = ముక్కు పుటము లందు; వాయువును = వాయువు; నయనంబులన్ = కళ్ళయందు; సూర్యుండును = సూర్యుడు; వదనంబునన్ = ముఖమునందు; వహ్నియున్ = అగ్ని; వాణిన్ = మాట యందు; అఖిల =సమస్తమైన; ఛందస్=ఛందస్సుల; సముదయంబును= సమూహములు; రసనంబున = నాలికయందు; జలేశుండును = వరుణుడు; భ్రూయుగళంబునన్ = కను బొమలయందు; విధి = తప్పక చేయవలసినవి; నిషేధంబులును = తప్పక చేయకూడనివి; ఱెప్పలన్ = కనురెప్పలందు; అహోరాత్రంబులు = రాత్రింబగళ్ళు; లలాటంబునన్ = నుదుట; కోపంబును = కోపము; అదరంబున = కిందిపెదవియందు; లోభంబును = లోభము; స్పర్శంబునన్ = స్పర్శయందు; కామంబును = కామము; రేతంబునన్ = వీర్యమున; జలంబును = నీరు; పృష్ఠంబునన్ = వీపునందు; అధర్మంబును = అధర్మము; క్రమణంబులన్ = అడుగులలో; యజ్ఞంబులును = యాగములు; ఛాయలన్ = నీడలందు; మృత్యువు = మరణము; నగవుల = నవ్వుల; వలనన్ = వలన; అనేక = అనేకమైన; మాయా = మాయల; విశేషంబులును = విశేషములు; రోమంబులన్ = శరీరరోమము లందు; ఓషధులును = ఓషధులు; నాడీ = నాడుల; ప్రదేశంబులన్ = భాగములందు; నదులును = నదులు; నఖంబులన్ = గోర్లుయందు; శిలలును = బండరాళ్ళు; బుద్ధిన్ = బుద్ధియందు; అజుండును = బ్రహ్మదేవుడు; ప్రాణంబులన్ = ప్రాణములయందు; దేవర్షి = దేవఋషుల; గణంబులును = సమూహములు; గాత్రంబున = దేహమునందు; జంగమ స్థావర = చరాచర; జంతు = జీవ; సంఘంబులునున్ = జాలమును; కలవాడు = కలిగిన వాడు; అయి = అయ్యి; జలధరనినద = ఉరుములవలెమోగెడి; శంఖ = శంఖము; శార్ఙ = శార్ఙమనెడివిల్లు;

సుదర్శన = సుదర్శనచక్రము; గదాదండ = గదాయుధము; ఖడ్గ = ఖడ్గము; అక్షయతూణీర = అక్షయములైన అంబులపొదితోను; విభాజితుండును = ప్రకాశించెడివాడును; మకరకుండల = చెవిమకరకుండలములు; కిరీట = కిరీటములు; కేయూర = భుజకీర్తులు; హార = హారములు; కటక = కాలిఅందెలు; కంకణ = చేతికంకణములు; కౌస్తుభమణి = కౌస్తుభమణి; మేఖలా = రత్నాలమొలనూళ్ళు; అంబర = పీతాంబరములు; వనమాలికా = వనమాలికలుతోను; విరాజితుండును = విరాజిల్లెడివాడును; సునంద = సునందుడు; నంద = నందుడు; జయ = జయుడు; విజయ = విజయుడు; ప్రముఖ = మొదలగు; పరిచర = పరిచారకుల; వాహినీ = సమూహములు; సందోహ = గుమిగూడి; పరివృతుండును = చుట్టునుచేరినవాడు; అమేయ = అంతులేని; తేజో = తేజస్సుతో; విరాజితుండును = విరాజిల్లెడివాడును; ఐ = అయ్యి; బ్రహ్మాండంబున్ = బ్రహ్మాండమును; తన = తన యొక్క; మేని = దేహమునకు; కప్పు = మేలిముసుగు; తెఱంగునన్ = వలె; ఉండన్ = ఉండగా; విజృంభించి = విజృంభించి.

భావము:- ఈవిధంగా విష్ణువు సత్త్వరజస్తమో రూపకమైన విశ్వరూపాన్ని పొంది విజృంభించాడు. భూమి, ఆకాశమూ, స్వర్గమూ, దిక్కులూ, దిక్కుల మధ్య ప్రదేశాలూ, సముద్రాలూ, చరాచరములైన సమస్త ప్రాణులూ తానే అయ్యాడు. క్రమంగా భూలోకాన్ని అతిక్రమించాడు. భువర్లోకమూ, సువర్లోకమూ, మహర్లోకమూ, జనోలోకమూ, తపోలోకమూ, దాటిపోయాడు. సత్యలోకం కంటే ఎత్తుగా ఎదిగిపోయాడు. అన్నిచోట్ల మూలమూలలూ సందుసందులూ నిండిపోయాడు. మహోన్నతమైన ఆకారంతో పాదాల అడుగు భాగంలో రసాతలాన్ని, పాదాలలో భూమినీ, పిక్కలలో పర్వతాలనూ, మోకాళ్ళలో పక్షులను, తొడలలో దేవతలను, వస్త్రంలో సంధ్యాకాలాన్నీ, రహస్యాంగంలో ప్రజాపతులనూ, పిరుదులలో రాక్షసులనూ, నాభిలో ఆకాశాన్ని, కడుపులో సప్తసముద్రాలనూ, వక్షంలో నక్షత్రసమూహాన్నీ, హృదయంలో ధర్మాన్ని, స్తనద్వయంలో ఋతాన్ని సత్యాన్ని, మనస్సులో చంద్రుణ్ణి, ఎదలో లక్ష్మి దేవిని, కంఠంలో వేదాలను, భుజాలలో ఇంద్రాదులైన దేవతలను, చెవులలో దిక్కులూ, తలలో స్వర్గలోకాన్ని, తలవెంట్రుకలలో మేఘాలనూ, ముక్కుపుటాలలో వాయువునూ, కన్నులలో సూర్యుణ్ణి, ముఖంలో అగ్నిని, వాక్కులో సమస్త ఛందస్సునూ, నాలుకలో వరుణునీ, కనుబొమ్మలలో కార్యాకార్యాలనూ, రెప్పలలో రేయింబవళ్ళనూ, ఫాలభాగంలో కోపాన్నీ, క్రింది పెదవిలో లోభాన్నీ, స్పర్శలో కామాన్ని, రేతస్సులో జలాన్నీ, వీపులో అధర్మాన్నీ, అడుగులలో యజ్ఞాలనూ, నీడలో మరణాన్నీ, నవ్వులోమాయావిశేషాలనూ, రోమాలలోసస్యాలనూ, నరాలలో నదులనూ, గోళ్ళలో రాళ్లను, బుద్ధిలో బ్రహ్మనూ,

ప్రాణాలలో దేవర్షిగణాలనూ, శరీరంలో చరాచర సకలప్రాణులనూ, ఇమిడించికొన్నాడు. ఆయన మేఘం వలే మ్రోగే పాంచజన్య మనే శంఖంతో, శార్ఙ్గమనే ధనస్సుతో, సుదర్శనమనే చక్రముతో, కౌమోదకి అనే గదాదండంతో, నందకమనే ఖడ్గంతో, అక్షయములైన అంపపొదులతో ప్రకాశించుచున్నాడు. మకరకుండలాలతో, కిరీటంతో, భుజ కీర్తులతో, హారాలతో, కాలి అందెలుతో, కంకణాలతో, కౌస్తుభమణితో, రత్నాల మొలనూలుతో, పీతాంబరంతో, వైజయంతీమాలికతో విరాజిల్లుతున్నాడు. సునందుడూ, నందుడూ, జయుడూ, విజయుడూ మొదలైన పరిచారకుల సమూహం చుట్టూ చేరి ఉంది. ఆయన మేరలేని తేజస్సుతో మెరుస్తున్నాడు. బ్రహ్మాండం ఆయన దేహానికి మేలిముసుగుగా ఒప్పుతున్నది.

8-625-మ.

ఒకపాదంబున భూమి గప్పి దివి పే ఱొంటన్ నిరోధించి యొం
డొకటన్ మీఁది జగంబు లెల్లఁ దొడి, నొండొంటిన్ విలంఘించి. ప
ట్టకబ్రహ్మాండకటాహముం బెటిలి పేంద్రంబై పరుల్ గానరా
కొకఁడై వాగ్దృగలభ్యుఁడై హరి విభుం డొప్పారె విశ్వాకృతిన్.

టీక:- ఒక = ఒక; పాదంబునన్ = పాదముతో; భూమిన్ = భూమిని; కప్పి = కప్పివేసి; దివిన్ = స్వర్గమును; పేఱొంటన్ = ఇంకొకదానితో; నిరోధించి = ఆపి; ఒండొకటన్ = ఇంకొక దానితో; మీఁది = పైనున్న; జగంబులన్ = లోకములను; ఎల్లన్ = అన్నిటిని; తొడిన్ = క్రమముగా; ఒండొంటిన్ = ఒక్కొదానిని; విలంఘించి = దాటిపోయి; పట్టక=పట్టకపోవుట చేత; బ్రహ్మాండ = బ్రహ్మాండము యొక్క; కటాహంబు = పైపెంకు; పెటిలి = బద్దలై; పేంద్రంబు = మిక్కిలితీక్షణమైనదై; పరుల్=ఇతరులు; కానరాక =కనబడకుండగ; ఒకడు=ఏకలుడు; ఐ = అయ్యి; వాక్ = మాటలకు; దృక్ = చూపులకు; అలభ్యుడు = అందనివాడు; ఐ = అయ్యి; హరి = విష్ణుడు; విభుండు = విష్ణుడు; ఒప్పారెన్ = ప్రసిద్ధముగ నుండెను; విశ్వాకృతిన్ = విశ్వ రూపము నందు.

భావము:- విశ్వరూపాన్ని ధరించిన త్రివిక్రముడు తన ఒక పాదముతో భూలోకాన్ని కప్పి, మొదటిఅడుగుగా స్వర్గలోకాన్ని దాటి రెండవ పాదముంచాడు. రెండవ అడుగుగా వేసిన పాదముతో పైలోకాలను అన్నింటినీ దాటిపోయాడు. ఆ మహారూపం పట్టకపోవడంవలన బ్రహ్మాండభాండం పైపెంకు పెటపెటలాడి బ్రద్దలైపోసాగింది. ఆయన తప్ప ఇంకెవరూ కనిపించకుండా పోయారు. ఆ విశ్వరూపుడు మాటలకు చూపులకు అందరానివాడై సంశోభించాడు.

8-626-ఆ.

ఒక పదంబు క్రింద నుర్వి పద్మము నంటి
కొన్న పంకలవము కొమరుఁ దాల్చెఁ;
నొకటి మీఁదఁ దమ్మి కొదిఁగిన తేఁటినా
వెలసె మిన్ను నృప! త్రివిక్రమమున.

టీక:- ఒక = ఒక; పదంబు = పాదము; క్రిందన్ = కింద; ఉర్వి = భూమండలము; పద్మమున్ = పద్మమునకు; అంటికొన్న = అంటుకొన్నట్టి; పంక = బురద; లవము = రేణువువలె; కొమరు = మనోజ్ఞతను; తాల్చెన్ = ధరించెను; ఒకటి = ఇంకొకదాని; మీదన్ = మీద; తమ్మి = పద్మమున; ఒదిగిన = వంగియున్న; తేటిన్ = తుమ్మెద; నా = వలె; వెలసె = ప్రకాశించెను; మిన్ను = ఆకాశము; నృపా = రాజా; త్రివిక్రమమున = విశ్వాకారమునందు.

భావము:- రాజా! విశ్వరూపంతో ఒకపాదం క్రింద ఉన్న భూమండలం పద్మానికి అంటుకున్న చిన్న బురద రేణువు వలె ఒప్పింది. ఇంకొక పాదం మీద ఉన్న ఆకాశం పద్మం మీద వ్రాలిన తుమ్మెదవలె ప్రకాశించింది.

8-627-వ.

తత్సమయంబున.

టీక:- తత్ = ఆ; సమయంబునన్ = సమయములో. భావము:- ఆసమయంలో.

. .

8-628-ఆ.

జగము లెల్ల దాఁటి చనిన త్రివిక్రము
చరణనఖర చంద్ర చంద్రికలను
బొనుఁగు పడియె సత్యమున బ్రహ్మతేజంబు
దివసకరుని రుచుల దివియ బోలె.

టీక:- జగములున్ = లోకములు; ఎల్లన్ = అన్నిటిని; దాటి = మించి; చనిన = పోయిన; త్రివిక్రమున్ = త్రివిక్రముని; చరణ = కాలి; నఖర = గోరులనెడి; చంద్ర = చంద్రుని; చంద్రికలను = వెన్నెలలను; పొనుగుపడియెన్ = వెలవెలబోయెను;

సత్యమునన్ = సత్యలోకములోని; బ్రహ్మ = బ్రహ్మదేవుని; తేజంబున్ = తేజస్సు; దివసకరుని = సూర్యుని; రుచులన్ = కాంతులందు; దివియన్ = దివిటీ, దీపము; పోలెన్ = వలె.

భావము:- అన్నిలోకాలనూ దాటిపోయిన త్రివిక్రముని కాలిగోళ్ళకాంతికి సత్యలోకంలోని బ్రహ్మ తేజస్సు సూర్యునిముందు దివిటీ వలె వెలవెల పోయింది.

8-629-సీ.

భవబంధములఁ బాసి బ్రహ్మలోకంబునఁ-
    గాపురంబులు చేయు ఘనులు రాజు
లా మరీచ్యాదులు, నా సనందాదులు-
    నా దివ్యయోగీంద్రు లచట నెపుడు
మూర్తిమంతంబులై మ్రోయు పురాణ త-
    ర్కామ్నాయ నియమేతిహాస ధర్మ
సంహితాదులు గురుజ్ఞానాగ్నినిర్దగ్ధ-
    కర్ములై మఱియును గలుగునట్టి

8-629.1-తే.

వార లెల్లఁ జొచ్చి వచ్చి సర్వాధిపు
నంఘ్రిఁ జూచి మ్రొక్కి రధిక భక్తిఁ
దమ మనంబు లందుఁ దలచు నిధానంబుఁ
గంటి మనుచు నేఁడు మంటి మనుచు.

టీక:- భవ = సంసార; బంధములన్ = బంధములను; పాసి = వదలి; బ్రహ్మలోకమునన్ = సత్యలోకమునందు; కాపురంబులుచేయు = నివాసము ఉండెడి; ఘనులు = గొప్పవారు; రాజులు = రాజులు; ఆ = ఆ; మరీచి = మరీచి; ఆదులున్ = మున్నగువారు; ఆ =ఆ; సనంద = సనందుడు; ఆదులున్ = మున్నగువారు; ఆ = ఆ; దివ్యయోగీంద్రుల్ = దేవర్షులు; అచటన్ = అక్కడ; ఎపుడున్ = ఎప్పుడు; మూర్తిమంతంబులు = రూపుదాల్చినవి; ఐ = అయ్యి; మ్రోయు = మారుమోగెడి; పురాణ = పురాణములు {పురాణము - పురాతన చరిత్రము, 1సర్గ (సృష్టి) 2ప్రతిసర్గ (ప్రతిసృష్టి)

3(మను)వంశము 4మన్వంతరము 5వంశానుచరితము అను పంచలక్షణములు కలవి ఇవి 18}; తర్క = తర్కశాస్త్రములు {తర్కము - శాస్త్రములు (నియమన గ్రంథములు) ఆరింటిలోనిది, 1తర్కము 2వ్యాకరణము 3ధర్మము 4మీమాంస 5వైద్యము 6జ్యోతిషము}; ఆమ్నాయ = వేదములు; నియమ = నియమము {నియమము - అష్టాంగయోగములలోని శరీరముకంటెభిన్నమైన మృజ్జలా దులు సాధనములుగా కలిగి నిత్యముగా ఆచరింపదగిన ఒక యోగాంగము (ఇది దశవిధము - 1తపము 2సంతోషము 3ఆస్తికత్వము 4దానము 5భగవదర్చన 6వేదాంతశ్రవణము 7లజ్జ 8మతి 9జపము 10వ్రతము}; ఇతిహాస = ఇతిహాసములు {ఇతిహాసము - పూర్వము జరిగిన కథ, రామాయణ భారతములు}; ధర్మ = ఉపనిషత్తులు; సంహిత = వేదాంగములు; ఆదులున్ = మొదలగునవాని; గురు = గొప్ప; జ్ఞాన = జ్ఞానము యనెడి; అగ్నిన్ = అగ్నిలో; నిర్దగ్ధ = పూర్తిగా కాలిపోయిన; కర్ములు = కర్మవాసనలు కలవారు; ఐ = అయ్యి; మఱియును = అతిశయించి; కలుగునట్టి = ఉండెడి.

వారలు = వారు; ఎల్లన్ = అందరును; చొచ్చి = తోసుకు; వచ్చి = వచ్చి; సర్వాధిపున్ = విష్ణుని; అంఘ్రిన్ = పాదములను; చూచి = దర్శించుకొని; మ్రొక్కిరి = నమస్కరించిరి; అధిక = మిక్కిలి; భక్తిన్ = భక్తితోటి; తమ = వారియొక్క; మనంబులన్ = మనసుల; అందున్ = లో; తలచు = భావించెడి; నిధానంబున్ = పెన్నిధిని; కంటిమి = దర్శించితిమి; అనుచున్ = అనుకొనుచు; నేడున్ = ఇవాళ; మంటిమి = ధన్యులమైతిమి; అనుచున్ = అనుకొనుచు.

<u>భావము</u>:- సంసారబంధాలను త్రెంచుకొని మోక్షాన్ని పొంది బ్రహ్మ లోకంలో నివాసం చేస్తున్న మహారాజులు మరీచీ మొదలైన వారూ; సనందుడూ మొదలైన దేవర్షులూ; అక్కడ ఎప్పుడూ ఆకారం ధరించి మారుమ్రోగుతుండే పురాణాలూ, తర్కశాస్త్రాలూ, వేదాలూ, వేదాంగాలు, ఇతిహాసాలూ, ధర్మశాస్త్రాలూ; మహజ్ఞానులైన పుణ్యాత్ములూ మున్నగువారు అందరూ ఆ సర్వనియంత అయిన మహావిష్ణువు పాదాన్ని దర్శించారు. ఆ పాదానికి మిక్కిలి భక్తితో మ్రొక్కారు. మనస్సులలో “మేము భావిస్తున్న పెన్నిధీ కనిపించింది. ఈనాడు మేము ధన్యులం అయ్యాము.” అనుకున్నారు.

8-630-మ.

తనపుట్టిల్లిదె పొమ్మటంచు నజుఁడుం దన్నాభిపంకేరుహం
బు నిరీక్షించి నటించి యున్నత పదంబుం జూచి తత్పాదసే
చనముం జేసెఁ గమండలూదకములం జల్లించి; తత్తోయముల్
వినువీథిం బ్రవహించె దేవనదినా విశ్వాత్ముకీర్తిప్రభన్.

టీక:- తన = తన యొక్క; పుట్టిల్లు = జన్మస్థానము; ఇదె = ఇదె; పొమ్ము = సుమా; అంచున్ = అనుచు; అజుడు = బ్రహ్మదేవుడు; తత్ = అతని; నాభి = బొడ్డు; పంకేరుహంబున్ = తమ్మిని; నిరీక్షించి = చూసి; నటించి = మిక్కిలి సంతోషించి; ఉన్నత = ఉన్నతమైన; పదంబున్ = పాదములను; చూచి = చూసి; తత్ = అతని; పాద = పాదములను; సేచనమున్ = చిలకరించుట, జల్లుట, తడపుట {సేచన - నైష్ఠిక కర్మలలో మంత్రోదకాన్ని చిలకరించుట, చల్లుట, తడుపుట, ఇది ప్రోక్షణ, అవోక్షణ, అభ్యుక్షణ అని మూడు విధములు}; చేసెన్ = చేసెను; కమండలు = కమండలములోని; ఉదకములన్ = నీటిని; చల్లించి = చల్లి; తత్ = ఆ; తోయముల్ = నీరు; వినువీథిన్ = ఆకాశమునందు; ప్రవహించెన్ = పారినవి; దేవనదిన్ = ఆకాశగంగ; నా = అనబడుతు; విశ్వాత్మున్ = విష్ణుమూర్తి; కీర్తి = యశస్సు యనెడి; ప్రభన్ = కాంతులై.

భావము:- మహావిష్ణువు బొడ్డు తామరను చూసి “నా జన్మస్థానం ఇదే సుమా!” అనుకుంటూ అజుడు అయిన బ్రహ్మదేవుడు సంతోషించాడు. మహోన్నతమైన ఆ పాదాన్ని దర్శించుకున్నాడు. తన కమండల జలంతో స్వామి పాదాన్ని కడిగాడు. ఆ జల్లించిన జలధారలు కీర్తికాంతితో నిండి ఆకాశంలో దేవనదిగా ప్రవహించాయి.

8-631-వ.

తత్సమయంబున.

టీక:- తత్ = ఆ; సమయంబునన్ = సమయమునందు.

భావము:- ఇంకా ఆ సమయంలో . . .

8-632-సీ.

యోగమార్గంబున నూహించి బహువిధ-
    పుష్పదామంబులఁ బూజ చేసి
దివ్యగంధంబులుఁ దెచ్చి సమర్పించి-
    ధూపదీపములఁ దోడ్తోడ నిచ్చి
భూరి లాజాక్షతంబులు జల్లి ఫలములుఁ-
    గానిక లిచ్చి రాగములఁ బొగడి
శంఖాదిరవములు జయఘోషములుఁ జేసి-
    "కరుణాంబునిధి! త్రివిక్రమ!" యటంచు

8-632.1-ఆ.

బ్రహ్మ మొదలు లోకపాలురుఁ గొనియాడి;
రెల్ల దిశల వనచరేశ్వరుండు
జాంబవంతుఁ డరిగి చాటె భేరిధ్వని
వెలయఁ జేసి విష్ణు విజయ మనుచు.

టీక:- యోగమార్గంబునన్ = దివ్యదృష్టితో; ఊహించి = ఊహించి; బహు = అనేకమైన; విధ = రకములైన; పుష్పదామంబులన్ = పూలమాలలతో; పూజచేసి = పూజించి; దివ్య = మేలైన; గంధంబులున్ = సుగంధద్రవ్యములను; తెచ్చి = తీసుకొని వచ్చి; సమర్పించి = సమర్పించి; ధూపదీపములన్ = ధూపదీపములను; తోడ్తోడన్ = వెంటవెంటనే; ఇచ్చి = ఇచ్చి; భూరి = అధికముగా; లాజ = పేలాలు; అక్షతలున్ = అక్షింతలు; చల్లి = వేసి; ఫలము లన్ = పండ్లు; కానికలు = కానుకలు; ఇచ్చి = సమర్పించి; రాగములన్ = రాగ యుక్తముగా; పొగడి = కీర్తించి; శంఖ = శంఖములు; ఆది = మున్నగు; రవములు = శబ్దములు; జయ = జయజయయనెడి; ఘోషములున్ = నాదములు; చేసి = చేసి; కరుణాంబునిధి = దయాసాగరుడా; త్రివిక్రమ = త్రివిక్రముడా; అట = అని; అంచున్ = అనుచు.

బ్రహ్మ = బ్రహ్మదేవుడు; మొదలు = మొదలగు; లోకపాలురు = లోకపాలకులు; కొనియాడిరి = కీర్తించిరి; ఎల్లన్ = అన్ని; దిశలన్ = వైపులను; వనచర = భల్లూకము;

ఈశ్వరుండు = రాజు; జాంబవంతుడు = జాంబవంతుడు; అరిగి = వెళ్ళి; చాటె = చాటింపువేసెను; భేరి = బాజాల; ధ్వని = చప్పుడు; వెలయన్ = ప్రసిద్ధముగ; చేసి = చేసి; విష్ణు = విష్ణుమూర్తి; విజయము = జయము జయము; అనుచు = అనుచు.

భావము:- యోగమార్గంలో ఊహించి బ్రహ్మదేవుడు మున్నగు లోకపాలకులు మహా విష్ణువును అనేక రకాలైన పూలమాలలతో పూజలు చేసారు; మేలైన సుగంధ ద్రవ్యాలను, ధూపదీపాలనూ సమర్పించారు; అనంతమైన పేలాలనూ అక్షతలనూ చల్లారు; ఫలాలూ కానుకలూ పెట్టారు; సంతోషంతో కీర్తించారు; శంఖాలు మున్నగువాటిని ఊదారు; జయజయ నాదాలు చేసారు; కరుణాసముద్రా! త్రివిక్రమదేవా! అని కొనియాడారు; భల్లూకరాజైన జాంబవంతుడు అన్ని దిక్కులమ్మటా ఢంకా మ్రోగిస్తూ విష్ణుదేవుని విజయాన్ని చాటాడు.

8-633-క.

**అన్ని జగంబులఁ దానై**
**యున్న జగన్నాథుఁ జూడ నొగి భావింపం**
**గన్నందక మన మందక**
**సన్నుతులం జేసి రపుడు సభ్యులు బలియున్.**

టీక:- అన్ని = సర్వ; జగంబులున్ = లోకములు; తాను = తానే; ఐ = అయ్యి; ఉన్న = ఉన్నట్టి; జగన్నాథున్ = విష్ణుని; చూడన్ = చూచుటకు; ఒగిన్ = సరిగా; భావింపన్ = భావించుటకు; కన్నందక = కంటికందక; మనమందక = మనసునకందక; సన్నుతులన్ = స్తోత్రములను; చేసిరి = చేసితిరి; అపుడు = అప్పుడు; సభ్యులు = సభలోనివారు; బలియున్ = బలిచక్రవర్తి.

భావము:- అన్నిలోకాలలోనూ వ్యాపించి నిండిన భగవంతుణ్ణి కంటితో చూడడానికి కానీ, మనసుతో ఊహించడానికి కానీ వీలుకాక బలిచక్రవర్తి, ఆ సభలోని వారూ చక్కటి స్తోత్రాలు చేసారు.

## దానవులు వామనుపై కెళ్ళుట

8-634-వ.

అంత నొయ్యన పూర్వప్రకారంబున వామనాకారంబు వహించి యున్న వామనునిం గని "పదత్రయ వ్యాజంబున నితండు సకల మహీ మండలంబు నాక్రమించె కపటవటురూప తిరోహితుండగు విష్ణుండనియెఱుంగక మన దానవేంద్రుఁడు సత్యసంధుండు గావున మాటఁ దిరుగక యిచ్చె నతని వలన నేరంబు లేదు ఈ కుబ్జుం డప్రతిహత తేజఃప్రభావంబున సజ్జకట్టుగా నిజ్జగంబులం బరిగ్రహించి, పర్జన్యాదులకు విసర్జనంబుచేయందలంచి యున్నవాఁ, డీ పాఱునిం దూఱి పాఱనీక నిర్జించుటఁ గర్జం"బని తర్జనంబులును గర్జనంబు లునుఁ జేయుచు, వజ్రాయుధాదిమరుజ్జేతలగు హేతిప్రహేతి విప్రచిత్తి ముఖ్యులయిన రక్కసులు పెక్కం డ్రుక్కుమిగిలి యుద్ధంబునకు సన్నిద్ధులై పరశు పట్టిస భల్లాది సాధనంబులు ధరియించి కసి మెసంగి ముసరికొని దశదిశలఁ బ్రసరించినఁ జూచి హరిపరిచరులు సునంద నంద జయ జయంత విజయ ప్రబలోద్బల కుముద కుముదాక్ష తార్క్ష్య పుష్పదంత విష్వక్సేన శ్రుతదేవ సాత్వత ప్రముఖులగు దండనాథు లయుత వేదండ సముద్దండ బలులుఁ దమతమ యూథంబుల నాయుధంబులతోడం గూర్చుకొని దానవా నీకంబులం బరలోకంబున కనుచువారలై వారల నెదుర్కొని కదనం బునకున్ బరవసంబు చేయుచున్నం గనుంగొని శుక్రు శాపంబుఁ దలంచి దనుజ వల్లభుం డిట్లనియె.

టీక:- అంతన్ = అంతట; ఒయ్యన్ = మెల్లగ; పూర్వ = ఇంతకుముందు; ప్రకారంబునన్ = వలెనె; వామన = వామనుని; ఆకారంబున్ = రూపును; వహించి = ధరించి; ఉన్నన్ = ఉండగా; వామనునిన్ = వామనుని; కని = చూసి; పదత్రయంబు = మూడడుగులు; వ్యాజంబునన్ = నెపంతో; ఇతండు = ఇతడు; సకల = సమస్తమైన; మహీ = భూ; మండలం బున్ = మండలమును; ఆక్రమించెన్ = ఆక్రమించెను; కపట = మాయా; వటు = బ్రహ్మచారి; రూప = రూపమున; తిరోహితుండు = మారువేషమున నున్న వాడు; అగు=అయిన; విష్ణుండు = విష్ణువు; అని = అని; ఎఱుంగక = తెలియక; మన = మనయొక్క; దానవేంద్రుడు = రాక్షసరాజు; సత్యసంధుండు = సత్యవాది; కావున = కనుక; మాట = ఇచ్చినమాట; తిరుగక = వెనుతిరుగక; ఇచ్చెన్ = దానమిచ్చెను; అతని = అతని; వలన = వలన; నేరంబు = తప్పు; లేదు = లేదు; ఈ = ఈ; కుబ్జుండు = వామనుడు; అప్రతిహత = తిరుగులేని; తేజస్ = మహిమయొక్క; ప్రభావంబునన్ = ప్రభావమువలన; సజ్జకట్టుగాన్ = సిద్ధముగ; ఈ = ఈ; జగంబులన్ = లోకములను; పరిగ్రహించి = తీసుకొని; పర్జన్య = ఇంద్రుడు {పర్జన్యుడు – పృషు – వర్షణే – పృష + అన్య – జః అంతాదేశః, కృ.ప్ర., 1. వాన కురిపించువాడు, 2. భక్తుల కోరికలను వర్షించు వాడు., ఇంద్రుడు}; ఆదుల్ = మున్నగువారల; కిన్ = కు; విసర్జనంబు = ఇచ్చివేయుట; చేయన్ = చేయవలెనని; తలంచి = అనుకొనుచు; ఉన్నవాడు = ఉన్నాడు; ఈ = ఈ; పాఱునిన్ = బ్రాహ్మణుని; తూఱి = తప్పించుకొని; పాఱనీక = పారిపోనీయక; నిర్జించుట = సంహరించుట; కర్జంబు = చేయవలసినపని; అని = అని; తర్జనంబులునున్ = వేలెత్తిబెదిరించుటలు; గర్జనంబులును = కేకలేయుటలు; చేయుచున్ = చేయుచు; వజ్రాయుధ = ఇంద్రుడు; ఆది = మున్నగు; మరుత్ = దేవతలను {మరు త్తులు - సప్తసప్త సంఖ్య లగు వేల్పులు}; జేతలు = జయించినవారు; అగు = అయిన; హేతి = హేతి; ప్రహేతి = ప్రహేతి; విప్రచిత్తి = విప్రచిత్తి; ముఖ్యులు = మున్నగువారు; అయిన = ఐన; రక్కసులున్ = రాక్షసులు; పెక్కండ్రు = అనేకమంది; ఉక్కుమిగిలి = పరాక్రమించి; యుద్ధంబున్ = యుద్ధముచేయుట; కున్ = కు; సన్నధులు = సిద్ధపడిన వారు; ఐ = అయ్యి; పరశు = గండ్రగొడ్డలి; పట్టిస = అడ్డకత్తులు; భల్ల = బల్లెములు; ఆది = మున్నగు; సాధనంబులున్ = ఆయుధములు; ధరియించి = ధరించి; కసిమెసంగి = చెలరేగి; ముసురికొని = మూగి; దశదిశలన్ = అన్నివైపులనుండి; ప్రసరించినన్ = వ్యాపించు చుండగ; చూచి = చూచి; హరి = విష్ణుని; పరిచరులు = దూతలు; సునంద = సునందుడు; నంద = నందుడు; జయ = జయుడు; జయంత = జయంతుడు; విజయ = విజయుడు; ప్రబల = ప్రబలుడు; ఉద్బల = ఉద్బలుడు; కుముద = కుముదుడు; కుముదాక్ష = కుముదాక్షుడు; తార్క్ష్య =

తార్క్ష్యుడు; పుష్పదంత = పుష్పదంతుడు; విష్వక్సేన = విష్వక్సేనుడు; శ్రుతదేవ = శ్రుతదేవుడు; సాత్వత = సాత్వతుడు; ప్రముఖులు = మొదలైన వారు; అగు = అయిన; దండనాథులు = సేనానాయకులు; అయుత = పదివేల; వేదండ = ఏనుగులతో; సమ = సమానమైన; ఉద్దండ = అధికమైన; బలులు = బలములు కలవారు; తమతమ = వారివారి; యూథంబులన్ = సేనలను; ఆయుధంబుల్ = ఆయుధములు; తోడన్ = తోపాటు; కూర్చుకొని = కూడగొట్టుకొని; దానవ = దానవుల; అనీకంబుల్ = సైన్యములను; అంబర = పై; లోకంబుల్ = లోకముల; కున్ = కు; అనుచు = పంపెడి; వారలు = వారు; ఐ = అయ్యి; వారల్ = వారిని; ఎదుర్కొని = ఎదుర్కొని; కదనంబున్ = యుద్ధమున; కున్ = కు; పరవసంబున్ = ఉత్సహించుట; చేయుచున్న = చేయుచుండగా; కనుంగొని = చూసి; శుక్రు = శుక్రుని; శాపంబున్ = శాపమును; తలంచి = గుర్తుచేసుకొని; దనుజ = రాక్షస; వల్లభుండు = చక్రవర్తి; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- అటు పిమ్మట విష్ణువు మరల తన వామనరూపాన్ని ధరించాడు. హేతి ప్రహేతి విప్రచిత్తి మొదలైన రాక్షసులు ఇంద్రుడు మొదలగు దేవతలను గెలిచిన వీరులు. అంతటి ఆ రాక్షస వీరులు "ఇతడు మూడడుగుల నెపంతో ప్రపంచమంతా ఆక్రమించుకున్నాడు. మాయతో బ్రహ్మచారి రూపాన్ని పొందిన విష్ణువు అని తెలియక మన రాజు ఆడినమాట తప్పకుండా దానమిచ్చాడు. బలిచక్రవర్తి వద్ద తప్పు లేదు. ఈ పొట్టివాడు ఎదురులేని మహిమతో లోకాలను స్వాధీనం చేసుకున్నాడు. వీటిని ఇంద్రుడు మున్నగువారికి ఇచ్చేస్తాడు. ఈ బ్రహ్మచారి తప్పించుకొని పారిపోకుండా పట్టి చంపేయాలి." అంటూ బెదిరిస్తూ కేకలు వేస్తూ యుద్ధానికి సిద్ధం అయ్యారు. గండ్రగొడ్డళ్ళూ, అడ్డకత్తులూ, ఈటెలూ మొదలైన ఆయుధాలు ధరించి, చెలరేగి అన్నివైపులా మూగారు. అదంతా చూసి విష్ణుసేవకులైన సునందుడూ, నందుడూ, జయుడూ, జయంతుడూ, విజయుడూ, ప్రబలుడూ, ఉద్బలుడూ, కుముదుడూ, కుముదాక్షుడూ, గరుడుడూ, పుష్పదంతుడూ, విష్వక్సేనుడూ, శ్రుతదేవుడూ, సాత్వతుడూ మొదలైన సేనాపతులు పదివేల ఏనుగుల బలంతోచొప్పున గల తమతమ సైన్యాలనూ ఆయుధాలనూ సమకూర్చుకున్నారు. యుద్ధంలో రాక్షస సైన్యాలను ఎదిరించి తుదముట్టించడానికి ఉత్సాహంతో సిద్ధపడ్డారు. అప్పుడు బలి శుక్రాచార్యుని శాపాన్ని గుర్తు తెచ్చుకొని రాక్షసులతో ఇలా అన్నాడు.

8-635-సీ.

"రాక్షసోత్తములార! రండు పోరాడక-
    కాలంబు గాదిది కలహమునకు;
సర్వభూతములకు సంపదాపదలకు-
    బ్రభుపైన దైవంబుఁ బరిభవింప
మన మోపుదుమె? తొల్లి మనకు రాజ్యంబును-
    సురలకు నాశంబు సొరిది నిచ్చి
విపరీతముగఁ జేయు వేల్పు నే మందము-
    మనపాలి భాగ్యంబు మహిమ గాక;

8-635.1-తే.

వెఱచి పలుమాఱుఁ బాఱెడి విష్ణుభటులు
మిమ్ము నెగచుట దైవంబు మేర గాదె?
మనకు నెప్పుడు దైవంబు మంచిదగును
నాఁడు గెలుతుము పగవారి నేఁడు వలదు.

టీక:- రాక్షస = రాక్షసులలో; ఉత్తములారా = ఉత్తములు; రండు = వెనుకకి వచ్చేయండి; పోరాడక = యుద్ధముచేయకుండ; కాలంబు = తగుసమయము; కాదు = కాదు; ఇది = ఇది; కలహమున్ = యుద్ధమున; కున్ = కు; సర్వ = సమస్తమైన; భూతముల్ = జీవుల; కున్ = కు; సంపద = కలిసివచ్చుటకు; ఆపదలకు = దుఃఖముల; కున్ = కు; ప్రభువు = అధిదేవత; ఐన = అయిన; దైవంబున్ = దేవుని; పరిభవింపన్ = ఓడించుటకు; మనము = మనము; ఓపుదుమె = సరిపోగలమా, సరిపోము; తొల్లి = ఇంతకుముందు; మన = మన; కున్ = కు; రాజ్యంబునున్ = రాజ్యమును; సురల్ = దేవతల; కున్ = కు; నాశంబున్ = చేటును; సొరిదిన్ = క్రమముగా; ఇచ్చి = ఇచ్చి; విపరీతముగన్ = దానికి వ్యతిరేకముగా; చేయు = చేసెడి; వేల్పున్ = దేవుని; ఏమందము = ఏమనగలము; మన = మన; పాలి = పాలిటి; భాగ్యంబు = యొక్క; మహిమ = ఫలమును; కాక = తప్పించి.

వెఱచి = భయపడి; పలుమాఱు = అనేకసార్లు; పాఱెడి = పారిపోయెడి; విష్ణు = నారాయణుని; భటులు = సైనికులు; మిమ్మున్ = మిమ్ములను; ఎగచుట = ఎదిరించుట; దైవంబు = దేవునియొక్క; మేర = ఏర్పాటు ప్రకారము; కాదె = కాదా, అవును; మన = మన; కున్ = కు; ఎప్పుడు = ఎప్పుడు; దైవంబు = అదృష్టము; మంచిది = అనుకూలము; అగును = అగునో; నాడు = అప్పుడు; గెలుతుము = నెగ్గెదము; పగవారి = శత్రువును; నేడున్ = ఈరోజు; వలదు = వద్దు.

భావము:- “ఓ రాక్షసవీరులారా! ఆగండి! యుద్ధానికి వెళ్ళకండి. మనకు ఇది సమయం కాదు. సర్వప్రాణుల సుఖాలకూ దుఃఖాలకూ అధికారియైన దేవుని ఓడించడం మన వల్ల కాదు. మొదట మనకు రాజ్యాన్ని ఇచ్చాడు. దేవతలకు చేటు కలిగించాడు. ఇప్పుడు దానికి వ్యతిరేకంగా చేసాడు. అటువంటి దేవుని ఏమనగలము. ఇదే మన అదృష్టఫలం. అనేక సార్లు భయపడి పారిపోయిన విష్ణుసేవకులు ఇప్పుడు మిమ్మల్ని ఎదిరించడం దైవనిర్ణయం. మనకు అదృష్టం అనుకూలించినప్పుడు శత్రువులను జయిద్దాము. ఇప్పుడు వద్దు.

8-636-వ.

## అదియునుం గాక.

టీక:- అదియునున్ = అంతే; కాక = కాకుండ. భావము:- అంతేకాక . . .

8-637-క.

## పలుదుర్గంబులు సచివులు
## బలములు మంత్రౌషధములు బహు శేముషియుం
## గలిగియు సామోపాయం
## బులఁగాల మెఱింగి నృపుడు పోరుట యొప్పున్.

టీక:- పలు = అనేక; దుర్గంబులు = కోటలు; సచివులు = మంత్రులు; బలములు = సేనలు; మంత్ర = మంత్రాంగములు; ఔషధములు = ఔషధములు; బహు = మిక్కిలి; శేముషియున్ = యశస్సు; కలిగియున్ = ఉండికూడ; సామోపాయంబులన్ = అనుకూల వర్తనలద్వారా {సామోపాయము - అనుకూలప్రవర్తన, పంచతంత్రములలోనిది, ఇది అయిదు విధములు 1పరస్పరోపాకారము కనిపింపజేయుట 2మంచితనము 3గుణము లను కొనియాడుట 4సంబంధములునెరపుట 5నేను నీవాడనని మంచిమాట లాడుట}; కాలమున్ =

సమయము; ఎఱింగి = తెలిసికొని; నృపుండు = రాజు; పోరుట = యుద్ధము చేయుట; ఒప్పున్ = సరియైనపని.

భావము:- రాజైనవాడు ఎంతటి కోటలూ, మంత్రులూ, సైన్యాలూ, మంత్రాలూ, ఔషధాలూ, తెలివితేటలూ ఉన్నప్పటికీ కాలాన్ని గమనించి ఓర్పుతో ఉపాయంతో యుద్ధం చేయడమే సరైన పని.

## బలిని బంధించుట

8-638-వ.

**అట్లు గావున రణంబున శత్రుల కిప్పు డెదురు మోహరించుట కార్యంబుఁ గాదు; మనకుం దగు కాలంబున జయింతము; నలంగక తొలంగుం” డనినదలంగి భాగవతభటభీతులై చిక్కి రక్క సులు రసాతలంబునకుం జని; రంత హరి హృదయం బెఱింగి తార్క్షనందనుండు యాగసుత్యాహంబున వారుణ పాశంబుల నసురవల్లభుని బంధించె; నంత.**

టీక:- అట్లుగావున = అందుచేత; రణంబునన్ = యుద్ధమునందు; శత్రుల్ = శత్రువుల; కున్ = కు; ఇప్పుడు = ఇప్పుడు; ఎదురు = ఎదురునిల్చి; మోహరించుట = వ్యూహములు పన్నుట; కార్యంబు = తగినపని; కాదు = కాదు; మన = మన; కున్ = కు; తగు = తగినట్టి; కాలంబునన్ = కాలంకలిసివచ్చి నప్పుడు; జయింతము = గెలిచెదము; నలంగక = అనవసరశ్రమ పడక; తొలంగుడు = తప్పుకొనుడు; అనినన్ = అనగా; తలంగి = తప్పుకొని; భాగవత = భగవంతుని, విష్ణు; భట = భటుల యెడ; భీతులు = భయపడువారు; ఐ = అయ్యి; చిక్కి = తగ్గి; రక్కసులున్ = రాక్షసులు; రసాతలంబున్ = రసాతలమున; కున్ = కు; చనిరి=వెళ్ళిరి; అంతన్=అప్పుడు; హరి=విష్ణుని; హృదయంబున్ = మనసు; ఎఱింగి = తెలిసికొని; తార్క్షనందనుండు = గరుడుడు {తార్క్షనందనుడు - తార్క్ష ని (కశ్యపుని) కొడుకు, గరుడుడు}; యాగసుత్య = యాగముచివర సుత్య చేసెడి {సుత్య -స్నానము, సోమ లతను కొట్టి పిడుచుట, సోమపానము}; అహంబునన్ = దినమున; వారుణ పాశంబులన్= వరుణ

పాశములతో; అసురవల్లభుని = బలిచక్రవర్తిని; బంధించెను = బంధించెను; అంత = అంతట.

భావము:- కనుక, ఇప్పుడు శత్రువులతో యుద్ధానికి పూనుకోవడం తగదు. మనకు అనుకూలమైన సమయంలో గెలువవచ్చు. అనవసరంగా శ్రమపడకుండా తొలగిపొండి.” అని బలిచక్రవర్తి చెప్పాడు. అప్పుడు విష్ణుభక్తులకు భయపడి రాక్షసులు రసాతలానికి వెళ్ళి పోయారు. అటుపిమ్మట యాగంలో సోమపానంచేసే చివరి దినాన విష్ణువు అభిప్రాయాన్ని తెలుసుకుని గరుడుడు బలిచక్రవర్తిని వరుణపాశాలతో బంధించాడు.

8-639-క.



**బాహులుఁ బదములుఁ గట్టిన**
**శ్రీహరి కృపగాక యేమి జేయుదు నని సం**
**దేహింపక బలి నిలిచెను**
**హాహారవ మెసఁగె దశ దిగంతములందున్.**

టీక:- బాహులున్ = చేతులు; పదములున్ = కాళ్ళు; కట్టినన్ = కట్టివేసినను; శ్రీహరి = విష్ణునియొక్క; కృప = దయ; కాక = కాకుండగ; యేమి = ఏమి; చేయుదును = చేయ గలను; అని = అని; సందేహింపక = సంకోచములేకుండ; బలి = బలి; నిలిచెను = మౌనము వహించెను; హాహారవములు = హాహాకారములు; ఎసగెన్ = చెలరేగెను; దశదిగంతముల్ = అన్నివైపుల; అందున్ = లోను.

భావము:- చేతులూ కాళ్ళూ కట్టబడిన బలి చక్రవర్తి, ఇది విష్ణువు దయ దీనికి ఏమీ చేయలేను అనుకుంటూ, సంకోచం ఏమీ లేకుండా మౌనం వహించాడు. అన్నివైపులా హాహాకారాలు చెలరేగాయి.

8-640-క.

**సంపద చెడియును దైన్యము**
**గంపంబును లేక తొంటికంటెను బెంపుం**
**దెంపును నెఱుకయు ధైర్యము**
**వంపని సురవైరిఁ జూచి వటుఁ డిట్లనియెన్.**

టీక:- సంపద = ఐశ్వర్యము; చెడియును = నశించినను; దైన్యము = దీనత్వము; కంపంబునున్ = బెదురులు; లేక = లేకుండ; తొంటి = ఇంతకుముందు; కంటెను = కంటె; పెంపున్ = అతిశయము; తెంపు = తెగువ; ఎఱుకయున్ = జ్ఞానము; ధైర్యము = ధైర్యము; వంపని = తగ్గని; సురవైరిన్ = బలిచక్రవర్తిని; చూచి = చూసి; వటుడు = బ్రహ్మచారి; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- ఐశ్వర్యం నశించినా బలిచక్రవర్తి లో దీనత్వమూ కంపమూ కలుగలేదు. అంతే కాదు వెనుకటికంటే ఔన్నత్యమూ. తెగువా, జ్ఞానమూ, ధైర్యమూ అధికం అయ్యాయి. అప్పుడు బలిచక్రవర్తిని చూచి వామనుడు ఇలా అన్నాడు.

8-641-సీ.

“దానవ! త్రిపదభూతల మిత్తు నంటివి-
ధరణిఁ జంద్రార్కు లెందాఁక నుందు
రంత భూమియు నొక్క యడుగయ్యె నాకును-
స్వర్లోకమును నొక్క చరణమయ్యె;
నీ సొమ్ము సకలంబు నేఁడు రెండడుగులు-
గడమ పాదమునకుఁ గలదె భూమి?
యిచ్చెద నన్నర్థ మీని దురాత్ముండు-
నిరయంబు బొందుట నిజముగాదె?

8-641.1-తే.

కాన దుర్గతికినిఁ గొంత కాల మరుగు
కాక యిచ్చెదవేని వేగంబ నాకు
నిపుడ మూఁడవ పదమున కిమ్ముఁ జూపు
బ్రాహ్మణాధీనములు ద్రోవ బ్రహ్మవశమె?”

టీక:- దానవ = రాక్షసుడా; త్రిపద = మూడడుగుల; భూతలమున్ = భూభాగమును; ఇత్తున్ = ఇచ్చెదను; అంటివి = అన్నావు; ధరణిన్ = భూమిని; చంద్ర = చంద్రుడు; అర్కులు = సూర్యుడు; ఎందాక = ఎక్కడిదాక; ఉందురు = కనబడెదరో; అంత = అక్కడివరకు; భూమియున్ = భూమిని; ఒక్క = ఒకేఒక; అడుగు = అడుగు; అయ్యెన్

= అయినది; నా = నా; కునున్ = కు; స్వర్లోకమును = స్వర్గలోకము; ఒక్క = ఒకేఒక; చరణము = అడుగు; అయ్యెన్ = అయినది; నీ = నీ యొక్క; సొమ్ము = సంపద; సకలంబు = అంతా; రెండు = రెండు (2); అడుగులు = అడుగులు; కడమ = మిగిలిన; పాదమున్ = అడుగున; కున్ = కు; కలదె = ఉన్నదా; భూమి = నేల; ఇచ్చెదన్ = దానమిచ్చెదను; అన్న = అనిన; అర్థమున్ = సొమ్ము; ఈని = ఇయ్యనట్టి; దురాత్ముండు = దుష్టుడు; నిరయంబున్ = నరకమును; పొందుట = పొందుట; నిజము = సత్యము; కాదె = కాదా ఏమి.

కాన = కనుక; దుర్గతి = నరకమునకుపోవుట; కినిన్ = కి; కొంత = కొంత; కాలము = సమయము; అరుగున్ = పట్టును; కాక = అలాకాకుండగ; ఇచ్చెదవు = ఇచ్చెడివాడవు; ఏని = ఐతే; వేగంబ = శీఘ్రుమే; నా = నా; కున్ = కు; ఇపుడ = ఇప్పుడే; మూడవ = మూడవ (3); పదమున్ = అడుగున; కున్ = కు; ఇమ్ము = చోటు; చూపు = చూపుము; బ్రాహ్మణ = బ్రాహ్మణుల; అధీనములున్ = ఆధీనము కావలసిన వానిని; త్రోవన్ = కాదనుటకు; బ్రహ్మ = బ్రహ్మదేవునకైన; వశమె = సాధ్యమా, కాదు.

భావము:-“ఓదనుజేంద్రా! బలీ! మూడడుగుల నేల ఇస్తాను అన్నావు కదా. భూలోకమూ, సూర్య చంద్రుల దాకా ఉండే స్థలము నాకు ఒక అడుగుకి సరిపోయింది. స్వర్గలోకం ఒక అడుగుకి సరిపోయింది. నీ సంపద అంతా ఈనాడు రెండు అడుగులైంది. ఇక మూడవ అడుగుకు చోటెక్కడుంది. ఇస్తానన్న అర్థాన్ని ఇవ్వనివాడు నరకాన్ని పొందడం నిజమే కదా! అందువల్ల, నీకు కొంచెంసేపటిలో నరకం ప్రాప్తిస్తుంది. సందేహం లేదు. అలాకాకుండా మూడవ అడుగు ఇవ్వదలుచుకుంటే ఆచోటు నాకు చూపించు. బ్రాహ్మణులకు స్వాధీనం కావలసిన దానిని కాదనడానికి బ్రహ్మకు కూడా సాధ్యం కాదు.”

8-642-వ.

## అని యిట్లు వామనుండు పలుక సత్యభంగ సందేహ విషదిగ్ధ శల్య నికృత్త హృదయుం డయ్యును విషణ్ణుండుఁ గాక వైరోచని ప్రసన్న వదనంబుతోడఁ జిన్ని వ్రోడ వడుగున కి ట్లనియె.

టీక:- అని = అని; ఇట్లు = ఈ విధముగ; వామనుండు = వామనుడు; పలుకన్ = అనగా; సత్యభంగ = ఆడినమాట బోటగు ననెడి; సందేహ = అనుమానము యనెడి; విషత్ = విషము; దిగ్ధ = పూయబడిన; శల్య = బాణము; నికృత్త = గుచ్చుకొన్న; హృదయుండు = హృదయము కలవాడు; అయ్యును = అయినప్పటికిని; విషణ్ణుండు = దిగులుపడ్డవాడు; కాక = కాకుండ; వైరోచని = బలిచక్రవర్తి; ప్రసన్న = నిర్మలమైన;

వదనంబు = ముఖము; తోడన్ = తోటి; చిన్ని = వామనుడు; ప్రోడ = బుద్ధిశాలియైన; వడుగున్ = బ్రహ్మచారి; కిన్ = కి; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- ఇలా పలికిన వామనుడి మాటలు వినిన బలిచక్రవర్తికి సత్యభంగం అవుతుంది ఏమో అనేసందేహంకలిగింది. అది విషబాణంలా మనసును గాయపరచింది. అయినా అతడు దిగులుచెందకుండా ప్రసన్నమైన ముఖంతో బుద్ధిశాలి అయిన వామనుడితో ఇలా అన్నాడు.

*8-643-ఆ.

## "సూనృతంబుఁ గాని సుడియదు నా జిహ్వ
## బొంకఁజాల; నాకు బొంకు లేదు;
## నీ తృతీయపదము నిజము నా శిరమున
## నెలవు సేసి పెట్టు నిర్మలాత్మ!

టీక:- సూనృతంబు = సత్యమైనదానిని; కాని = తప్పించి; సుడియదు = పొడచూపదు; నా = నా యొక్క; జిహ్వాన్ = నాలుక యందు; బొంకజాల = అబద్ధము చెప్పలేను; నా = నా; కున్ = అందు; బొంకు = అసత్యము; లేదు = లేదు; నీ = నీ యొక్క; తృతీయ = మూడవ (3); పదమున్ = అడుగును; నిజమున్ = తథ్యముగా; నా = నా యొక్క; శిరమునన్ = తలపైన; నెలవు = వసించునట్లు; చేసి = చేసి; పెట్టు = పెట్టుము; నిర్మల = స్వచ్ఛమైన; ఆత్మ = మనసు కలవాడా.

భావము:- ఓ పుణ్యాత్ముడా! సత్యం కానిది నా నాలుకమీద పుట్టనే పుట్టదు. అబద్ధ మన్నది చెప్పనే చెప్పలేను. నాలో అసత్య మన్నది లేదు. నీ మూడవ అడుగు శాశ్వతంగా నా తలమీద పెట్టు మహాత్మా!

మూడడుగులు దానంగా గ్రహించిన, వామనుడు త్రివిక్రమావతారం ధరించి రెండు అడుగులలో మొత్తం ముల్లోకాలు ఆక్రమించాడు. మూడో అడుగు ఎక్కడ పెట్టమన్నావు చూపించమన్నాడు. పరమ దానశీలుడు, సత్యసంధుడు అయిన బలిచక్రవర్తి 'నీ పాదం నా తలమీద పెట్టు పరమేశా!' అని ఇలా సమాధానం చెప్తున్నాడు.

*8-644-ఆ.

నిరయమునకుఁ బ్రాప్త నిగ్రహంబునకును
బదవిహీనతకును బంధనమున
కర్థ భంగమునకు నఖిల దుఃఖమునకు
వెఱవ దేవ! బొంక వెఱచినట్లు.

టీక:- నిరయమున్ = నరకమున; కునున్ = కు; ప్రాప్త = కలిగిన; నిగ్రహంబున్ = చెఱపట్ట బడుటకు; కునున్ = కు; పద = పదవి; విహీనత = పోవుట; కునున్ = కు; బంధనమున్ = బంధింపబడుట; కున్ = కు; అర్థ = సంపదల; భంగమున్ = నశించినందుల; కునున్ = కు; అఖిల = సమస్తమైన; దుఃఖమున్ = దుఃఖముల; కున్ = కు; వెఱవన్ = బెదరను; దేవ = భగవంతుడా; బొంక = అబద్ధమాడుటకు; వెఱచిన్ = బెదరెడి; అట్లు = విధముగా.

భావము:- భగవాన్! నరకానికి పోడం కన్నా, శిక్షింపపడటం కన్నా, ఉన్నతమైన పదవి పోడం కన్నా, బంధింపబడటం కన్నా, సర్వ సంపదలు నశించటం కన్నా, కష్టాలు అన్నీ రావడం కన్నా కూడ అసత్యం చెప్పడానికే ఎక్కువ భయపడతాను సుమా.

8-645-వ.

అదియునుం గాక.

టీక:- అదియునున్ = అంతే; కాక = కాకుండగ. భావము:- అంతే కాకుండా . . . .

8-646-సీ.

తల్లిదండ్రులు నన్నదమ్ములు చెలికాండ్రు-
గురువులు శిక్షింపఁ గొఱతపడునె?
పిదప మేలగుఁ గాక; పృథుమదాంధులకును-
దానవులకు మాకుఁ దఱియెఱింగి
విభ్రంశచక్షువు వెలయ నిచ్చుటఁ జేసి-
గురువులలోనాదిగురువ వీవ;

నీవు బంధించిన నిగ్రహమో లజ్జ-
యో నష్టియో బాధయో తలంప

8-646.1-తే.

నిన్ను నెదిరించి పోరాడి నిర్జరాదు
లాదియోగీంద్రు లందెడు నట్టి టెంకి
నందరే తొల్లి పెక్కండ్రు? హర్షమూర్తి!
యీశ! నీ యెడ దుర్లభ మేమి కలదు?

టీక:- తల్లిదండ్రులున్ = అమ్మనాన్నలు; అన్నదమ్ములున్ = సోదరులు; చెలికాండ్రు = స్నేహితులు; గురువులు = గురువులు; శిక్షింపన్ = దండించినచో; కొఱతపడునె = నష్టం కలుగునా, కలుగదు; పిదపన్ = ఆ తరువాత; మేలు = మంచి; అగుగాక = అయితీరును; పృథు = అతిమిక్కిలి; మద = గర్వముచేత; అంధులు = గుడ్డియైనవారల; కునున్ = కు; దానవుల్ = రాక్షసుల; కున్ = కు; మా = మా; కున్ = కు; తఱి = తగిన సమయము; ఎఱింగి = తెలిసికొని; విభ్రంశచక్షువున్ = కనిపించనికళ్ళకు; వెలయన్ = వెలుగెడి చూపును; ఇచ్చుటన్ = ఇచ్చుట; చేసి = వలన; గురువుల = గురువుల; లోన్ = అందు; ఆదిగురువవు = ఆదిగురువైనవాడవు; ఈవ = నీవే; నీవు = నీవు; బంధించినన్ = బంధించినచో; నిగ్రహమో = శిక్ష యనికాని; లజ్జయో = సిగ్గు యనికాని; నష్టియో = నష్టము యనికాని; బాధయో = బాధ యనికాని; తలంపన్ = అనుకొనను.

నిన్నున్ = నిన్ను; ఎదిరించి = ఎదిరించి; పోరాడి = యుద్ధములుచేసి; నిర్జరులు = దేవతలు {నిర్జరులు - జర (ముసలితనము) లేనివారు, వేల్పులు}; ఆదులు = మున్నగువారు; యోగీంద్రులున్ = యోగీశ్వరులు; అందెడు = చెందెడిది; అట్టి = అటువంటి; టెంకిన్ = స్థానమును; అందరే = అందుకొలేదా; తొల్లి = ఇంతకుముందు; పెక్కండ్రు = అనేకులు; హర్షమూర్తి = ఆనందస్వరూపి; ఈశ = భగవంతుడ; నీ = నీ; ఎడన్ = అందు; దుర్లభము = సాధ్యముకానిది; ఏమికలదు = ఏముంది, ఏమీలేదు.

భావము:- ఓ పరమేశ్వరా! ఆనందస్వరూపా! తల్లితండ్రులూ, అన్నదమ్ములూ, మిత్రులూ, గురువులూ, బుద్ధిచెప్పడంతో ఏమీ నష్టం కలుగదు. దానివల్ల తరువాత మేలే కలుగుతుంది. మదంతో కన్నులు కనిపించని మావంటి రాక్షసులకు నీవు సకాలంలో చెదరిపోకుండా వెలిగే చూపును ఇచ్చావు. అందువల్ల నీవు గరువులలో మొదటిగురువు అయ్యావు. నీవు నన్ను బంధించడం శిక్షగాగాని సిగ్గుగా కానీ లోటుగా కానీ బాధగా కానీ

నేను భావించను. ఇదివరలో చాలామంది రాక్షసులు నిన్ను ఎదిరించి పోరాడి యోగీశ్వరులు పొందే స్థానాన్ని పొందారుకదా స్వామీ! నీ దగ్గర అసాధ్యం అన్నది ఏముంది?

8-647-మ.

**చెలియేమృత్యువు? చుట్టమేయముఁడు? సంసేవార్థులే కింకరుల్?**
**శిలలం జేసెనె బ్రహ్మదన్ను? దృఢమే జీవంబు? నో చెల్లరే;**
**చలితం బౌట యెఱుంగ కీ కపట సంసారంబు నిక్కంబుగాఁ**
**దలఁచున్ మూఢుఁడు సత్యదాన కరుణాధర్మాదినిర్ముక్తుఁడై.**

టీక:- చెలియె = స్నేహితుడా ఏమి; మృత్యువు = మరణము; చుట్టమే = బంధువా ఏమిటి; యముడు = యమధర్మరాజు; సంసేవార్థులే = చక్కగాసేవించెడివారా ఏమి; కింకరులు = యమకింకరులు; శిలలంజేసెనె = బండరాళ్లతోచేసెనా ఏమి; బ్రహ్మ = బ్రహ్మదేవుడు; తన్ను = తనను; దృఢమే = నాశము లేనిదా ఏమి; జీవనంబున్ = బ్రతుకు; ఓ = ఓహో; చెల్లరే = అయ్యో; చలితంబు = చలించిపోవునది; ఔటన్ = అగుట; ఎఱుంగక = తెలియక; ఈ = ఈ; కపట = మాయా; సంసారంబున్ = సంసారమును; నిక్కంబు = సత్య మైనది; కాన్ = అయినట్లు; తలచున్ = భావించును; మూఢుడు = మూర్ఖుడు; సత్య = సత్యము; దాన = దానము; కరుణ = దయా; ధర్మ = ధర్మము; ఆది = మున్నగువాని నుండి; నిర్ముక్తుండు = వదలినవాడు; ఐ = అయ్యి.

భావము:- అయ్యయ్యో! మృత్యువు ఏమైనా ఆప్తమిత్రమా ఏమిటి? లేక యముడు దగ్గర చుట్టమా? యముని సేవకులు భక్తితో సేవించాలి అనేటంత బుద్ధిమంతులా ఏమిటి? పోనీ ప్రాణం ఏమైనా శాశ్వతమా? లేక ఈ శరీరాన్ని బ్రహ్మ రాళ్ళతో కానీ మలచాడా? సత్యం ఇలా ఉండగా, మూర్ఖుడు సత్యమూ దానమూ దయా ధర్మమూ మొదలైనవాటిని వదలివేస్తున్నాడు. ఈ మాయాసంసారాన్ని సత్యమని భావిస్తున్నాడు.

8-648-సీ.

**చుట్టాలు దొంగలు సుతులు ఋణస్థులు;-**
**కాంతలు సంసార కారణములు;**
**ధనము లస్థిరములు; దను వతి చంచల-**
**గార్యార్థు లన్యులు; గడచుఁగాల**

మాయువు; సత్వర మైశ్వర్య మతి శీఘ్ర-
మని కాదె తమ తండ్రి నతకరించి
మా తాత సాధుసమ్మతుఁడు ప్రహ్లాదుండు-
నీ పాదకమలంబు నియతిఁ జేరె

8-648.1-తే.

భద్రుఁ డతనికి మృతి లేని బ్రతుకుఁ గలిగె
వైరులై కాని తొల్లి మా వారుఁ గాన
రర్థివై వచ్చి నీవు న న్నడుగు టెల్ల
బద్మలోచన! నా పుణ్య ఫలము గాదె?"

టీక:- చుట్టాలు = బంధువులు; దొంగలు = చోరులు; సుతులు =పుత్రులు; ఋణస్థులు = అప్పులవాళ్ళు; కాంతలు = భార్యలు; సంసార = భవబంధములకు; కారణములు = హేతువులు; ధనములు = సంపదలు; అస్థిరములు = నిలకడలేనివి; తనువు = దేహము; అతి = మిక్కిలి; చంచల = చంచలమైనది; కార్యార్థులు = ప్రయోజనముకోరువారు; అన్యులు = శత్రువులు; గడచు = గడిచిపోవునది; కాలము = కాలము; ఆయువు = ఆయుష్షు; సత్వరము = త్వరగ తరగిపోవునది; ఐశ్వర్యమున్ = ఆశ్వర్యము; అతి = మిక్కిలి; శీఘ్రము = తొందరగాపోవునది; అని = అని; కాదె = కాదా కనుకనే; తమ = అతని యొక్క; తండ్రిన్ = తండ్రిని; అతకరించి = అతిక్రమించి; మా = మా యొక్క; తాత = పితామహుడు; సాధు = మంచివారిచే; సమ్మతుండు = అంగీకరింపబడినవాడు; ప్రహ్లాదుండు = ప్రహ్లాదుడు; నీ = నీ యొక్క; పాద = పాదములు యనెడి; కమలంబున్ = పద్మములను; నియతిన్ = నిష్ఠగా; చేరెన్ = చేరెను.

భద్రుడు = అదృష్టవంతుడు; అతని = అతని; కిన్ = కి; మృతి = మరణము; లేని = లేనట్టి; బ్రతుకున్ = జీవితము; కలిగెన్ = లభించెను; వైరులు = శత్రువులు; ఐ = అయ్యి; కాని = తప్పించి; తొల్లి = ఇంతకుముందు; మా = మాకుచెందిన; వారు = వారు; కానరు = దర్శించ లేకపోయిరి; అర్థివి = యాచకునివి; ఐ = అయ్యి; వచ్చి = వచ్చి; నీవున్ = నీవు; నన్నున్ = నన్ను; అడుగుట = దానమడుగుట; ఎల్లన్ = అంతయు; పద్మలోచన = నారాయణ; నా = నా యొక్క; పుణ్య = పుణ్యమునకు; ఫలము = ప్రతిఫలము; కాదె = కాదా ఏమి.

భావము:- పురాణపురుషా! “చుట్టాలు దొంగలు కొడుకులు అప్పులవాళ్ళు. భార్యలు ముక్తిని దూరంచేసేవారు. సంపదలు నిలకడ లేనివి. శరీరం స్థిరం కాదు. ఇతరులు తమప్రయోజనాన్నే కోరుతారు. కాలం నిలువదు. ఆయుస్సు త్వరగా గడుస్తుంది. ఐశ్వర్యం తొందరగా వెళ్ళిపోతుంది” అనుకున్నాడు పుణ్యాత్ముడైన మా తాత ప్రహ్లాదుడు. ఆయన తన తండ్రిని విడనాడి నీపాదాలను సేవించాడు. అదృష్టవంతుడైన అతనికి మరణంలేని మనుగడ దొరికింది. పూర్వం మావారు శత్రువులుగా మారితే తప్ప నిన్ను దర్శించలేకపోయారు. నీవు అర్థివై వచ్చి నన్ను దేహి అనడం మా పూర్వ పుణ్య ఫలమే కదా స్వామీ!”.

8-649-వ.

## అని యిట్లు పలుకుచున్న యవసరంబున.

టీక:- అని = అని; ఇట్లు = ఈ విధముగ; పలుకుచున్న = అనుచున్నట్టి; అవసరంబునన్ = సమయమునందు.

భావము:- ఇలా బలిచక్రవర్తి పలుకుతున్న సమయంలో. . .

8-650-శా.

## ఆ దైత్యేంద్రుఁడు పీనవక్షు, నవపద్మాక్షుం, బిశంగాంబరా
## చ్ఛాదున్నిర్మలసాధువాదు. ఘనసంసారాదివిచ్ఛేదు. సం
## శ్రీదున్,భక్తిలతాధిరోహిత హరిశ్రీపాదు, నిఃఖేదుఁ, బ్ర
## హ్లాదున్బోధకళావినోదుఁ గనియెన్ హర్షంబుతో ముందటన్.

టీక:- ఆ = ఆ; దైత్యేంద్రుడు = బలిచక్రవర్తి; పీనవక్షున్ = విశాలమైన వక్షము కలవానిని; నవ = విరిసిన; పద్మా = పద్మములవంటి; అక్షున్ = కన్నులు కలవానిని; పిశంగ = పచ్చని; అంబర = పట్టుబట్టలు; ఆచ్ఛాదున్ = కట్టుకొన్నవానిని; నిర్మల = స్వచ్ఛముగా; సాధు = మంచిగా; వాదును = మాట్లాడువానిని; ఘన = గట్టిదైన; సంసార = భవబంధములను; విచ్ఛేదున్ = తెంచుకొనినివానిని; సంశ్రీదున్ = సుగుణసంపన్నుని; భక్తి = భక్తి యనెడి; లతా = లతలతో; తిరోహిత = లొంగదీసుకొన్న; హరి = విష్ణుమూర్తి యొక్క; శ్రీ = మంగళ కరములైన; పాదున్ = పాదములు కలవానిని; నిఃఖేదున్ = దుఃఖములేనివానిని; ప్రహ్లాదున్ = ప్రహ్లాదుని; బోధకళా = జ్ఞానవిద్యలతో; వినోదున్ = ఆనందించెడివానిని; కనియెన్ = సందర్శించెను; హర్షంబు = సంతోషము; తోన్ = తోటి; ముందటన్ = ఎదురుగా.

భావము:- ఇంతలో అక్కడకి ప్రహ్లాదుడు వచ్చాడు. అతడు విశాలమైన వక్షస్థలమూ, తాజా పద్మాలవంటి కన్నులూ కలవాడు; పచ్చని పట్టువస్త్రాన్ని కట్టుకున్నవాడు; చక్కగా మాట్లాడడంలో నిపుణుడు; సంసారపు బంధాలను తెగత్రెంచుకున్న సుగుణసంపన్నుడు; భక్తితో భగవంతుని పాదాలను లోబరచుకున్నవాడు; దుఃఖాన్ని పారద్రోలి జ్ఞానవిద్యతో ఆనందించేవాడు; అటువంటి ప్రహ్లాదుణ్ణి బలిచక్రవర్తి సంతోషంగా దర్శించాడు.

## ప్రహ్లా దాగమనము

8-651-వ.

ఇట్లు సమాగతుండైన తమ తాతం గనుఁగొని విరోచన నంద నుండు వారుణపాశబద్ధుండుఁ గావునఁ దనకుం దగిన నమస్కా రంబు జేయ రామింజేసి సంకులాశ్రువిలోల లోచనుండై సిగ్గుపడి నత శిరస్కుండై నమ్రభావంబున మ్రొక్కుచెల్లించె; నంతఁబ్రహ్లా దుఁడు ముఖమండపం బున సునందాది పరిచర సమేతుండై కూర్చున్న వామన దేవునిం గని యానంద బాష్పజలంబులుఁ బులకాంకురంబులున్ నెఱయ దండప్రణామం బాచరించి యిట్లని విన్నవించె.

టీక:- ఇట్లు = ఈ విధముగ; సమాగతుండు = వచ్చినట్టివాడు; ఐన = అయిన; తమ = వారి యొక్క; తాతన్ = తాతను; కనుగొని = చూసి; విరోచననందనుండు = బలిచక్రవర్తి; వారుణపాశ = వరుణపాశములతో; బద్ధుండు = కట్టబడినవాడు; కావునన్ = కనుక; తన = అతని; కున్ = కి; తగిన = తగినట్టి; నమస్కారంబు = నమస్కారములు; చేయరామిన్ = చేయలేకపోవుట; చేసి = వలన; సంకుల = పొర్లిపోవుతున్న; అశ్రు = కన్నీళ్లతో; విలోల = చలించిన; లోచనుండు = కన్నులు కలవాడు; ఐ = అయ్యి; సిగ్గుపడి = లజ్జితుడై; నత = వంచిన; శిరస్కుండు = తల కలవాడు; ఐ = అయ్యి; నమ్ర = నమ్రతగల; భావంబునన్ = విధముగా; మ్రొక్కుచెల్లించెన్ = నమస్కరించెను; అంతన్ = అంతట; ప్రహ్లాదుండు = ప్రహ్లాదుడు; ముఖమండపంబున = మొగసాల; సునంద = సునందుడు; ఆది = మున్నగు; పరిచర = పరిచరులతో; సమేతుండు = కలిసియున్న వాడు; ఐ = అయ్యి; కూర్చున్న = కూర్చొని యున్న; వామనదేవునిన్ = వామనావతా

రుని; కని = చూసి; ఆనంద = సంతోషపు; బాష్పజలంబులు = కన్నీళ్ళు; పులకాంకురంబులున్ = పులకింతలు; నెఱయన్ = వ్యాపించగా; దండప్రణామంబు = సాష్టాంగనమస్కారములు; ఆచరించి = చేసి; ఇట్లు = ఇలా; అని = అని; విన్నవించె = మనవిచేసెను.

భావము:- బలి చక్రవర్తి తన తాత రాక గమనించినా, వరుణపాశాలతో కట్టివేయబడి ఉన్నందు వలన, అతడు ప్రహ్లాదుడికి నమస్కారం చేయడానికి వీలుకాలేదు. బలిచక్రవర్తి కన్నులలో కన్నీళ్ళు పొంగాయి; అతడు సిగ్గుతో తలవంచుకున్నాడు; వినయంగా తలవంచి తాతకు మ్రొక్కు చెల్లించాడు. అప్పుడు, ప్రహ్లాదుడు మొగసాలలో సునందుడూ మొదలైన వారితో కూర్చుని యున్న వామనదేవుని చూసాడు; సంతోషంతో అతని కన్నులు చెమ్మగిల్లాయి; ఒడలు పులకరించింది; అతడు స్వామికి సాగిలబడి నమస్కరించి ఇలా మనవి చేసాడు.

8-652-సీ.

"ఇతనికి మున్ను నీ వింద్రపదం బిచ్చి-
నేఁడు త్రిప్పుటయును నెఱయమేలు
మోహనా హంకృతి మూలంబు గర్వాంధ-
తమస వికారంబు దాని మాన్పి
కరుణ రక్షించుటఁగాక బంధించుటే?-
తత్త్వజ్ఞునకు మహేంద్రత్వమేల?
నీ పాదకమలంబు నియతిఁ గొల్చిన దాని-
బోలునే సురరాజ్య భోగపరత?

8-652.1-తే.

గర్వ మేపారఁ గన్నులు గానరావు;
చెవులు వినరావు; చిత్తంబు చిక్కుపడును;
మఱచు నీ సేవలన్నియు మహిమ మాన్పి
మేలు చేసితి నీ మేటి మేర చూపి."

టీక:- ఇతను = ఇతను; కిన్ = కి; మున్ను = ఇంతకుముందు; నీవు = నీవు; ఇంద్ర = ఇంద్రుని; పదంబు = పదవిని; ఇచ్చి = ఇచ్చి; నేడు = ఇవాళ; త్రిప్పుటయును =

తొలగించుట; నెఱియ = చాలా; మేలు = మంచిది; మోహన = అజ్ఞానమునకు; అహంకృతి = అహంకారమునకు; మూలంబు = కారణమైనది; గర్వ = గర్వము యనెడి; అంధతమస = కారుచీకటి; వికారంబు = కలిగించెడిది; దానిన్ = అట్టిదానిని; మాన్పి = పోగొట్టి; కరుణన్ = దయతో; రక్షించుట = కాపాడుట; కాక = తప్పించి; బంధించుటే = శిక్షించుటా కాదు; తత్త్వజ్ఞున్ = బ్రహ్మజ్ఞానికి; మహేంద్రత్వము = ఇంద్రపదవి; ఏల = ఎందుకు; నీ = నీ యొక్క; పాద = పాదములు యనెడి; కమలంబున్ = పద్మములను; నియతిన్ = నిష్ఠగా; కొల్చినన్ = సేవించినచో; దానిన్ = దానికి; పోలునే = సాటివచ్చునా రాదు; సురరాజ్య = ఇంద్రత్వమును; భోగపరత = అనుభవించుట.

గర్వమున్ = గర్వము; ఏపారన్ = పెరుగుటవలన; కన్నులు = కళ్ళు; కానరావు = కనిపించవు; చెవులు = చెవులు; వినరావు = వినపించవు; చిత్తంబు = మనసు; చిక్కు పడును = సంకటపడును; మఱచున్ = మరచిపోవును; నీ = నిన్ను; సేవలు = సేవించుటలు; అన్నియున్ = అన్నిటిని; మహిమన్ = నీ మహిమతో; మాన్పి = పోగొట్టి; మేలు= మంచిపని; చేసితి = చేసితివి; నీ = నీ యొక్క; మేటి = అధిక్యము యొక్క; మేర = ఎల్ల; చూపి = చూపించి.

భావము:- "స్వామీ నీవు వీనికి మొదట ఇంద్రపదవి ఇచ్చావు. మరల దానిని ఈనాడు తొలగించడంతో చాలా మేలు అయింది. ఆ పదవి అజ్ఞానానికి అహంకారానికీ మూలకారణం అయి ఉన్నది; గర్వం అనే కారుచీకటిని కలిగించేది; అట్టి దానిని దయతో పోగొట్టుట రక్షించడమే; అంతేకాని ఈ బంధనం శిక్షించడం కాదు; పరమాత్మని తెలుసుకున్నవానికి ఇంద్రపదవి ఎందుకూ కొరగానిది; అది నీపాద సేవకు సాటిరాదు; ఇంద్రపదవిలో గర్వం పెరిగి కన్నులు కనిపించవు; చెవులు వినిపించవు; మనస్సుకు మైకం కమ్ముతుంది; నిన్ను మరచిపోతాడు. అటువంటి పదవిని విడిపించి వీనికి గొప్ప ఉపకారమే చేసావు.".

8-653-వ.

## అని పలికి జగదీశ్వరుండును నిఖిలలోక సాక్షియు నగు నారాయణ దేవునకునమస్కరించి, ప్రహ్లాదుండు పలుకుచున్న సమయంబున.

టీక:- అని = అని; పలికి = పలికి; జగత్ = లోకములకు; అధీశ్వరుండును = ప్రభువు; నిఖిల = సమస్తమైన; లోక = లోకములకు; సాక్షియున్ = దర్శనుండు; అగు = అయిన;

నారాయణ = విష్ణువు యసెడి; దేవున్ = దేవుని; కున్ = కి; నమస్కరించి = నమస్కారముచేసి; ప్రహ్లాదుండు = ప్రహ్లాదుడు; పలుకుచున్న = పలుకుతున్నట్టి; సమయంబునన్ = సమయమునందు;

భావము:- లోకనాథుడూ లోకదర్శకుడూ అయిన విష్ణుదేవునకు ప్రహ్లాదుడు నమస్కరించి అలా పలుకుతున్న సమయములో.

8-654-మ.

**త**తమత్తద్విపయాన యై కుచ నిరుం**ధ**చ్చోళ సంవ్యానయై
**ధృ**తభాష్పాంబు వితాన యై కరయుగా**ధీ** నాలికస్థానయై
"**ప**తిభిక్షాం మమ దేహి కోమలమతే! **ప**ద్మాపతే!" యంచుఁ ద
**త్స**తివింధ్యావళి చేరవచ్చెఁ **త్రి**జగ**ద్ర**క్షామనున్ వామనున్.

టీక:- తత్ = ఆ; మత్త = మదించిన; ద్విప = గజమువంటి; యాన = గమనము గలయామె; ఐ = అయ్యి; కుచ = వక్షస్థలమును; నిరుంధత్ = గట్టిగా; చోళ = పైటచెరగు; సంవ్యాన = చుట్టకొన్నామె; ఐ = అయ్యి; ధృత = కారిన; భాష్పాంబు = కన్నీటి; వితాన = సమూహములు కలామె; ఐ = అయ్యి; కర = చేతులు; యుగా = రెండును; అధీన = ఆయత్తము చేసిన; అలికస్థాన = నుదుటిప్రదేశము కలామె; ఐ = అయ్యి; పతి = భర్త అను; భిక్షాన్ = భిక్షను; మమ = నాకు; దేహి = పెట్టుము; కోమలమతే = మృదువైన మనసు కలవాడ; పద్మాపతే = లక్ష్మీపతీ; అంచున్ = అనుచు; తత్ = ఆ; సతి = ఇల్లాలు; వింధ్యావళి = వింధ్యావళి; చేరన్ = దగ్గరకు; వచ్చెన్ = వచ్చెను; త్రిజగత్ = ముల్లోకములను; రక్ష = కాపాడుట; ఆమనున్ = సమృద్ధిగా కలవానిని; వామనున్ = వామనుని.

భావము:- ఆసమయంలో బలిచక్రవర్తి భార్య వింధ్యావళి కన్నీరు కారుస్తూ మందగమనంతో అచ్చటికి వచ్చింది. ఆమె వక్షస్థలం నిండా గట్టిగా పైట చెరగు బిగించుకుని ఉంది. రెండుచేతులనూ నుదిటిపై జోడించి "దయామయా! లక్ష్మీపతీ! నాకు పతిభిక్షపెట్టు" అంటూ ముల్లోకాలకూ ప్రభువైన వామనమూర్తిని వేడుకున్నది.

8-655-వ.

వచ్చి యచ్చేడియ తచ్చరణ సమీపంబునం బ్రణతయై
నిలువంబడి యిట్లనియె.

టీక:- వచ్చి = వచ్చి; ఆ = ఆ; చేడియ = వనిత; తత్ = అతని; చరణ = పాదముల; సమీపంబునన్ = వద్ద; ప్రణత = నమస్కరించినది; ఐ = అయ్యి; నిలువంబడి = నిలబడి; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- అలా చేరవచ్చిన ఆఇల్లాలు వింద్యావళి స్వామిపాదాలకుమ్రొక్కి ఇలా అన్నది.

8-656-క.

"నీకుంగ్రీడార్థము లగు
లోకంబులఁ జూచి పరులు లోకులు కుమతుల్
లోకాధీశుల మందురు
లోకములకు రాజవీవ లోకస్తుత్యా!

టీక:- నీ = నీ; కున్ = కు; క్రీడార్థము = సంచరించు విహారస్థలాలు; అగు = అయిన; లోకం బులన్ = లోకములను; చూచి = చూసి; పరులు = ఇతరులు; లోకులు = ప్రజలు; కుమ తుల్ = మూర్ఖులు; లోక = లోకములకు; అధీశులము = పాలకులము; అందురు = అనుకొ సెదరు; లోకముల్ = సర్వలోకములకు; రాజవు = రాజువు; ఈవ = నీవు మాత్రమే; లోక స్తుత్యా = నారాయణ {లోకస్తుత్య - సర్వలోకముల స్తుతింపబడువాడు, విష్ణువు}.

భావము:- “ఓ లోకపూజ్యుడా! లోకాలు నీకు సంచరించే విహార స్థలాలు. నిజానికి లోకాలకు రాజువు నీవే. కాని తెలివిలేని మూర్ఖులు ఈ లోకాలకు తామే పాలకులని భావిస్తారు.

*8-657-క.

కా దనఁడు పొమ్ము లే దీ
రా దనఁడు జగత్త్ర యైక రాజ్యము నిచ్చెన్
నా దయితుఁ గట్టనేటికి?
శ్రీదయితాచిత్తచోర! శ్రితమందారా!"

టీక:- కాదు = కాదు; అనడు = అన్నవాడుకాదు; పొమ్ము = వెళ్ళిపో; లేదు = లేదు; ఈరాదు = ఇవ్వలేను; అనడు = అన్నవాడుకాదు; జగత్రయ = ముల్లోకములయొక్క; ఏక = మొత్తము; రాజ్యమున్ = రాజ్యాధికారమును; ఇచ్చెన్ = ఇచ్చివేసెను; నా = నా

యొక్క; దయితున్ = భర్తను; కట్టన్ = బంధించుట; ఏటికి = ఎందుకు; శ్రీదయితాచిత్తచోర = నారాయణ {శ్రీదయితాచిత్తచోరుడు - లక్ష్మీదేవియొక్క చిత్తచోర (మనసు దొంగిలించిన వాడు), విష్ణువు}; శ్రితమందార = నారాయణ {శ్రితమందార - ఆశ్రయించినవారికి కల్పవృక్షము వంటి వాడు, విష్ణువు}.

భావము:- ఆశ్రిత జనుల పాలిటి కల్పవృక్షమా! “కాదు, లేదు, పో, ఇవ్వను” అన లేదు కదా. మొత్తం ముల్లోకాల రాజ్యాన్ని నీకు ఇచ్చేసాడు కదా! ఇంకెందుకు స్వామీ! లక్ష్మీపతీ! నా పతిని బంధిస్తున్నావు?

## హిరణ్యగ ర్భాగమనము

8-658-వ.

### అని యిట్లు వింధ్యావళియుం బ్రహ్లాదుండును విన్నవించు నవసరంబున హిరణ్యగర్భుండు చనుదెంచి యిట్లనియె.

టీక:- అని = అని; ఇట్లు = ఈ విధముగ; వింధ్యావళియున్ = వింధ్యావళీదేవి; ప్రహ్లాదుం డును = ప్రహ్లాదుడు; విన్నవించు = మనవిచేసెడి; అవసరంబునన్ = సమయమునందు; హిరణ్యగర్భుండు = బ్రహ్మదేవుడు {హిరణ్యగర్భుడు - హిరణ్య (బంగారు అండము) నందు గర్భుడు (జనించిన వాడు), బ్రహ్మదేవుడు}; చనుదెంచి = వచ్చి; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- ఇలా ప్రహ్లాదుడూ వింధ్యావళీ విన్నవించు సమయమున బ్రహ్మదేవుడు వచ్చి వామనుడి రూపంలో ఉన్న శ్రీమహావిష్ణువుతో ఇలా అన్నాడు.

8-659-సీ.

”భూతలోకేశ్వర! భూతభావన! దేవ-
దేవ! జగన్నాథ! దేవవంద్య!
తన సొమ్ము సకలంబుఁ దప్పక నీ కిచ్చె-
దండయోగ్యుఁడు గాడు దానపరుఁడుఁ;
గరుణింప నర్హుండు గమలలోచన! నీకు-
విడిపింపు మీతని వెఱపు దీర;

తోయపూరము చల్లి దూర్వాంకురంబులఁ-
జేరి నీ పదము లర్చించునట్టి

8-659.1-తే.

భక్తియుక్తుఁడు లోకేశుపదము నందు
నీవు ప్రత్యక్షముగ వచ్చి నేఁడు వేఁడ
నెఱిఁగి తన రాజ్య మంతయు నిచ్చి నట్టి
బలికిఁ దగునయ్య! దృఢపాశబంధనంబు?”

టీక:- భూతలోకేశ్వరా = నారాయణ {భూతలోకేశ్వరుడు - భూతలోక (సమస్తమైన ప్రాణులకు) ఈశ్వరుడు, విష్ణువు}; భూతభావన = నారాయణ {భూతభావన – సమస్త ప్రాణులచేత ధ్యానించబడువాడు, విష్ణువు}; దేవదేవ = నారాయణ {దేవదేవ – మహా గొప్ప దేవుడు, విష్ణువు}; జగన్నాథ = నారాయణ {జగన్నాథ - సర్వ లోకాధిపతి, విష్ణువు}; దేవవంద్య = నారాయణ {దేవవంద్యుడు - దేవతలచే వంద్యుడు (స్తుతింపబడువాడు), విష్ణువు}; తన = తన యొక్క; సొమ్ముమ్ = సందలను; సకలంబున్ = సమస్తము; తప్పక = వదలక; నీకున్ = నీకు; ఇచ్చెన్ = ఇచ్చివేసెను; దండ = శిక్షించుటకు; యోగ్యుడు = తగినవాడు; కాడు = కాడు; దానపరుడున్ = దాత; కరుణింపన్ = దయచూచుటకు; అర్హుండు = తగినవాడు; కమలలోచన = పద్మాక్ష; నీ = నీ; కున్ = కు; విడిపింపుము = బంధవిముక్తుని చేయుము; ఈతని = ఇతని యొక్క; వెఱపు = బెదురు; తీరన్ = పోవునట్లు; తోయపూరము = జలములను; చల్లి = చల్లి; దూర్వాంకురములన్ = గరికపోచలతో; చేరి = దగ్గరకొచ్చి; నీ = నీ యొక్క; పదములన్ = పాదములను; అర్చించునట్టి = పూజించెడి.

భక్తి = భక్తి; యుక్తుడు = కలవాడు; లోకేశుపదమునందు = సర్వలోకాధిపతివైన; నీవు = నీవు; ప్రత్యక్షముగ = ఎదురుగ; వచ్చి = వచ్చి; నేడు = ఇవాళ; వేడన్ = అడుగుగ; ఎఱిగి = తెలిసికూడ; తన = తన యొక్క; రాజ్యమున్ = రాజ్యము; అంతయున్ = సమస్తమును; ఇచ్చిన = ఇచ్చివేసిన; అట్టి = అటువంటి; బలి = బలి; కిన = కి; తగున = న్యాయమా; అయ్య = తండ్రి; దృఢ = గట్టిగా; పాశ = తాళ్ళతో; బంధనంబు = కట్టవేయుట.

భావము:- “ఓ దేవదేవా! దేవవంద్యా! జగన్నాథా! కమాలాల వంటి కన్నులుగల శ్రీహరీ! నీవు సకల ప్రాణులకు ఈశ్వరుడవు, ఆరాధ్యనీయుడవు; బలిచక్రవర్తి గొప్పదాత.

ఇతడు నీకు తన ధనమంతా ఇచ్చేసాడు. ఇతడు శిక్షింపదగినవాడు కాదు. నీచే దయచూపదగినవాడు. ఇతని భయాన్ని పోగొట్టి బంధవిముక్తుణ్ణి చెయ్యి. ఇతడు నీ పాదాలను కోరి జలములతో అభిషేకించిన, గరిక పత్రితో పూజించిన భక్తుడు. లోకాధిపతివి అయిన నీవు స్వయంగా దరిచేరి అడగడాన్ని తెలిసి కూడా తన రాజ్యమంతా ఇచ్చేసాడు. ఇటువంటి ఈ బలిని త్రాళ్ళతో కట్టివేయడం న్యాయము కాదయ్యా!"

8-660-వ.

## అని పలికిన బ్రహ్మవచనంబులు విని భగవంతుం డిట్లనియె.

టీక:- అని = అని; పలికిన = చెప్పిన; బ్రహ్మ = బ్రహ్మదేవుని; వచనంబులు = మాటలు; విని = విని; భగవంతుండు = విష్ణుమూర్తి {భగవంతుడు - ఐశ్వర్యాదికములు కలుగుటచే పూజ్యుడైనవాడు, విష్ణువు}; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- ఇలా విన్నవించిన బ్రహ్మదేవుడి మాటలు విని భగవంతుడు అగు వామనుడు ఇలా అన్నాడు.

8-661-సీ.

"ఎవ్వనిఁ గరుణింప నిచ్ఛయించితి వాని-
యఖిల విత్తంబు నే నపహరింతు
సంసార గురుమద స్తబ్ధుఁడై యెవ్వఁడు-
దెగడి లోకము నన్ను ధిక్కరించు
నతఁ డెల్ల కాలంబు నఖిల యోనుల యందుఁ-
బుట్టుచు దుర్గతిఁ బొందుఁ బిదప
విత్త వయో రూప విద్యా బలైశ్వర్య-
కర్మ జన్మంబుల గర్వ ముడిగి

8-661.1-తే.

యేక విధమున విమలుఁడై యెవ్వఁ డుండు
వాఁడు నా కూర్చి రక్షింపవలయువాఁడు;
స్తంభ లోభాభిమాన సంసార విభవ
మత్తుఁడై చెడ నొల్లఁడు మత్పరుండు.

టీక:- ఎవ్వనిన్ = ఎవిరినైతే; కరుణింపన్ = దయచూపవలెనని; నిచ్చయించితిని = అనుకొనెదనో; వానిని = వానిని; అఖిల = సమస్తమైన; విత్తంబున్ = సంపదలను; నేన్ = నేను; అపహరింతున్ = లాగుకొనెదను; సంసార = సంసార సంబంధమైన; గురు = పెద్ద; మద = మదము చేత {మదము - 1కొవ్వు 2గర్వము, అష్టవిధమదములు 1విత్త 2వయో 3రూప 4విద్యా 5బల 6ఐశ్వర్య 7కర్మ 8జన్మల సంబంధించిన మదములు}; స్తబ్దుడు = నిస్తేజుడు; ఐ = అయ్యి; ఎవ్వడు = ఎవడైతే; లోకమున్ = లోకమును; నన్నున్ = నన్ను; ధిక్కరించున్ = తిరస్కరించునో; అతడున్ = అతను; ఎల్ల = ఎంత; కాలంబున్ = కాలమైనను; అఖిల = అనేకరకములైన; యోనులన్ = గర్భముల; అందున్ = లో; పుట్టుచున్ = పుడుతూ; దుర్గతిన్ = నరకమును; పొందున్ = పొందును; పిదపన్ = తరవాత; విత్త = ధనము; వయో = యౌవనము; రూప = అందము; విద్యా = విద్యలు; బల = బలము; ఐశ్వర్య = సంపదలు; కర్మ = వృత్తి; జన్మంబులన్ = వంశముల; గర్వమున్ = గర్వములను; ఉడిగి = విడిచిపెట్టి.

ఏకవిధమున = ఏకాగ్రముగా; విమలుడు = నిర్మలుడు; ఐ = అయ్యి; ఎవ్వడు = ఎవరైతే; ఉండున్ = ఉండునో; వాడు = అతడు; నా = నాచేత; కూర్చి = ఇష్టపడి; రక్షింపన్ = కాపాడబడ; వలయున్ = వలసిన; వాడు = వాడు; స్తంభ = అజ్ఞానము; లోభ = అత్యాశ; అభిమాన = గర్వములతో; సంసార = లౌకిక; విభవ = ప్రాభవములతే; మత్తుడు = మదిం చినవాడు; ఐ = అయ్యి; చెడన్ = నశించుటకు; ఒల్లడు = అంగీకరించడు; మత్ = నాకు; పరుండు = చెందినవాడు.

భావము:- “ఎవడి మీద నేను దయ చూపాలని అనుకుంటానో, వాడి సంపద అంతటిని అపహరిస్తాను. సంసార సంబంధమైన గొప్ప మైకంతో ఎవడు లోకాన్ని నిందించి నన్ను తిరస్కారిస్తుంటాడో, వాడు ఎప్పటికీ నానా యోనులలో పుడుతూ, చచ్చి నరకానికి పోతూ ఉంటాడు. ఎవడైతే ధనానికి, వయస్సుకు, రూపానికి, విద్యకు, బలానికి, ఐశ్వర్యానికి, వృత్తికి, జన్మకు సంబంధించిన గర్వాన్ని విడిచిపెట్టి ఎల్లప్పుడూ నిర్మలంగా

ఉంటాడో, వాడిని నేను ప్రీతితో కాపాడుతాను. నా భక్తుడు అయినవాడు అజ్ఞానంతో, దురాశతో, గర్వంతో, లౌకికసంపదలతో మదించి నశించడాన్ని ఆశించడు.

8-662-శా.

బద్ధుండై గురుశాపతప్తుఁడయి తా బంధువ్రజత్యక్తుఁడై
సిద్ధైశ్వర్యముఁ గోలుపోయి విభవక్షీణుండునై పేదయై
శుద్ధత్వంబునుసత్యముం గరుణయున్ సొంపేమియుం దప్పఁ డు
ద్బుద్ధుండై యజయాఖ్యమాయ గెలిచెం బుణ్యుం డితం డల్పుఁడే.

టీక:- బద్ధుండు = బంధింపబడినవాడు; ఐ = అయ్యి; గురు = గురువు యొక్క; శాప = శాపమువలన; తప్తుడు = తపించువాడు; అయి = ఐ; తాన్ = అతను; బంధు = బంధువుల; వ్రజ = సమూహములచే; త్యక్తుడు = విడువబడినవాడు; ఐ = అయ్యి; సిద్ధ = ప్రాప్తించిన; ఐశ్వర్యమున్ = సంపదలు; కోలుపోయి = నశించి; విభవ = ప్రాభవములు; క్షీణుండున్ = నశించినవాడు; ఐ = అయ్యి; పేద = పేదవాడు; ఐ = అయ్యి; శుద్ధత్వంబు నన్ = స్వచ్ఛతను; సత్యమున్ = సత్యమును; కరుణయున్=దయను; సొంపున్ = ప్రసన్నతలను; ఏమియున్ = ఏమాత్రము; తప్పడు = విడువలేదు; ఉద్బుద్ధుండు = జ్ఞాని; ఐ = అయ్యి; అజయ = అజయ (గెలువసాధ్యముకాని); ఆఖ్యన్ =పేరుకలిగిన; మాయన్=మాయను; గెలిచెన్= జయించెను; పుణ్యుడు = పుణ్యాత్ముడు; ఇతడు = ఇతగాడు; అల్పుడే = తక్కువవాడా కాదు.

భావము:- ఈ పుణ్యాత్ముడు బంధింపబడ్డాడు. గురువు శాపంవలన పరితాపానికి గురయ్యాడు. బంధువులనుండి విడువబడ్డాడు. ప్రాప్తించిన అధికారాన్ని ఐశ్వర్యాన్నీ కోల్పోయి పేదవాడు అయ్యాడు. ఐనా నిర్మలంగా ఉన్నాడు. సత్యాన్ని దయనూ సన్మార్గాన్ని వదలకుండా ఉన్నాడు. జ్ఞానియై గెలవడానికి సాధ్యంకాని అజయ అని పేరు పడ్డ మాయను గెలిచాడు. ఇతడు చాలా గొప్ప మహనీయుడు.

8-663-ఆ.

అసురనాథుఁ డనుచు ననఘుని మర్యాద
యేను జూత మనుచు నింత వలుక
నిజము పలికె నితఁడు నిర్మలాచారుండు
మేలుమేలు నాకు మెచ్చువచ్చు.

టీక:- అసుర = రాక్షసులకు; నాథుడు =రాజు; అనుచున్=అనుచు; అనఘుని= పుణ్యుని; మర్యాద = మంచినడవడిని; ఏను = నేను; చూతము = పరీక్షించెదము; అనుచున్ = అనుకొనగా; ఇంతవలుక = ఇంతవరకు; నిజమున్ = సత్యమునే; పలికెన్ =పలికెను; ఇతడు = ఇతను; నిర్మల = నిర్మలమైన; ఆచారుండు = నడవడికగలవాడు; మేలుమేలు = చాలా మంచిది; నా = నా; కున్ = కు; మెచ్చువచ్చు = మెప్పుగొలుపు తున్నది;

భావము:- ఇతడిని పుణ్యాత్ముడైన రాక్షసేశ్వరుడిగా ఆదరించాలనే ఉద్దేశంతోనే నేను ఇంతవరకూ ఊరకున్నాను. ఇతడు మంచి నడవడి కలవాడు; సత్యవాది; మేలు మేలు ఈతని ప్రవర్తనకు నాకు మెప్పుకలుగుచున్నది.

## రాక్షసుల సుతల గమనంబు

8-664-క.

**సావర్ణి మనువు వేళను**
**దేవేంద్రుండగు నితండు దేవతలకు; దు**
**ర్భావిత మగు నా చోటికి**
**రావించెద; నంతమీఁద రక్షింతు దయన్.**

టీక:- సావర్ణి = సావర్ణి; మనువు = మనువు; వేళను = కాలమునందు; దేవేంద్రుండు = దేవేంద్రుడు; అగున్ = అగును; ఇతండు = ఇతను; దేవతల్ = దేవతల; కున్ = కుకూడ; దుర్భావితము = ఊహించసాధ్యంకానిది; అగున్ = అయినట్టి; ఆ = ఆ; చోటి = పదవి; కిన్ = కి; రావించెదన్ = తీసుకొని వచ్చెదను; అంతమీద = ఆ తరువాత; రక్షింతున్ = కాపాడెదను; దయన్ = దయతో.

భావము:- సావర్ణి మనువు కాలంలో ఇతడు దేవతలకు ప్రభువై దేవేంద్రుడు అవుతాడు. దేవతలకు సైతం ఊహించడానికీ వీలుకాని ఆ పదవికి నేనే పిలిపిస్తాను. తరువాత దయతో కాపాడతాను కూడ.

8-665-క.

వ్యాధులు దప్పులు నొప్పులు
బాధలుఁ జెడి విశ్వకర్మభావిత దనుజా
రాధిత సుతలాలయమున
నేధిత విభవమున నుండు నితఁ డందాకన్."

టీక:- వ్యాధులు = రోగములు; దప్పులు = కష్టములు; నొప్పులు = నొప్పులు; బాధలు = బాధలు; చెడి = లేకుండపోయి; విశ్వకర్మ = విశ్వకర్మచేత; భావిత = సృష్టింపబడినట్టి; దనుజ = రాక్షసులచే; ఆరాధిత = సేవింపబడెడి; సుతలాలయమునన్ = సుతలలోకమున; ఏధిత = వృద్ధిపొందినట్టి; విభవమునన్ = వైభవముతో; ఉండున్ = ఉండును; ఇతండు = ఇతను; అంత = అప్పటి; దాకన్ = వరకు.

భావము:- రోగాలూ శ్రమలూ ఆపదలూ దుఃఖాలు లేకుండా; విశ్వకర్మ చేత సృష్టింపబడిన సుతలలోకంలో, అంతవరకూ ఇతడు దానవుల సేవలు అందుకుంటూ. ఐశ్వర్యంతో వైభవాలతో ఉంటాడు."

8-666-వ.

అని పలికి బలిం జూచి భగవంతుం డి ట్లనియె.

టీక:- అని = అని; పలికి = పలికి; బలిన్ = బలిని; చూచి = చూసి; భగవంతుండు = విష్ణుడు; ఇట్లు = ఈ విధముగ; అనియె = చెప్పెను.

భావము:- ఈవిధంగా పలికిన భగవంతుడు అయిన వామనుడు బలిచక్రవర్తి తో ఇలాఅన్నాడు.

8-667-సీ.

"సేమంబు నీ కింద్రసేన మహారాజ!-
 వెఱవకు మేలు నీ వితరణంబు;
వేలుపు లం దుండ వేడుక పడుదురు-
 దుఃఖంబు లిడుములు దుర్మరణము
లాతురతలు నొప్పు లందుండు వారికి-

నొందవు సుతల మందుండు నీవు;
నీ పంపు జేయని నిర్జరారాతుల-
నా చక్ర మేతెంచి నఱకుచుండు;

8-667.1-ఆ.

లోకపాలకులకు లోనుగా వక్కడ
నన్యు లెంతవార లచట? నిన్ను
నెల్ల ప్రొద్దు వచ్చి యేను రక్షించెదఁ
గరుణతోడ నీకుఁ గానవత్తు.

టీక:- సేమంబు = మేలుకలుగును; నీ = నీ; కున్ = కు; ఇంద్రసేనమహారాజ = ఇంద్రసేన మహారాజ; వెఱవకు = బెదరిపోకు; మేలు = శ్రేష్ఠమైనది; నీ = నీ యొక్క; వితరణంబు = దాతృత్వము; వేలుపులు = దేవతలు; అందున్ = అక్కడ; ఉండన్ = ఉండుటకు; వేడుక = ఉత్సుకత; పడుదురు = పొందెదరు; దుఃఖంబులు = దుఃఖములు; ఇడుములు = కష్టములు; దుర్మరణము = దుర్మరణములు; ఆతురతలు = ఆతృతలు; నొప్పులు = బాధలు; అందున్ = అక్కడ; ఉండు = ఉండెడి; వారి = వారల; కిన్ = కు; ఒందవు = పొందవు; సుతలము = సుతలము; అందున్ = లో; ఉండు = ఉండుము; నీవు = నీవు; నీ = నీ యొక్క; పంపుజేయని = ఆజ్ఞనులెక్కచేయని; నిర్జరారాతులన్ = రాక్షసులను {నిర్జరారాతులు - నిర్జరుల (దేవతల) ఆరాతులు (శత్రువులు), రాక్షసులు}; నా = నా యొక్క; చక్రము = చక్రము; ఏతెంచి = వచ్చి; నఱుకుచుండున్ = సంహరించును.

లోకపాలకుల = ఏలోకపాలకుల; కున్ = కి; లోనుకావు = లొంగియుండవు; అక్కడ = అక్కడ; అన్యులు = ఇంక ఇతరులు; ఎంతవారలు = ఎంతటివారు; అచటన్ = అక్కడ; నిన్నున్ = నిన్ను; ఎల్ల = అన్ని; ప్రొద్దున్ = వేళలందు; వచ్చి = వచ్చి; ఏను = నేను; రక్షించెదన్ = కాపాడెదను; కరుణ = దయ; తోడన్ = తోటి; నీ = నీ; కున్ = కు; కానవత్తున్ = కనిపించుతుంటాను.

భావము:- “ఇంద్రసేనమహారాజా! నీకు మేలు కలుగుతుంది. భయపడవద్దు. నీ త్యాగం శ్రేష్ఠమైనది. సుతలలోకంలో ఉండడానికి దేవతలు సైతం కుతూహల పడతారు. అంత చక్కటి ఆ లోకంలోనివారికి దుఃఖమూ, కష్టమూ, దుర్మరణమూ, రోగబాధలూ, కీడు కలగవు. అటువంటి లోకంలో నీవు ఉండు. నీ ఆజ్ఞమీరిన రాక్షసులను నా చక్రం

నరుకుతుంది. ఆ లోకంలో దిక్పాలకులకు నీ మీద అధికారం ఉండదు. ఇంక ఇతరులను లెక్కించేది ఏముంది. ఎల్లప్పుడూ నేను నిన్ను రక్షిస్తుంటాను. కనికరంతో కనిపెట్టి ఉంటాను.

8-668-క.

దానవ దైత్యుల సంగతిఁ
బూనిన నీ యసురభావమును దోడ్తో మ
ద్ధ్యానమునఁ దలఁగి పోవును
మానుగ సుతలమున నుండుమా మా యాజ్ఞన్."

టీక:- దానవ = దానవుల {దానవులు - కశ్యపునకు దనువు వలన కలిగిన పుత్రులు, రాక్షసులు}; దైత్యుల = దైత్యుల {దైత్యులు - కశ్యపునకు దితి వలన కలిగిన పుత్రులు, రాక్షసులు}; సంగతిన్ = తోకూడుటవలన; పూనిన = కలిగిన; నీ = నీ యొక్క; అసురభావ మున్ = రాక్షసత్వమును; తోడ్తోన్ = వెంటనే; మత్ = నా యొక్క; ధ్యానమునన్ = ధ్యానము వలన; తలగిపోవును = తొలగిపోవును; మానుగ = మనోజ్ఞంగా, సంతోషంగా; సుతలమునన్ = సుతలమునందు; ఉండుమా = ఉండుము; మా = మేము; ఆజ్ఞన్ = చెప్పినట్లుగా.

భావము:- దైత్యదానవుల కలయికవలన నీకు కలిగిన రాక్షసత్వం నన్ను ధ్యానించడం వలన త్వరలో తొలగిపోతుంది. మా ఆజ్ఞప్రకారంగా సంతోషంగా సుతలంలో ఉండు."

8-669-వ.

అని యిట్లు పలుకుచున్న ముమ్మూర్తుల ముదుకవేల్పు తియ్యని నెయ్యంపుఁ బలుకుఁ జెఱకు రసంపుసోనలు వీనుల తెరువులం జొచ్చి లోనుబయలునిండి ఱెప్పల కప్పు దప్పం ద్రోచికొని కనుఁగవ కొలంకుల నలుగులు వెడలిన చందంబున సంతసంబునం గన్నీరు మున్నీరై పఱవ, నురఃఫలకంబునం బులకంబులు కులకంబులయి తిలకంబులొత్తఁ, గేలుమొగిడ్చి నెక్కొన్నవేడుకం ద్రొక్కుడు పడుచుఁ జిక్కని చిత్తంబునఁ జక్కని మాటల రక్కసుల ఱేఁ డిట్లనియె.

టీక:- అని = అని; ఇట్లు = ఈ విధముగ; పలుకుచున్న = పలుకుచున్నట్టి; ముమ్మూర్తుల = త్రిమూర్తులందు; ముదుకవేల్పు = వృద్ధదేవుని; తియ్యని = తియ్యటి; నెయ్యంపు = స్నేహపూరిత; పలుకున్ = మాటలు యనెడి; చెఱకురసంపు = చెరకురసము యొక్క; సోనలు = జల్లులు; వీనుల = చెవుల; తెరువులన్ = ద్వారా; చొచ్చి = ప్రవేశించి; లోను = లోపల; బయలున్ = బయట; నిండి = నిండిపోయి; ఱెప్పలన్ = కనురెప్పలను; తప్పందోచుకొని = తొలగదోసుకొని; కన్ను = కళ్లు; గవ = రెంటి (2); కొలంకులన్ = కొలకులు యనెడి; అలుగులున్ = తూమునుండి; వెడలిన = వెలువడిన; చందంబునన్ = విధముగ; సంతసంబునన్ = సంతోషమువలన; కన్నీరు = కన్నీరు; మున్నీరు = ప్రవాహములు; ఐ = అయ్యి; పఱవన్ = ప్రవహించగా; ఉరఃఫలకంబునన్ = వక్షస్థలమునందు; పులకంబులున్ = పులకరింతలు; కులకంబులు = అంకురించినవి; అయి = అయ్యి; తిలకంబులొత్తన్ = అతిశయించినవికాగా; కేలు = చేతులు; మొగిడ్చి = జోడించి; ఎక్కొన్న = అధికమైన; వేడుకన్ = కుతుకముతో; త్రొక్కుడుపడుచు = తడబడుతు; చిక్కని = దృఢమైన; చిత్తంబు నన్ = మనసుతో; చక్కని = చక్కటి; మాటలన్ = మాటలతో; రక్కసుల = రాక్షసుల; ఱేడు = రాజు; ఇట్లు = ఇలా; అనియె = పలికెను.

భావము:- ఇలా ప్రీతితో పరమాత్ముడు పలికిన తియ్యని మాటలు బలిచక్రవర్తి చెవులలో చెరకురసపు జల్లులవలే దూరి, లోపలా బయటా నిండాయి. సంతోష బాష్పాలు రెప్పల చాటునుండి త్రోసుకుంటూ కాలువలై వెలువడి ప్రవహించాయి. వక్షస్థలమంతా పులకాంకుర ములు నిండాయి. అప్పుడు బలిచక్రవర్తి మిక్కిలి వేడుకతో చేతులు జోడించాడు. స్థిరమైన మనస్సుతో మెల్లగా ఇలా అన్నాడు.

8-670-ఉ.

"ఎన్నడు లోకపాలకుల నీ కృపఁ జూడని నీవు నేఁడు న
న్నున్నతుఁ జేసి నా బ్రతుకు నోజయు నానతి యిచ్చి కాచి తీ
మన్నన లీ దయారసము మాటలు పెద్దఱికంబుఁ జాలవే?
పన్నగతల్ప! నిన్నెఱిఁగి పట్టిన నాపద గల్గనేర్చునే?"

టీక:- ఎన్నడున్ = ఎప్పుడు; లోక = లోకములను; పాలకులన్ = పరిపాలించెడివారిని కూడ; ఈ = ఇంత; కృపన్ = దయతో; చూడని = చూడనట్టి; నీవు = నీవు; నేడు = ఇవాళ; నన్నున్ = నన్ను; ఉన్నతున్ = గొప్పవానినిగ; చేసి = చేసి; నా = నా యొక్క; బ్రతుకున్ = జీవితమును; ఓజయున్ = తేజస్సును; ఆనతియిచ్చి = కలుగజేసి; కాచితి = కాపాడితివి; ఈ = ఇట్టి; మన్ననలు = గౌరవించుటలు; ఈ =

ఇట్టి; దయారసమున్ = కరుణ; మాటలు = మాటలు; పెద్దఱికంబున్ = మర్యాదలు; చాలవే = సరిపోవా, సరిపోవును; పన్నగతల్ప = శేషశాయి; నిన్నున్ = నిన్ను; ఎఱిగి = తెలిసి; పట్టినన్ = ఆశ్రయించినచో; ఆపద = కష్టము; కల్గనేర్చునే = కలుగగలదా, కలుగదు.

భావము:- "ఓ శేషశాయిశయనా! శ్రీమహావిష్ణూ! నీవు దిక్పాలకుల మీద కూడా ఏనాడూ ఇంతటి దయచూపలేదు. ఈనాడు నన్ను గొప్పగా గౌరవించావు. నా జీవితానికి తేజస్సును ఇచ్చి కాపాడావు. ఈ మన్ననా, ఈ కరుణా, ఈ మాటలు, మర్యాదా నాకు చాలు. నిన్ను తెలుసుకొని ఆశ్రయించినవారికీ ఎన్నడూ కష్టాలు కలుగవు."

8-671-వ.

**అని పలికి హరికి నమస్కరించి బ్రహ్మకుం బ్రణామంబు జేసి, యిందుధరునకు వందనం బాచరించి, బంధవిముక్తుండై తన వారలతోఁ జేరికొని బలి సుతలంబునకుం జనియె; నంత హరికృపావశంబునం గృతార్థుండై కులోద్ధారకుండయిన మనుమనిం గని సంతోషించి ప్రహ్లాదుండు భగవంతున కిట్లనియె.**

టీక:- అని = అని; పలికి = పలికి; హరి = విష్ణుని; కిన్ = కి; నమస్కరించి = నమస్కార ముచేసి; బ్రహ్మ = బ్రహ్మదేవుని; కున్ = కి; ప్రణామంబు = నమస్కారము; చేసి = చేసి; ఇందుధరున్ = పరమశివుని; కిన్ = కి; వందనంబు = నమస్కారము; ఆచరించి = చేసి; బంధ = బంధములనుండి; విముక్తుడు = విడుదలైనవాడు; ఐ = అయ్యి; తనవారల = తనవారి; తోన్ = తోటి; చేరికొని = కలిసి; బలి = బలి; సుతలంబున్ = సుతలమున; కున్ = కు; చనియెన్ = వెళ్ళెను; అంత = అప్పుడు; హరి = విష్ణుని; కృపావశంబునన్ = దయ వలన; కృతార్థుండు = ధన్యుడు; ఐ = అయ్యి; కుల = వంశమును; ఉద్ధారకుండు = ఉద్ధరిం చెడివాడు; అయిన = ఐన; మనుమని = మనుమడిని; కని = చూసి; సంతోషించి = సంతోషించి; ప్రహ్లాదుండు = ప్రహ్లాదుడు; భగవంతున్ = విష్ణుని; కున్ = కి; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- ఇలా విష్ణుమూర్తిని స్తుతించి, బలిచక్రవర్తి విష్ణువునకూ, బ్రహ్మదేవునకూ, చంద్రశేఖరుడైన శివునికీ నమస్కరించాడు. బంధనం నుండి విడుదలపొంది తన పరివారంతో చేరి సుతలలోకానికి వెళ్ళిపోయాడు. విష్ణుమూర్తి దయతో ధన్యుడై కులాన్ని ఉద్ధరించిన మనుమణ్ణి చూచి ప్రహ్లాదుడు సంతోషించాడు. భగవంతునితో ప్రహ్లాదుడు ఇలా అన్నాడు.

8-672-సీ.

"చతురాననుఁడు నీ ప్రసాదంబు గానఁడు-
 శర్వుఁడీ లక్ష్ములఁ జూడఁ బొందఁ,
డన్యుల కెక్కడి? దసురులకును మాకు-
 బ్రహ్మాదిపూజితపదుఁడ వయిన
దుర్లభుండవు నీవు దుర్గపాలుఁడ వైతి-
 పద్మజాదులు భవత్పాదపద్మ
మకరంద సేవన మహిమ నైశ్వర్యంబు-
 లందిరి కాక యే మల్పమతుల

8-672.1-తే.

మధిక దుర్యోనులము కుత్సితాత్మకులము
నీ కృపాదృష్టిమార్గంబు నెలవు చేర
నేమి తప మాచరించితి మెన్నఁగలమె?
మమ్ముఁ గాచుట చిత్రంబు మంగళాత్మ!

టీక:- చతురాననుడు = బ్రహదేవుడు {చతురాననుడు - నాలుగుమోములవాడు, బ్రహ్మ}; నీ = నీ యొక్క; ప్రసాదంబున్ = అనుగ్రహమును; కానడు = ఇంతగా పొందలేడు; శర్వుడున్ = ఈశ్వరుడు {శర్వుడు - ప్రళయమున భూతలములను హింసించువాడు, శంకరుడు}; ఈ =ఇంతటి; లక్ష్మలన్ = ఐశ్వర్యములను; పొందడు = పొందలేడు; అన్యుల్ = ఇతరుల; కున్ =కు; ఎక్కడిది = ఎక్కడ దొరుకుతుంది; అసురుల = రాక్షసుల; కును = కు; మా = మా; కున్ =కు; బ్రహ్మ = బ్రహ్మదేవుడు; ఆది = మున్నగువారిచేత; పూజితుడవు = పూజింపబడువాడవు; అయిన =ఐన; దుర్లభుండవు = దరిచేర సాధ్యంకానివాడవు; నీవు = నీవు; దుర్గ = కోటను; పాలుడవు = కాపాడువాడవు; ఐతి = అయితివి; పద్మజ = బ్రహ్మదేవుడు; ఆదులు = మున్నగువారు; భవత్ = నీ యొక్క; పాద = పాదములు యనెడి; పద్మ = పద్మముల; మకరంద = మకరందమును; సేవన = సేవించిన; మహిమన్ = మహిమవలన;

ఐశ్వర్యంబులున్ = ఐశ్వర్యములను; అందిరి = అందుకొనిరి; కాక = అలా అయ్యుండగ; ఏము = మేము; అల్పమతులము = అల్పులము; అధిక = మిక్కిలి.

దుర్యోనులము = నీచజన్ములు కలవారము; కుత్సిత = కుత్సితమైన; ఆత్మకులము = బుద్ధికలవారము; నీ = నీ యొక్క; కృపాదృష్టి = కరుణాకటాక్షపు; మార్గంబున్ = దారిలో; నెలవు = ఉండుటను; చేరన్ = చేరుటకు; ఏమి = ఎట్టి; తపమున్ = తపస్సును; ఆచరించితిమి = చేసితిమో; ఎన్నగలమె = తెలియగలమా లేము; మమ్మున్ = మమ్ములను; కాచుట = కాపాడుట; చిత్రంబు = ఆశ్చర్యకర విషయము; మంగళాత్మా = మంగళస్వరూపా.

భావము:- "ఓ మంగళస్వరూపా! బ్రహ్మదేవుడు సైతం ఇంతగా నీ అనుగ్రహాన్ని పొందలేదు. శివుడు కూడా ఇంతగా ఆదరాభిమానాలు పొందలేదు. ఇంక ఇతరులనగా ఎంత. బ్రహ్మదేవుడు మున్నగువారిచేత నీవు పూజింపబడువాడవు. నిన్ను దరిజేరడానికి ఎవరికీ సాధ్యం కాదు. అటువంటి నీవు మారాక్షసులకు దుర్గరక్షకుడవు అయ్యావు. నీ పాదపద్మాల మకరందాన్ని సేవించిన మహిమవల్ల బ్రహ్మదేవుడు మున్నగువారు ఐశ్వర్యాన్ని పొందారు. కానీ, మేము చాలా అల్పులము. నీచజన్మ కలవారము. ఏమి తపస్సు చేయడంవల్ల మామీద నీ కరుణాకటాక్షం కురిసిందో ఊహించలేము. నీవు మమ్ములను కాపాడడం ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నది.

8-673-వ.

### అదియునుం గాక.

టీక:- అదియునున్ = అంతే; కాక = కాకుండగ. భావము:- అంతేకాకుండా.

8-674-ఆ.

### సర్వగతుఁడ వయ్యు సమదర్శనుఁడ వయ్యు
### నొకట విషమవృత్తి నుండు దరయ
### నిచ్ఛలేనివారి కీవు భక్తులు గోరు
### తలఁపు లిత్తు కల్పతరువు మాడ్కి."

టీక:- సర్వగతుడవు = అన్నిటి యందు నుండువాడవు; సమదర్శనుడవు = సర్వుల ఎడల సమదృష్టి కలవాడవు; అయ్యున్ = అయినప్పటికిని; ఒకటన్ = ఒక్కొక్కసారి; విషమవృత్తిన్ = పక్షపాతబుద్ధితో; ఉండుదు = ఉండెదవు; అరయ = తరచిచూసినచో; ఇచ్ఛ = భక్తి; లేని = లేనట్టి; వారి = వారి; కిన్ = కి; ఈవు = వరములీయవు; భక్తులు

= భక్తులు; కోరు = కోరెడి; తలపుల్ = కోరికలను; ఇత్తు = ప్రసాదించెదవు; కల్పతరువు = కల్పతరువు; మాడ్కిన్ = వలె.

భావము:- నీవు అన్నింటిలోనూ వ్యాపించి ఉంటావు. అందరిని సమానంగా చూస్తావు. అయినప్పటికీ ఒక్కొక్కసారి పక్షపాతాన్నిచూపుతావు. భక్తిలేనివారి కోరికలు తీర్చవు. కల్పవృక్షంవలె భక్తులైనవారి కోర్కెలు నెరవేర్చుతావు."

8-675-వ.

## అనివిన్నవించుచున్న ప్రహ్లాదుం జూచి పరమపురుషుం డిట్లనియె.

టీక:- అని = అని; విన్నవించుచున్న = మనవిచేసెడి; ప్రహ్లాదున్ = ప్రహ్లాదుని; చూచి = చూసి; పరమపురుషుండు = నారాయణుడు {పరమపురుషుడు - అత్యున్నతమైనవ్యక్తి, విష్ణువు}; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- ఇలా మనవిచేసిన ప్రహ్లాదుడితో పరమాత్ముడు ఇలా అన్నాడు.

8-676-తే.

## "వత్స! ప్రహ్లాద! మేలు నీ వారు నీవు
## సొరిది మనుమనిఁ దోడ్కొని సుతలమునకుఁ
## బయనమై పొమ్ము నే గదాపాణి నగుచుఁ
## జేరి రక్షింప దురితంబు చెంద దచట."

టీక:- వత్స = కుమారా; ప్రహ్లాదా = ప్రహ్లాదుడా; మేలు = సంతోషము; నీవారు = నీవారు; నీవున్ = నీవు; సొరిదిన్ = క్రమముగా; మనుమనిన్ = మనుమడిని; తోడ్కొని = వెంటబెట్టు కొని; సుతలమున్ = సుతలమున; కున్ = కు; పయనము = బయలుదేరినవాడవు; ఐ = అయ్యి; పొమ్ము = వెళ్ళుము; నేన్ = నేను; గదా = గదాయుధము; పాణిని = చేతధరించినవానిని; అగుచున్ = అగుచు; చేరి = వచ్చి; రక్షింపన్ = కాపాడుతుండగా; దురితంబు = ఏకష్టము; చెందదు = కలుగదు; అచటన్ = అక్కడ.

భావము:- "నాయనా! ప్రహ్లాదా! మంచిది. నీవు నీమనుమనితోపాటు నీవారితోపాటు సుతలలోకానికి వెళ్ళు. నేను గదాహస్తుడనై వచ్చి మిమ్ములను కాపాడుతాను. అక్కడ మీకు ఏకష్టమూ కలుగదు.

8-677-వ.

అని యిట్లు నియమించినం బరమేశ్వరునకు నమస్కరించి వలగొని కరకమల పుట ఘటిత నిటల తటుండయి, వీడ్కొని, బలిం దోడ్కొని సక లాసురయూథంబునుం దాను నొక్క మహా బిలద్వారంబు చొచ్చి ప్రహ్లాదుండు సుతల లోకంబునకుం జనియె; నంత బ్రహ్మవాదు లయిన యాజకుల సభామధ్యం బునం గూర్చున్న శుక్రునిం జూచి నారాయణుం డి ట్లనియె.

టీక:- అని = అని; ఇట్లు = ఈ విధముగ; నియమించినన్ = ఆజ్ఞాపించగా; పరమేశ్వరున్ = విష్ణుని; కున్ = కి; నమస్కరించి = నమస్కారముచేసి; వలగొని = ప్రదక్షిణచేసి {వలగొను - వలను(దక్షిణముపైపు) కొను, ప్రదక్షిణముచేయు}; కర = చేతులు యనెడి; కమల = పద్మములను; పుటఘటిత = జోడించిపెట్టబడిన; నిటలతటుండు = నుదుటిభాగము కలవాడు; అయి = ఐ; వీడ్కొని = సెలవుతీసుకొని; బలిన్ = బలిని; తోడ్కొని = వెంటబెట్టు కొని; సకల = సర్వ; అసుర = రాక్షస; యూథంబునున్ = సమూహమును; ఒక్క = ఒక; మహా = గొప్ప; బిల = గుహ; ద్వారంబు = ద్వారము; చొచ్చి = ప్రవేశించి; ప్రహ్లాదుండు = ప్రహ్లాదుడు; సుతలలోకంబున్ = సుతలమున; కున్ = కు; చనియెన్ = వెళ్ళెను; అంత = అప్పుడు; బ్రహ్మవాదులు = బ్రహ్మవేత్తలు; అయిన = ఐన; యాజకుల = ఋత్విజుల యొక్క; సభా = సమూహము; మధ్యంబునన్ = నడుమ; కూర్చున్న = కూర్చొని ఉన్న; శుక్రునిన్ = శుక్రుని; చూచి = చూసి; నారాయణుండు = విష్ణువు; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- ఈ విధంగా సుతలమునకు వెళ్ళమని ఆజ్ఞాపించిన భగవంతునికి ప్రహ్లాదుడు నమస్కరించి ప్రదక్షిణ చేసాడు. నొసటిపై చేతులు జోడించి సెలవుతీసుకున్నాడు. ఆ తరువాత, అతడు బలిచక్రవర్తినీ రాక్షసుల సమూహాన్ని వెంటపెట్టుకొని, ఒక గొప్ప గుహ గుండా సుతలలోకానికి వెళ్ళాడు. అటు పిమ్మట, మహావిష్ణువు బ్రహ్మవేత్తలైన ఋత్విజుల నడుమ సభలో కూర్చుని యున్న శుక్రాచార్యుని చూసి, ఇలా అన్నాడు.

## బలియజ్ఞమును విస్తరించుట

8-678-ఆ.



"ఏమిఁ గొఱత పడియె నీతని జన్నంబు
విస్తరింపు కడమ విప్రవర్య!
విషమ మయిన కర్మ విసరంబు బ్రాహ్మణ
జనులు చూచినంత సమతఁ బొందు."

టీక:- ఏమిన్ = ఏదైతే; కొఱతపడియెన్ = ఇంకామిగిలి ఉన్నదో; ఈతని = ఇతని యొక్క; జన్నంబు =యజ్ఞము; విస్తరింపు=నెరవేర్చుము; కడమ=మిగిలినదంతా; విప్ర=బ్రాహ్మణు లలో; వర్య = శ్రేష్ఠుడా; విషమము = సరిగా పూర్తికానిది; అయిన = ఐన; కర్మ = కార్యక్రమముల; విసరంబున్ = సమూహమును; బ్రాహ్మణ = బ్రాహ్మణులైన; జనులు = వారు; చూచిన = చూసిన; అంతన్ = అంతమాత్రముచేత; సమతన్ = సఫలతను; బొందున్ = పొందును.

భావము:- "శుక్రాచార్యా! విప్రోత్తమా! బలిచక్రవర్తి యజ్ఞంలో మిగిలిన కార్యాన్ని నెరవేర్చు లోపం ఏమాత్రం రాకూడదు. ఆగిపోయిన యజ్ఞకార్యాలు మీవంటి బ్రహ్మవేత్తలవల్ల సఫలమవుతాయి."

8-679-వ.

అనిన శుక్రుం డి ట్లనియె.

టీక:- అనిన = అనగా; శుక్రుండు = శుక్రుడు; ఇట్లు = ఇలా; అనియె = పలికెను.

భావము:- ఇలా యజ్ఞం సంపూర్తి చేయమనిన విష్ణువు తో శుక్రుడు ఇలా అన్నాడు.

8-680-సీ.

"అఖిల కర్మంబుల కధినాథుఁడవు నీవ-
యజ్ఞేశుఁడవు నీవ యజ్ఞపురుష!
ప్రత్యక్షమున నీవు పరితుష్టి నొందినఁ-
గడ మేలఁ కల్గు నే కర్మములకు?

ధనదేశకాలార్హతంత్రమంత్రంబులఁ-
    గొఱఁతలు నిన్నుఁ బేర్కొనిన మాను;
నయినఁ గావింతు నీ యానతి భవదాజ్ఞ-
    మెలఁగుట జనులకు మేలుఁ గాదె?

8-680.1-తే.

యింతకంటెను శుభము నా కెచటఁ గలుగు"
ననుచు హరిపంపు శిరమున నావహించి
కావ్యుఁ డసురేంద్రు జన్నంబు కడమఁ దీర్చె
మునులు విప్రులు సాహాయ్యమునఁ జరింప.

టీక:- అఖిల = సమస్తమైన; కర్మంబుల్ = కర్మలకు; అధినాథుడవు = పైఅధికారివి; నీవ = నీవే; యజ్ఞేశుడవు = యజ్ఞపతివి; నీవ = నీవే; యజ్ఞపురుష = యజ్ఞస్వరూప; ప్రత్యక్షమునన్ = ఎదురుగా; నీవున్ = నీవే; పరితుష్టిన్ = సంతృప్తిని; ఒందినన్ = పొందగా; కడమ = కొరతలు; ఏలకల్గున్ = ఎలాకలుగును, కలుగదు; ఏ = ఏ; కర్మముల = కర్మకాండల; కున్ = కైనను; ధన = ధనము; దేశ = ప్రదేశము; కాల = సమయము లకు; అర్హ = తగిన; తంత్ర = తంతులు; మంత్రంబులన్ = మంత్రములచేత; కొఱతలు = ప్రాప్తించిన దోషములు; నిన్నున్ = నిన్ను; పేర్కొనినన్ = తలచినచో; మానున్ = తొలగి పోవును; అయినన్ = అయినప్పటికిని; కావింతున్ = నిర్వహించెదను; నీ = నీ యొక్క; ఆనతిన్ = ఆజ్ఞమేరకు; భవత్ = నీ యొక్క; అజ్ఞన్ = ఆనతిప్రకారము; మెలగుట = నడచుట; జనుల్ = మానవుల; కున్ = కు; మేలు = ఉత్తమము; కాదే = కదా.

ఇంత = దీని; కంటెను = కంటెను; శుభము = భాగ్యము; నా = నా; కున్ = కు; ఎచటన్ = ఎక్కడ; కలుగున్ = దొరకును; అనుచున్ = అనుచు; హరి =నారాయణుని; పంపు= ఆజ్ఞను; శిరముననావహించి=తలదాల్చి;కావ్యుడు=శుక్రుడు {కావ్యుడు - కవియొక్క పుత్రుడు, శుక్రుడు}; అసురేంద్రు = బలియొక్క; జన్నంబున్ = యాగమును; కడమదీర్చె = పూర్తి చేసెను; మునులు = ఋషులు; విప్రులు = బ్రాహ్మణులు; సాహాయ్యమునన్ = తోడ్పడుతూ; చరింప = మెలగగా.

భావము:- "నీవే అన్ని కార్యాలకూ అధినాదుడవు. నీవే యజ్ఞాలకు అధికారివి. నీవు సంతోషిస్తే ఏకార్యాలకూ లోపం కలుగదు. నిన్ను ధ్యానంచేస్తే ధనానికీ దేశానికి

మంత్రతంత్రాలకూ ప్రాప్తించిన దోషాలు తొలగిపోతాయి. మంచిది. నీ ఆజ్ఞ ప్రకారమే చేస్తాను. నీ ఆజ్ఞకు లోబడి మెలగడము మానవులకు మేలు. ఇంతకంటే భాగ్యం ఏముంది." ఇలా అనిన శుక్రుడు విష్ణువు ఆజ్ఞను తలదాల్చి బలిచక్రవర్తి యాగాన్ని పూర్తి చేసాడు. అతనికి బ్రాహ్మణులూ ఋషులూ తోడ్పడ్డారు.

8-681-వ.

**ఇవ్విధంబున వామనుండయి హరి బలి నడిగి, మహిం బరిగ్రహించి, తనకు నగ్రజుండగు నమరేంద్రునకుం ద్రిదివంబు సదయుం డయి యొసంగె; నత్తరి దక్ష భృగు ప్రముఖ ప్రజాపతులును, భవుండును, గుమారుండును, దేవర్షి, పితృగణంబులును, రాజులును, దానును గూడికొని చతురాననుండుగశ్యపునకునదితికి సంతోషంబుగా లోకం బులకు లోకపాలురకు "వామనుండు వల్లభుం"డని నియమించి యంత ధర్మంబునకు యశంబునకు లక్ష్మికి శుభంబులకు దేవత లకువేదంబులకు వ్రతంబులకు స్వర్గాపవర్గంబులకు "నుపేంద్రుండు ప్రధానుం"డని సంకల్పించె నా సమయంబున.**

టీక:- ఈ = ఈ; విధంబునన్ = విధముగ; వామనుండు = పొట్టివాడుగ; అయి = అవతరించి; హరి = విష్ణువు; బలిన్ = బలిని; అడిగి = కోరి; మహిన్ = భూమిని; పరిగ్రహించి = తీసుకొని; తన = తన; కున్ = కు; అగ్రజుడు = అన్న {అగ్రజుడు - అగ్ర (ముందుగా) జుడు (పుట్టినవాడు), అన్న}; అగు = అయిన; అమరేంద్రున్ = దేవేంద్రుని; కున్ = కి; త్రిదివంబున్ = స్వర్గమును {త్రిదివము - ముల్లోకములు భూఃభువస్సువః లో మూడవది, స్వర్గము}; సదయుండు = దయ కలవాడు; అయి = ఐ; ఒసంగెన్ = ఇచ్చెను; ఆ = ఆ; తరిన్ = సమయము నందు; దక్ష = దక్షుడు; భృగు = భృగువు; ప్రముఖ = మున్నగు; ప్రజాపతు లును = ప్రజాపతులు {ప్రజాపతి - ప్రజ (సంతానసృష్టికి) పతి, బ్రహ్మ, వీరు 9మంది, నవబ్రహ్మలు}; భవుండును = పరమశివుడు {భవుడు - భవముతానైన వాడు, శివుడు}; కుమారుండును = కుమారస్వామి; దేవర్షి = దేవఋషులు; పితృగణంబులును = పితృగణములు; రాజులును = రాజులు; తానును = తను; కూడికొని = కలిసి; చతురా ననుండు =

బ్రహ్మదేవుడు; కశ్యపున్ = కశ్యపున; కును = కు; అదితి = అదితి; కిన్ = కి; సంతోషంబు = సంతోషము; కాన్ = అగునట్లు; లోకంబుల్ = సర్వలోకముల; కున్ = కు; లోకపాలుర = సమస్తలోకపాలకుల; కున్ = కు; వామనుండు = వామనుడు; వల్లభుండు = ప్రభువు; అని = అని; నియమించి = నిర్ణయించెను; అంత = అంతట; ధర్మంబున్ = ధర్మమున; కున్ = కు; యశంబున్ = యశస్సున; కున్ = కు; లక్ష్మి = సంపదల; కిన్ = కు; శుభంబుల్ = శుభముల; కున్ = కు; దేవతల్ = దేవతల; కున్ = కు; వేదంబుల్ = వేదముల; కున్ = కు; వ్రతంబుల్ = వ్రతముల; కున్ = కు; స్వర్గ = స్వర్గము; అపవర్గంబుల్ = మోక్షముల; కును = కు; ఉపేంద్రుండు = వామనుడే {ఉపేంద్రుడు - ఇంద్రుని తమ్ముడు, వామనుడు}; ప్రధానుండు = అధికారి; అని = అని; సంకల్పించెను = నిర్ణయించెను; ఆ = ఆ; సమయంబున = సమయమునందు.

<u>భావము</u>:- ఈవిధంగా విష్ణువు వామనావతామెత్తి, బలిచక్రవర్తి వద్ద భూదానం తీసుకున్నాడు. తన అన్న అయిన ఇంద్రుడికి దయతో స్వర్గలోకాన్ని ఇచ్చాడు. ఆ సమయంలో దక్షుడు, భృగువు మొదలైన ప్రజాపతులు; శివుడు; కుమారస్వామి; నారదుడు మున్నగు దేవర్షులు; పితృదేవతలు; రాజులుతో పాటు కలిసి బ్రహ్మదేవుడు “లోకాలకూ దిక్పాలకులకూ వామనుడు ప్రభువు” అని శాసనం చేసాడు. ఈ విషయం కశ్యపుడికి అదితికి సంతోషం కలిగించింది. పిమ్మట, “ధర్మానికి కీర్తికీ సంపదలకూ శుభాలకూ దేవతలకూ వేదాలకు స్వర్గానికి మోక్షానికి ఉపేంద్రుడైన వామనుడే అధికారి” అని నిర్ణయించాడు.

8-682-క.

**కమలజుఁడు లోకపాలురు**

**<u>న</u>మరేంద్రునిఁగూడి దేవ<u>యా</u>నంబున న**

**య్యమరావతికిని వామను**

**<u>న</u>మరం గొనిపోయి రంత <u>న</u>ట మీఁద నృపా!**

<u>టీక</u>:- కమలజుడు = బ్రహ్మదేవుడు {కమలజుడు - కమలమున పుట్టినవాడు, బ్రహ్మ}; లోకపాలురున్ = లోకపాలకులును; అమరేంద్రుని = దేవేంద్రునితో; కూడి = కలిసి; దేవ యానం బునన్ = ఆకాశగమనమున; ఆ = ఆ; అమరావతి=అమరావతి; కిని=కి; వామనున్ = వామనుని; అమరన్ = ఆదరముతో; కొనిపోయిరి = తీసుకుని వెళ్ళిరి; అంతనటమీద = అటుతరువాత; నృపా = రాజా {నృపుడు - నరులను పాలించువాడు, రాజు}.

భావము:- పరీక్షన్మహారాజా! అటుపిమ్మట బ్రహ్మదేవుడూ దిక్పాలకులూ దేవేంద్రుడితో కలిసి ఎంతో ఆదరంతో వామనుణ్ణి విమానంపై కూర్చోపెట్టుకుని అమరావతికి తీసుకుని వెళ్లారు.

8-683-ఆ.

బల్లిదంపుదోడు ప్రాపున నింద్రుని
కింద్రపదము చేరు టిట్లు గలిగెఁ;
దనకు నాఢ్యుఁడైన తమ్ముఁడుఁ గలిగినఁ
గోర్కులన్న కేల కొఱఁత నొందు?

టీక:- బల్లిదంపు = బలవంతుడైన; తోడు = తోడబుట్టువు; ప్రాపునన్ = దన్నువలన; ఇంద్రుని = ఇంద్రుని; కిన్ = కి; ఇంద్రపదవి = ఇంద్రత్వము; చేరుట = సమకూరుట; ఇట్లు = ఈ విధముగ; కలిగెన్ = కలిగినది; తన = తన; కున్ = కు; ఆఢ్యుడు = శ్రేష్ఠుడు; ఐన = అయినట్టి; తమ్ముడు = తమ్ముడు; కలిగినన్ = ఉన్నట్లయితే; కోర్కులు = కోరికలు; అన్న = అన్నయ్య; కిన్ = కి; ఏల = ఎందుకు; కొఱతన్ = నెరవేరకపోవుట; ఒందున్ = పొందును.

భావము:- ఈ విధంగా బలవంతుడైన తమ్ముడి ప్రాపువల్ల, ఇంద్రుడికి ఇంద్రపదవి తిరిగి లభించింది. శ్రేష్ఠుడైన తమ్ముడుంటే అన్నగారి కోరికలు నెరవేరకుండా ఉంటాయా.

8-684-క.

పా లడుగఁడు మే లడుగం
డేలఁడు భిక్షించి యన్నకిచ్చెఁ ద్రిజగమున్
వేలుపులతల్లి కడపటి
చూలుం బోలంగఁ గలరె నొలయని తమ్ముల్.

టీక:- పాలు = వంతు, భాగము; అడుగడు = కావాలనడు; మేలు = లాభమును; అడుగండు = కావాలనడు; ఏలడు = పెత్తనము చెలాయించడు; భిక్షించి = యాచనచేసి; అన్న = అన్న; కిన్ = కి; ఇచ్చెన్ = ఇచ్చెను; త్రిజగమున్ = ముల్లోకములను; వేలుపులతల్లి = అదితి {వేలుపులతల్లి - దేవతల అమ్మ, అదితి}; కడపటి = ఆఖరి, కడగొట్టు; చూలున్ = సంతానమును; పోలంగగలరె = సాటిరాగలరా లేరు; నొలయని = వెనుదీయని; తమ్ముల్ = తమ్ముళ్ళు.

భావము:- దేవతలతల్లి అదితికి కడపటివాడైన కొడుకు వామనుడు భిక్షం అడిగి సంపాదించిన ముల్లోకాలూ తన అన్నకే ఇచ్చేసాడు. అందులో భాగాన్ని అడగలేదు. లాభాన్ని అడగలేదు. ఆవిధంగా అన్నల కోసం ఎంత శ్రమపడే తమ్ముళ్ళు అయినా వామనునితో సరిపోలగలరా?

8-685-ఆ.

కడుపు బదరగాఁగ గొడుకులఁ గనుకంటె
దల్లి కొకఁడె చాలు బల్లిదుండు;
త్రిదశగణముఁ గన్న యదితి గానుపు దీఱఁ
జిన్ని మేటివడుగుఁ గన్న యట్లు.

టీక:- కడుపు = కడుపు; బదరగాగ = బద్ధలయ్యేలా; కొడుకులన్ = కొడుకులను; కను = కనుట; కంటెన్ = కంటె; తల్లి = ఏతల్లి; కిన్ = కైనను; ఒకడె = ఒక్కడైనను; చాలు = సరిపోవును; బల్లిదుండు = సమర్థుడు; త్రిదశ = దేవతల {త్రిదశులు - ఎప్పుడును 30 ఏండ్ల వయసువారివలె (యౌవనమున) ఉండువారు, దేవతలు}; గణమున్ = సమూహమును; కన్న = కనినట్టి; అదితి = అదితి; కానుపుతీఱన్ = కడుపుపండినట్లు; చిన్ని = వామనుడు; మేటి = ఉత్తముడుయైన; వడుగున్ = బ్రహ్మచారిని; కన్నట్లు = కనినట్లుగ.

భావము:- దేవతల సమూహాన్ని కన్న అదితి చివరకి అదృష్టం పండేటట్లు వామనుడిని కన్నది. కడుపు పగిలేలా పదిమందిని కనేకన్నా, ఏ తల్లికైనా అలాంటి కొడుకు ఒక్కడు చాలు.

8-686-వ.

ఇట్లు దేవేంద్రుండు వామన భుజపాలితం బగు త్రిభువనసామ్రాజ్య విభవంబు మరల నంగీకరించె; నప్పుడు బ్రహ్మయు, శర్వుం డునుఁ, గుమారుండును, భృగు ప్రముఖులయిన మునులునుఁ, బితృదేవత లును, దక్షాదిప్రజాపతులును, సిద్ధులును, వైమాని కులును మఱియుం దక్కినవారలును బరమాద్భుతంబైన విష్ణుని సుమహాకర్మంబులకు నాశ్చర్యంబు నొందుచుఁ, బ్రశంసిం

చుచు, నాడుచుం, బాడుచు, తమతమ నివాసంబులకుం జని;"రని చెప్పి శుకుం డి ట్లనియె.

టీక:- ఇట్లు = ఈ విధముగ; దేవేంద్రుండు = దేవేంద్రుడు; వామన = వామనునిచే; భుజపాలితంబు = సంపాదించబడినది; అగు = అయిన; త్రిభువన = ముల్లోకముల; సామ్రాజ్య = సామ్రాజ్యముయొక్క; విభవంబున్ = వైభవమును; మరలన్ = మళ్ళీ; అంగీకరించెన్ = స్వీకరించెను; అప్పుడు = అప్పుడు; బ్రహ్మయున్ = బ్రహ్మదేవుడు; శర్వుండును = శంకరుడు; కుమారుండును = కుమారస్వామి; భృగు = భృగువు; ప్రముఖులు = ముఖ్యమైనవారు; అయిన = ఐన; మునులు = ఋషులు; పితృదేవతలును = పితృదేవతలు; దక్ష = దక్షుడు; ఆది = మున్నగు; ప్రజాపతులును = ప్రజాపతులు; సిద్ధులును = సిద్ధులు; వైమానికులును =దేవతలు {వైమానికులు -విమానమున చరించువారు, దేవతలు}; మఱియున్ = ఇంకను; తక్కిన = మిగిలిన; వారలునున్ = వారు; పరమ = అత్యంత; అద్భుతంబు = అచ్చెరువుగొల్పెడిది; ఐన = అయిన; విష్ణుని = నారాయణుని; సు = మంచి; మహా = గొప్ప; కర్మంబుల్ = పనుల; కున్ = కి; ఆశ్చర్యంబున్ = ఆశ్చర్యమును; ఒందుచున్ = పొందుతు; ప్రశసించుచు = కీర్తించుచు; ఆడుచున్ = ఆడుతూ; పాడుచున్ = పాడుతూ; తమతమ = వారివారి; నివాసంబుల్ = స్వస్థానముల; కున్ = కు; చనిరి = వెళ్ళిరి; అని = అని; చెప్పి = చెప్పి; శుకుండు = శుకుడు; ఇట్లు = ఇలా; అనియె = పలికెను.

భావము:- అలా వామనుడు సంపాదించి ఇచ్చిన మూడులోకాల సామ్రాజ్య సంపదనూ దేవేంద్రుడు తిరిగి పొందాడు. అటుపిమ్మట బ్రహ్మదేవుడూ, శివుడూ, కుమారస్వామి, భృగువూ మొదలైన మునులూ, పితృదేవతలూ, దక్షుడూ మొదలైన ప్రజాపతులూ, సిద్ధులూ, దేవతలూ ఇంకా తక్కినవారు అందరూ విష్ణుదేవుని లీలావిలాసాలకు ముచ్చట పడుతూ పొగుడుతూ ఆటపాటలతో తమతమ నివాసాలకు వెళ్ళిపోయారు." అనిచెప్పి శుకుడు ఇలా అన్నాడు.

8-687-తే.

"మనుజనాథ! త్రివిక్రము మహిమ కొలఁది
యెఱుఁగఁ దర్కింప లెక్కింప నెవ్వఁడోపుఁ?
గుంభినీ రేణుకణములు గుఱుతు పెట్టు
వాఁడు నేరఁడు; తక్కిన వారి వశమె?

టీక:- మనుజనాథ = రాజ {మనుజనాథుడు - మనుజులకు నాథుడు (ప్రభువు), రాజు}; త్రివిక్రమున్ = త్రివిక్రముని; మహిమన్ = గొప్పదనముయొక్క; కొలది = మేర; ఎఱుగన్ = తెలియుటకు; తర్కింపన్ = ఊహించుటకు; లెక్కింపన్ = ఎంచిచూచుటకు; ఎవ్వడు = ఎవడు; ఓపున్ = సరిపోవును; కుంభినీ = భూమిలోని; రేణు = ధూళి; కణములున్ = కణములను; గుఱుతుపెట్టు = లెక్కపెట్టగల; వాడున్ = వాడుకూడ; నేరడు = సమర్థుడుకాడు; తక్కిన = ఇంకమిగిలిన; వారి = వారికి; వశమె = వీలగునా కాదు.

భావము:- “రాజా! పరీక్షిత్తూ! త్రివిక్రమావతారుడైన వామనుడి గొప్ప గుణాలను పూర్తిగా తెలుసుకోడం కానీ లెక్కించడం కానీ ఎవరికీ సాధ్యంకాదు. భూమిలోని ధూళి కణాలను లెక్కపెట్టగలిగిన వాడికైనా, ఇది సాధ్యం కాదు. ఇంక వేరేవారి సంగతి చెప్పేదేముంది.

8-688-క.

**అద్భుత వర్తనుఁడగు హరి**
**సద్భావితమైన విమలచరితము వినువాఁ**
**డుద్భట విక్రముఁడై తుది**
**నుద్భాసితలీలఁ బొందు నుత్తమ గతులన్.**

టీక:- అద్భుత = అద్భుతమైన; వర్తనుడు = నడవడిక కలవాడు; అగు = అయిన; హరి = విష్ణుని; సద్భావితము = చక్కగాతెలిపెడిది; అయిన=ఐన; విమల=నిర్మలమైన; చరితము = చరిత్ర; విను = వినెడి; వాడు = వాడు; ఉద్భట = అధికమైన; విక్రముడు = పరాక్రమము కలవాడు; ఐ = అయ్యి; తుదిన్ = చివరికి; ఉద్భాసిత = మిక్కిలి ప్రకాశించెడి; లీలన్ = విధముగా; పొందున్ = పొందును; ఉత్తమ = దివ్య; గతులన్ = పదములను.

భావము:- అత్యద్భుత మైన లీలలతోకూడిన విష్ణుమూర్తి నిర్మల వర్తనములను గురించి తెలిపే ఈపుణ్య చరిత్రను వినేవాడు గొప్ప భాగ్యవంతుడు అవుతాడు. చివరకి ప్రకాశించే ప్రభావంతో దివ్యలోకాలను పొందుతాడు.

8-689-తే.

తగిలి మానుష పైతృక దైవ కర్మ
వేళలందుఁ ద్రివిక్రమ విక్రమంబు
లెక్కడెక్కడఁ గీర్తింతు రెవ్వరేనిఁ
బొందుదురు నిత్య సౌఖ్యంబు భూవరేంద్ర!

టీక:- తగిలి = పూని; మానుష = మానవసంబంధమైన; పైతృక = పితృసంబంధమైన; దైవ = దైవసంబంధమైన; కర్మ = కార్యములను చేసెడి; వేళలు = సమయములందు; త్రివిక్రమ = త్రివిక్రముని; విక్రమంబుల్ = వర్తనలను; ఎక్కడెక్కడన్ = ఎక్కడైనను; కీర్తింతురు = కీర్తించెదరో; ఎవ్వరేనిన్ = ఎవరైతేవారు; పొందుదురు = పొందెదరు; నిత్య = ఎల్లప్పుడును; సౌఖ్యంబు = సుఖములను; భూవరేంద్ర = మహారాజ {భూవరేంద్ర - భూవరు (రాజుల)లో ఇంద్రుడు, మహారాజు}.

భావము:- పరీక్షిన్మహారాజా! మానవులకూ పితృదేవతలకూ దేవతలకూ సంబంధించిన పుణ్యకార్యాలు చేసే సమయాలలో ఎవరైతే త్రివిక్రముని చరిత్రను కీర్తిస్తుంటారో, వారు ఎప్పుడూ సర్వ సుఖాలూ పొందుతూ ఉంటారు.

8-690-మ.

జడులై నాకముఁ గోలుపోవు సురలం జంభారినిం బ్రోవఁగా
వడుగై భూమి బదత్రయం బిడుటకై వైరోచనిన్ వేఁడి రెం
డడుగుల్ సాఁచి త్రివిక్రమస్ఫురణ బ్రహ్మాండంబుఁ దా నిండుచుం
గడుమోదంబుననుండు వామనున కెక్కాలంబునన్ మ్రొక్కెదన్."

టీక:- జడులు = తెలివిలేనివారు; ఐ = అయ్యి; నాకమున్ = స్వర్గమును; కోలుపోవు = నష్టపోయిన; సురలన్ = దేవతలను; జంభారినిన్ = ఇంద్రుని {జంభారి – జంభాసురుని సంహరించినవాడు, ఇంద్రుడు}; ప్రోవగా = కాపాడుటకై; వడుగు = బ్రహ్మచారి; ఐ = అవతారమెత్తి; భూమిన్ = స్థలమును; పదత్రయమున్ = మూడడుగులను; ఇడుట = దానమిచ్చుట; కై = కోసమై; వైరోచనిన్ = బలిని; వేడి = అడిగి; రెండు = రెండు (2); అడుగుల్ = అడుగులు; సాచి = చాచి; త్రివిక్రమ = త్రివిక్రమ; స్ఫురణన్ = అవతారముతో; బ్రహ్మాండంబున్ = బ్రహ్మాండమంత; తాన్ = తానే యై; నిండుచున్ = నిండి

పోతూ; కడు = మిక్కిలి; మోదంబునన్ = సంతోషముతో; ఉండు = ఉండెడి; వామనున్ = వామనుని; ఏకాలంబునన్ = అన్నికాలములందు; మ్రొక్కెదన్ = నమస్కరించెదను.

భావము:- జంభాసురుని సంహరించిన ఇంద్రుడు, దేవతలు, అశక్తులై స్వర్గాన్ని ఓడిపోయారు. విష్ణుమూర్తి వారిని కాపాడటానికి వామనావతారం ఎత్తి, విరోచనుని కొడుకు బలిచక్రవర్తిని మూడు అడుగుల నేల దానం ఇమ్మని అడిగి పుచ్చుకున్నాడు. త్రివిక్రమావతారం ఎత్తి రెండు అడుగులు వేయడంతోనే బ్రహ్మాండం అంతా నిండిపోయి ఆనందంగా ఉండే ఆ వామనుడికి ఎప్పుడూ మ్రొక్కుతూ ఉంటాను."

8-691-వ.

**అని యిట్లు శుకుండు రాజునకు వామనావతారచరితంబు చెప్పె" నని సూతుండు మునులకుం జెప్పిన విని, వార లతని కిట్లనిరి.**

టీక:- అని = అని; ఇట్లు = ఈ విధముగ; శుకుండు = శుకుడు; రాజున్ = రాజున; కున్ = కు; వామనావతార = వామనావతారముయొక్క; చరితంబున్ = చరిత్రను; చెప్పెను = చెప్పెను; అని = అని; సూతుండు = సూతుడ; మునుల్ = మునుల; కున్ = కు; చెప్పిన = చెప్పగా; విని = విని; వారల్ = వారు; అతని = అతని; కిన్ = కి; ఇట్లు = ఈ విధముగ; అనిరి = పలికిరి.

భావము:- ఇలా శుకబ్రహ్మ పరీక్షిత్తు మహారాజునకు వామనావతార చరిత్రను చెప్పె" నని సూతమహర్షి శౌనకాదిమహర్షులకు చెప్పాగావినిన వారుసూతునితో ఇలా అన్నారు

# పూర్ణి



8-743-క.

**రాజేంద్ర! దైత్యదానవ**
**రాజమహాగహన దహన! రాజస్తుత్యా!**
**రాజావతంస! మానిత**
**రాజధరార్చిత! గుణాఢ్య! రాఘువరామా!**

టీక:- రాజేంద్ర = మహారాజా {రాజేంద్రుడు – రాజులలో ఇంద్రుని వంటివాడు, శ్రీరాముడు}; దైత్యదానవరాజమహాగహనదహన = శ్రీరామా {దైత్య దానవ రాజ మహా గహన దహనుడు – దైత్యుల యొక్క, దానవుల యొక్క రాజులు అనే గొప్ప అడవిని

దహించినవాడు, శ్రీరాముడు}; రాజస్తుత్య = శ్రీరామా {రాజ స్తుత్యుడు - రాజులచేత స్తుతింపబడువాడు, శ్రీరాముడు}; రాజావతంస = శ్రీరామా {రాజా వతంసుడు – రాజు లందరిలోను తలమానికమైనవాడు, శ్రీరాముడు}; మానిత = మన్నింపదగినవాడైన; రాజధరార్చిత = శ్రీరామా {రాజధ రార్చితుడు - రాజధరుని (చంద్రధరుడైన శివుని)చే అర్చితుడు, శ్రీరాముడు}; గుణాఢ్య = శ్రీరామా {గుణాఢ్యుడు - సుగుణసంపన్నుడు, శ్రీరాముడు}; రాఘవరామ = శ్రీరామా {రాఘవ రాముడు - రఘువంశలలాముడు, శ్రీరాముడు}.

భావము:- రాజులలో ఇంద్రుని వంటి వాడా! రాక్షస రాజులనే గొప్ప అడవిని కాల్చినవాడా! రాజులచేత స్తుతింప బడినవాడా! రాజులలో తలమానికం అయినవాడా! మహానుభావుడైన శివునిచేత పూజింపబడినవాడా! గుణసంపన్నుడా! రఘువంశ లలామా!

8-745-గ.

ఇది శ్రీపరమేశ్వరకరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజ పాండిత్య పోతనామాత్య ప్రణీతంబయిన శ్రీమహాభాగవత పురాణంబను మహాప్రబంధంబునందలి యష్టమ స్కంధము లోని వామనావతారంబును, శుక్రబలిసంవాదం బునుఁ, త్రివిక్రమ విస్ఫురణంబును, రాక్షసుల సుతల గమనంబును నను కథలుఁ గల వామన విజయము అని ఉపాఖ్యానంబు సుసంపూర్ణంబు.

***ఓం నమో భగవతే వాసుదేవాయ!!***

***ఓం! ఓం! ఓం!***

***ఓం! శాంతిః! శాంతిః! శాంతిః!***

***సర్వే జనా స్సుఖినో భవతు!!***